# ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయాలు



ఎం. దత్తాత్రేయ శర్మ

శ్రీరామ సిద్ధాంతి ప్రచురణలు
నేరేడ్‌మెట్, సికిందరాబాదు
1992

MUTNOORI KRISHNARAO GARI SAMPADAKIYALU
[Editorials of Sri Mutnoori Krishna Rao. Former Editor of Krishna Patrika 1903 to 1945]

A M. Phil. Thesis of M. DATHATHREYA SHARMA from Osmania University 1989

---





ప్రథమ ముద్రణ : డిసెంబర్ 1992
ప్రతులు : 1000
ముఖచిత్రాలంకరణ : ఆర్. శ్యాంసుందర్

వెల : 48/-



ప్రతులకు :
ఎం. వెంకటరమణ శర్మ
'శ్రీరామ సదనం' ఇం. నెం. 29-1499/6/1
కాకతీయ నగర్, రోడ్ నం. 1
నేరేడ్ మెట్, సికిందరాబాదు - 556

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/B/1,
న్యూ బాకారం, గాంధీనగర్,
హైదరాబాద్ - 500 380
ఫోన్ : 611413

# కృత్యంజలి



అన్నపూర్ణమ్మ మాయమ్మ అన్నపూర్ణ
రాజమౌళియె మా తండ్రి రాజమౌళి
తత్కుమారుడ నగు సుకృతమ్ము వలన
నీ కృతిని వారి కంకిత మిత్తు భక్తి.

ఆచార్య ఎస్వీ రామారావు
అధ్యక్షులు, తెలుగు విభాగం
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 7.

# మేలిపలుకు

ముట్నూరి కృష్ణారావుగారు కారణజన్ములు. ఆంగ్లేయుల పరిపాలనలో ఆత్మ విస్మృతి పథంలో కొట్టుమిట్టాడుతూ నైరాశ్యానికి గురి అయిన జాతిలో కృష్ణాపత్రిక ద్వారా చైతన్యాన్ని ఉద్దీప్తం చేసిన పుణ్యపురుషులు. కృష్ణాపత్రిక సంపాదకీయాలు తెలుగు జాతికి మేలుకొలుపులుగా పనిచేసిన మేలిపలుకులు. దత్తాత్రేయశర్మ ముట్నూరివారి సంపాదకీయాలను లోచూపుతో అవలోకించి ఉత్తమ పరిశోధనా గ్రంథం వెలువరించారు. రెండువేల సంపాదకీయాలను వర్గీకరించి, విశ్లేషించి వానిలోని మేలినిగ్గులను ప్రదర్శించారు. కృష్ణాపత్రిక న్యూస్‌పేపర్ కాక వ్యూస్ పేపర్ అని పేర్కొనటం సముచితంగా ఉంది.

తన పరిశోధనా వ్యాసానికి భూమికగా ముట్నూరి వారి జీవిత రేఖలు, దర్బారు విశేషాలు, కృష్ణాపత్రిక చరిత్రను సంక్షిప్తంగానే అయినా సమగ్రంగా విశదీకరించారు. సంపాకీయాలలోని భాషావిశేషాలను, శైలిలోని వివిధ దశలను విశదీకరించిన ప్రకరణం ఈ సిద్ధాంత వ్యాసానికి అలంకారప్రాయంగా పేర్కొనదగింది. అనుబంధంగా కూర్చిన సంపాదకీయాల పట్టిక పరిశోధకుని నిర్నిద్ర పరిశ్రమకు ప్రతిఫలం. పరిశోధనాంశానికి న్యాయం చేకూర్చిన దత్తాత్రేయశర్మను హృదయ పూర్వకంగా అభినందిస్తూ, అతని పరిశీలనా చక్షువు క్రాంతదర్శి కావాలని ఆకాంక్షిస్తున్నాను.

సికింద్రాబాదు
ఎస్.వి. రామారావు

తేది. 12 నవంబర్ 1992

**ఆచార్య ఎం. కులశేఖరరావు**
తెలుగు శాఖాధ్యక్షులు (రిటైర్డు)
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు-7.

# మంగళాశాసనం

ఇటీవల సాహిత్యానికీ పత్రికా రచనకూ చాలా భేదం కన్పిస్తున్నది కానీ, ప్రారంభంలో పత్రికా రచయితలందరూ గొప్ప సాహిత్యకులే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు చేసిన రచనలలో చాలా భాగము పత్రికా ముఖాన వెలువడినట్టివే. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, సురవరం ప్రతాపరెడ్డిగారు యింకా అనేకులు పత్రికలనే తమ సాహిత్య నిర్మాణానికి మాధ్యమంగా పెట్టుకొన్న సంగతి మనందరికీ తెలిసిందే. ముట్నూరి కృష్ణారావుగారు కూడా కృష్ణా పత్రికను సాహిత్య పత్రికగాను, తన రచనలను విలువైన సాహితీ ఖండికలుగాను తీర్చినట్లుగా కనిపిస్తుంది. బహుశః యీ విశేషాన్ని మనస్సులో పెట్టుకొని కాబోలు వర్ధిష్ణువు ఎం. దత్తాత్రేయశర్మ తన పరిశోధనాంశానికి కృష్ణారావుగారి సంపాదకీయాలను ఎంపిక చేసుకున్నాడు. ముట్నూరి కృష్ణారావుగారు గొప్ప బుద్ధిజీవి. దూరాలోచన, సూక్ష్మాలోచన, సమాలోచన, విజ్ఞత, పాండిత్యము కల్గిన వ్యక్తిత్వం ఆయనది. ఈ విశేషాలన్నీ ఆయన చేసిన రచనల్లో విశేషంగా ఆయన సంపాదకీయాల్లో దర్శన మిస్తాయి.

కృష్ణారావుగారు సాహిత్య ఋషి. పత్రికా రచనను తపస్సుగా భావించి ఏకాగ్రతతో దానిని ఆచరించినారు. అందువలననే ఆయన చెప్పిన వాక్యం సూత్రప్రాయమైంది. ఆయన వ్రాసిన వాక్యాలు లోకంలో శాశ్వతంగా నిలిచిపోయినాయి.

ముట్నూరివారు గొప్ప పండితులు. సంస్కారగతమైన సనాతన విద్య ఆయనకు అమితంగా అబ్బింది. కులపతి రఘుపతి వెంకటరత్నం నాయుడు వంటి వారి శిష్యత్వం చేయడం చేత ఆధునిక విద్యతోపాటు భావాలను కూడా జీర్ణం చేసుకున్నాడు గాంధీగారి అహింసా తత్త్వాన్ని అతి సన్నిహితంగా

దర్శించి సొంతం చేసుకున్నాడు. ఇవన్నీ చేరితే కృష్ణారావుగారి వ్యక్తిత్వం ఎంత గొప్పగా ఉండవలెనో అంత గొప్పగా రూపొందింది. ఈ మహానుభావుడు ఆంధ్ర సంస్కృత భాషలతోపాటు ఆంగ్ల సాహిత్యాన్ని అధ్యయనం చేసి, దాని లోని పరమార్థాన్ని గ్రహించిన మేధావి. అందుచేత యీయన దర్బారులో మాట్లాడినా, కృష్ణా పత్రికలో వ్యాసాలు వ్రాసినా, సంపాదకీయాలు నిర్వహించినా, సభల్లో ఉపన్యసించినా అనంతమైన ఆయన వ్యక్తిత్వమే సాక్షాత్కరించింది.

ఇప్పటి పత్రికలవలె కృష్ణాపత్రిక ఒక పత్రిక కాదు. అది ఒక సంస్థ, ఒక జీవన విధానము. ఒక జాతి సంస్కృతికి అభివ్యక్తి. ఒక మహానుభావుని తపస్సమాగతఫలము. అందుచేతనే తెలుగు జాతిని ఎంతో కాలం ఉత్తేజ పరచింది. జాగృతం చేసింది. స్వాతంత్ర్యోద్యమంలో ముందుకు నడిపింది. సాహిత్య ఉద్యమాలకు అద్దంపట్టింది. రచయితలను తయారుచేసింది. పండితు లను లోకానికి ప్రదర్శించింది.

ముట్నూరి కృష్ణారావు, ఆయన నిర్వహించిన కృష్ణాపత్రిక యథార్థానికి ఒకటే. దత్తాత్రేయ శర్మ ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయాలను గ్రహించి చాలా విషయాలను విమర్శించి విశ్లేషించినాడు, వివరించినాడు. తెలుగువారు గడచిన మహోజ్వల వృత్తాంతాలను విస్మరిస్తున్న సందర్భంలో యీ పరిశోధనా వ్యాసం ప్రయోజనవంతంగా భాసిస్తుందనడంలో నాకు సందేహం లేదు. పరిశోధకునికి నా అభినందనలు. దత్తాత్రేయ శర్మకు నా మంగళా శాసనము.

ఎం. కులశేఖరరావు.

11-11-1992
B 10 F 3
విజ్ఞానపురి
విద్యానగర్,
హైదరాబాద్.

**ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం**
ఆంధ్రాచార్యులు 'తెలుగుసాహితి'
హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం
హైదరాబాదు 500 135.

# మంచి ప్రయోగం

తెలుగువారి జీవితంలో కొన్ని తెలుగు పత్రికలు మరుపురాని విలువలకు ప్రతీకలుగా నిలిచిపోయాయి. అటువంటి వాటిల్లో కృష్ణాపత్రిక ఒకటి. దానికి ముఖ్యకారణం ముట్నూరివారి సంపాదకీయాలు. కృష్ణాపత్రిక భారతీయులైన తెలుగువారి ఆలోచనలకు, అనుభూతులకు, తాత్త్వికచింతనకు, సామాజిక సభ్యతకు, సాహిత్యరసికత్వానికి ప్రాతినిధ్యం వహిస్తున్న పత్రికగా ముట్నూరివారి సారథ్యంలో రూపొందింది. అలనాటి ఆ అక్షర అనుభూతి ఆంధ్రజాతిలో కలకాలం ఒక చారిత్రక సత్యంగా, సార్వకాలిక మూల్యంగా నిలిచిపోయింది. పత్రికా ప్రపంచంలో తెలుగువారికి కృష్ణాపత్రిక ఒక ప్రమాణానికి ప్రమాణం; ముట్నూరివారు సంపాదకులకే ఒక సమున్నతాదర్శం.

జీవితరంగంలో తాము నిర్వహిస్తున్న బాధ్యతాయుతమైన పదవులకు సముచితమైన జీవనవర్తనాన్ని రూపొందించుకొని ఆదర్శరూప గౌరవాన్ని ప్రజాహృదయాలలో పదిలపరచుకొనే ప్రజ్ఞామూర్తులు కొందరు మాత్రమే ఉంటారు. భావకవిగా కృష్ణశాస్త్రిగారి ఇమేజ్ అటువంటిది. కవిసమ్రాట్‌గా విశ్వనాథ వారి వ్యక్తిత్వం అలాంటిది. జాతీయ నాయకునిగా ఆంధ్రకేసరి మూర్తిమత్వం అటువంటిది. అలాగే పత్రికా సంపాదకులుగా ముట్నూరివారి వేషం, భాష, వర్తనం, పాండిత్యం, వ్యక్తిత్వం, మూర్తిమత్వం, దర్శనం - అన్నీ కలిపిన సమన్వయమూర్తి అటువంటిది. ముట్నూరివారి మూర్తిమత్వమే కృష్ణాపత్రిక అంతస్సత్వం. దానికి అక్షర రూపమే సంపాదకీయాలు. వాటిని గురించి మిత్రులు ఎం. దత్తాత్రేయశర్మగారు పరిశోధనకు పూనుకోవటం హర్షదాయకం.

శ్రీ దత్తాత్రేయ శర్మగారు శ్రద్ధాభక్తులున్న సంప్రదాయ విద్వాంసులు. విద్యార్థిగా ఉన్నప్పుడే ఉత్తమశ్రేణిలో ఉత్తములుగా ఉత్తీర్ణులై విజ్ఞుల ప్రశంస

లకు పాత్రులైనారు. ఆ తరువాత ఈ పరిశోధన వ్యాసంగాన్ని నాకు ఆత్మీయులైన డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారి వద్ద సాగించటం ఆసక్తిని కలిగించింది. ఇరివెంటి వారు తెలుగు సాహిత్యంలోనూ, జాతీయ జీవనంలోనూ ఉత్తమ మూల్యాలను పాటించిన వ్యక్తులను గురించి, సన్నివేశాలను గురించి గాఢంగా చదివి, స్పందించి, వివేచించి, ఎదుటివారు కూడా తమ లాగా ఉత్తేజితు లయ్యేటట్లు చెప్పగలిగిన ధీమంతులు. వారికి ముట్నూరివారన్నా, ముట్నూరి రచనలన్నా, సంపాదకీయాలన్నా ఎంతో అభిమానం. మే మిద్దరం వరంగల్లు కళాశాలలో కలిసి పనిచేసినప్పుడు కృష్ణమూర్తిగారి అభిమానాంశాల మీద వారే స్వయంగా మిత్రులతో కలిసి చేసిన గోష్ఠులలో పాల్గొనే అదృష్టం కలిగింది. కృష్ణమూర్తిగారు తన్మయరసావేశంతో మాట్లాడుతుంటే భారతీయాత్మ మిత్రసమ్మితంగా మాకు ప్రబోధిస్తున్నట్లుండేది. ఎన్నో విలువైన విషయాలను అలవోకగా సంభాషణలలో వ్యాఖ్యానించి చెప్పేవారు కృష్ణమూర్తిగారు. ఒక తరం రూపాంతరంగా మా మధ్య మాట్లాడుతున్నదా! అన్నంత అనుభూతిని, ఆశ్చర్యాన్ని మిత్రులకు కలిగించేవారు. వారి పర్యవేక్షణ లభించటం దత్తాత్రేయ శర్మగారి అదృష్టం.

దత్తాత్రేయ శర్మగారు సుశిక్షితమైన మనఃప్రవృత్తి కలవారు. అలాగే ఉన్నది వారి పరిశోధన ప్రణాళిక కూడా. కృష్ణపత్రిక మొదటి సంచిక నుండి పరిశీలించి, సంపాదకీయాల పట్టికను తయారుచేసి, దానిని సిద్ధాంత వ్యాసంలో అనుబంధంగా సంతరించి, విషయ విశ్లేషణం చేసి, అన్వయించి, వ్యాఖ్యానించిన శ్రద్ధ గమనిస్తే శాస్త్రీయత, ప్రామాణికత అనే రెండు అంశాలను అన్ని విధాల గౌరవించినట్లున్నది. సామగ్రి సేకరణ వినియోగాలలో పరిశోధకునికి గల నిష్ఠ రచనకు ఒక సుశిక్షితమైన జీవితాన్ని అందిస్తుంది. ఆ లక్షణం ఈ గ్రంథంలో ఆమూలాగ్రం ప్రత్యక్షమౌతూ ఉంది.

ఈ పరిశోధన సంపాదకీయాలమీద. ఈ మాట వినగానే పఠిత మొట్టమొదట సంపాదకుడంటే ఎవరు? అతని బాధ్యత లేమిటి? సంపాదకీయ స్వరూప స్వభావాలెలా ఉంటాయి? ఎలా ఉండాలి? తెలుగులో ఎలా ఉన్నాయి? మొదలైన అంశాలను గురించి తెలుసుకోవాలని ఉత్కంఠతో ఈ గ్రంథం తెరుస్తాడు. శ్రీ దత్తాత్రేయ శర్మగారు ఈ అంశాలను కూడా నాలుగో అధ్యా

యంలో, మొదటి రెండు అనుబంధాల్లో పొందుపరిచారు. అంటే పరిశోధనకు కావలసిన సమస్యల నన్నింటిని అధ్యయనం చేసి వాటి లక్ష్యలక్షణాలను సేకరించి సమకూర్చటం ఇందులో సమర్థనీయంగా జరిగిందన్నమాట!

ఎన్నుకొన్న పరిశోధనాంశంలో సహజంగా అమరివున్న కొన్ని శాఖలుంటాయి. వాటికి తగినంత ప్రాధాన్యాన్ని కలిగించి ప్రణాళికలో స్థానాన్ని ఏర్పరచటం పరిశోధకుని కర్తవ్యం. ఈ అంశంలో కూడా శ్రీ దత్తాత్రేయశర్మ గారు సముచితమైన విధానాన్నే అనుసరించారు. ఎలాగంటే - ఈ గ్రంథంలో మొత్తం ఆరు అధ్యాయాలున్నాయి. అవి ఉండదగినవి కాబట్టి, ఉండవలసిన వరుసలో ఉన్నాయి అని అనిపించుకొనే విధంగా ఉండటం విశేషం.

'ముట్నూరి వారి సంపాదకీయాల' మీద పరిశోధన. ముట్నూరి వారి జీవిత విశేషాలు, వ్యక్తిత్వం గురించి వివరించే మొదటి అధ్యాయం మొదటనే ఉండటం సముచితం. ఈ గ్రంథం నాలుగో అధ్యాయమైన 'సంపాదకుడు-సంపాదకీయం' అనే అంశంతో మొదలు అయినట్లయితే అదొకరకమైన ప్రణాళిక సిద్ధమయ్యేది. అయితే యిప్పటి అయిదో అధ్యాయానికి అందివుచ్చుకొనేటట్లుగా ఉండేది కాదు. పఠిత సౌకర్యం దృష్టితో చూచినా, నవ్యసమన్వయ దృష్టితో చూచినా ఈ గ్రంథంలో ఇప్పుడున్న పద్ధతియే విశేష ఫలదాయకంగా గోచరిస్తుంది. ఇంతగా ఎందుకు వ్రాస్తున్నానంటే వస్తు విభాగం పైకి స్థూలంగా, సులభంగా ఉన్నట్లు కనపడ్డా లోనారసి చూస్తే అందులోని మర్మం లోతుగా అవగతమౌతుంది.

కృష్ణాపత్రిక చరిత్ర ముట్నూరి వారి సంపాదకీయాలకు ప్రాతిపదిక. దర్బారు చరిత్ర సంపాదకీయాలకు పుట్టినిల్లు. ఈ రెండూ రెండు అధ్యాయాలుగా చిత్రించబడటం ఔచిత్యం.

ఈ పరిశోధన ప్రధాన రంగం అయిదవ అధ్యాయం. విశ్లేషణకు, వివేచనకు, సమీక్షకు, వివరణకు సమయోచిత ప్రాముఖ్యాన్ని కలిగిస్తూ రచించి పరిశోధన గౌరవాన్ని రక్షించారు శర్మగారు. ఆరవ అధ్యాయం శిల్ప పరీక్ష వంటిది, సంపాదకీయానికి సాహిత్య గౌరవాన్ని కలిగించిన కొద్దిమంది తెలుగు పత్రికా సంపాదకులలో అగ్రగణ్యులైన ముట్నూరి వారి సంపాదకీయ సమీక్ష

పత్రికా రచనా విలువలతోపాటు సాహిత్య ప్రమాణాలను గూడ సంపదించు కొన్నది. ఉభయ శిల్ప మర్యాదలను పాటించారు శ్రీ దత్తాత్రేయ శర్మగారు. ఈ మధ్య వెలువడిన ఎం.ఫిల్. పరిశోధన వ్యాసాలలో ఎన్న దగిందనిపించు కొన్నారు.

ముట్నూరివారి సంపాదకీయాలపై పరిశోధన ఒక మృష్టాన్న భోజన సంతృప్తిని కలిగిస్తున్నది. పఠిత ఆశించినది గ్రంథంలో పుష్కలంగా ప్రత్యక్ష మౌతుంది. రచన మంచి పుస్తకాన్ని చదివిన సంతృప్తిని కలిగిస్తుంది. మంచి ప్రయోగం.

మిత్రులు శ్రీ దత్తాత్రేయ శర్మగారికి హృదయపూర్వక శుభాకాంక్షలు!

'శ్రీవాణి'
హైదరాబాదు,
29-11-1992

జి.వి. సుబ్రహ్మణ్యం

శ్రీ ఉమాపతి పద్మనాభశర్మ
ఆంధ్రోపన్యాసకులు,
ప్రభుత్వ జూనియర్ కళాశాల, దుబ్బాక
మెదక్ జిల్లా

# ఆత్మీయం

ఎంత ప్రచ్ఛన్నంగా దాగి ఉన్నా సమకాలీన వాస్తవికతలు సాహిత్య రచనలలో ప్రతిఫలించడం తప్పనట్లే, ఎంత సామయిక సన్నివేశాలతోనో, సంఘటనలతోనో, ఉద్యమాలతోనో, ఉత్తేజాలతోనో కూడిన తత్కాల ప్రయోజనాపేక్షితములైన పత్రికా రచనలు ప్రతిభావంతుడి చేతిలో సార్వకాలీనమైన సాహిత్యమూల్యాలని సంతరించుకోవడం అనివార్యం.

యథాతథ వార్తా కథనం, వార్తల మీద వ్యాఖ్యలు, ఒక ప్రముఖమైన సంఘటన పైననో, వర్తమాన వస్తువు మీదనో, వ్యక్తి గురించో, సమస్య సంబంధంగానో, సామాజికావసరాల దృక్పథంతో మరేదైనా అప్రస్తుత విషయాన్ని గురించో, ప్రజలకి ఒక క్రొత్త అవగాహన కలిగించడం కోసం సంక్షిప్తంగానైనా కొంత సమగ్రతతో వ్రాయబడే వ్యాసాలు స్థూలంగా పత్రికా రచన అనే మాటకి అర్థాలు కావచ్చు. అయితే కళాత్మకమై సార్వకాలిక ప్రయోజనాన్ని ఆశించి చేయబడిన 'సాహిత్య సృజన' కూడా పత్రికా రచన కాకుండా పోతుందనడానికి ఆస్కారమేమీ ఉండక్కర్లేదు. ఒక్కొక్కప్పుడు తత్కాలోద్దిష్టమైన రచనే యాదృచ్ఛికంగానో రచయిత ప్రతిభాసామర్థ్యాల వల్లనో ఓ కళాఖండంగా రూపు దాల్చడం, అతిశ్రద్ధగా లక్షణ విధేయంగా, సిద్ధాంతబద్ధంగా సౌందర్య నిక్షేపణాపేక్షతో వెలువరించబడిన రచన చిత్రంగా కతిపయ దినపర్యంతాయుర్దాయ పరిమితమై నీరుగారి పోవడం జరుగవచ్చు. ఇది నిస్సందేహంగా రచయిత అంతరంగ శక్తికి సంబంధించిన విషయమే.

బహుళజనావగాహనమే లక్ష్యమై, తత్కాల ప్రయోజన సాధనమే ఫలమై వెలువరింపబడిన పత్రికా సంపాదకీయాలు కాలదోషంపట్టకుండా సాహిత్య సత్యంతో నిలబడ గల్గడం ఆశ్చర్యం. సాహితీ క్షేత్రానికి సంబంధించిన

ఆలంకారికత, రసాత్మకత, కవితామయత, శిల్పం, శైలి, వ్యంగ్యం మొదలైన సరంజామా అనిమిత్తకమై తీవ్రమైన భావ మథనం ద్వారా ఉద్బుద్ధమయ్యే నిసర్గ స్వచ్ఛమైన తాత్త్విక‌ సౌందర్యం, సత్యదర్శనం శ్రీ ముట్నూరి కృష్ణా రావు గారి సంపాదకీయాలకు శాశ్వతత్వాన్ని సమకూర్చి పెట్టాయనిపిస్తుంది.

ఒక ఉత్కృష్టమైన రచనకి - అది ఏ రకం రచనైనా - సందేశాత్మకత, కళాత్మకత అనే ప్రధానమైన రెండంశాలలో ఏది మరీ మరీ ప్రధానం? దేనికేది విధేయంగా ఉన్నా సరిపోతుంది? లేక రెంటిలో ఒకదానికి మాత్రం ప్రాధాన్యం ఇస్తే సరిపోతుందా? లేక రెండూ సమ ప్రాధాన్యములా? మొదలైన ప్రశ్నలు సాహిత్య మీమాంసకులకు వదలివేస్తే ఒక మోస్తరు సహృదయ పాఠకుడికి రచన ద్వారా కావలసింది అతడు విశ్లేషించుకోవలసిన అవసరంలేని ఒక జీవం - ఒక ప్రాణశక్తి - ఒక అంతస్పందన - ఒక ఆత్మీయత. ఒక ఇదమిత్థంగా చెప్పరానిదేదో అది. చెప్పడానికి అక్కరకూడా లేనిదేదో అది. తనను తాను మలచుకోవడానికీ మరచిపోవడానికీ సహకరించేదేదో అది. లోక మోహనమై, శోకమోచనమైనదేదో అది. కర్తవ్యాన్ని శక్తిమంతంగా ఉపదేశించే దేదో అది. రాజకీయాన్ని గురించినదైనా, సంస్కరణకు సంబంధించింది అయినా, యుద్ధ విషయికమైనదైనా దేశభక్తి ప్రబోధాత్మకమైనా కృష్ణారావు గారి సంపాదకీయంలో ఆ చైతన్యం అడుగడుగునా కనబడుతుంది.

పత్రికా రచనకీ సాహిత్య రచనకీ మధ్యగల భేద సాదృశ్యాలను బేరీజు వేయదలంచితే ఈ సందర్భంలో తప్పకుండా చెప్పుకోదగిన దేమంటే ఎంత గొప్పగా ఉన్నా పత్రికా రచన తత్కాలోద్దిష్టమూ, ఎంత చప్పగా ఉన్నా సాహిత్య రచన సర్వకాల ప్రభావాకాంక్షితమూ అనేది సత్యం కాదనే సత్యం. ఏ రచనైనా ప్రజా హృదయంలో చిరముద్ర వేసుకుని కూచోవాలంటే వస్తువు కంటే వస్తువుతోబాటు అది మలచబడే తీరు ప్రధాన హేతువౌతుంది. కాల దోషం పట్టని పత్రికా రచనలూ, అల్ప జీవితంతో సమాప్తమయ్యే సాహితీ రచనలూ మనం చూస్తూనే ఉన్నాం. వస్తువుకి కళని విధేయంగా భావించేవాళ్ళు ఈ సత్యాన్ని అంగీకరించకపోవచ్చు. కాని ఇక్కడ శ్రీ ముట్నూరి కృష్ణారావు గారైనా అక్కడ జోసెఫ్ ఎడిసన్ అయినా కావడానికి పత్రికా రచయితలే కాని వారి రచనలు సమకాలీన సమాజం మీద గాఢమైన ప్రభావ ముద్రలు

వేయడమేగాక కాలాంతర పరివ్యాప్తములై ఉత్కృష్టసాహిత్య స్థానాన్ని సంత రించుకున్నాయి.

ఎడిసన్ స్పెక్టేటర్ వ్యాస సంకలనానికి ఉపోద్ఘాతం వ్రాస్తూ "........ when he actually wrote, he wrote as one of a group of Journalists ..." (తన పేపరు ఒక 'tea - equipage' గా చూడబడితే చాలని ఆకాంక్షించిన ఎడిసన్ వ్రాతలు....) "....But in Addison's hands this popular writing became a part of literature" అంటాడు జాన్ రిచర్డ్‌గ్రీన్.

నైతికంగా, సాంస్కృతికంగా, రాజకీయంగా దిగజారిపోయి పతనో న్ముఖమైన సమకాలీన సమాజానికి అక్షరచికిత్స చేసి జాతీయ వ్యక్తిత్వానికి ఒక నవ్య భావనా బల రసాయనాన్నిచ్చిన మహా మనీషులుగా కృష్ణారావు గారికీ, ఎడిసన్‌కీ దేశకాల భేదాలతోనైనా చాలా పోలికలు కనిపిస్తాయి. స్వాతంత్ర్యో ద్యమ కాలంనాటి ఒక భారతీయ రచయితకు ఈ ఆంగ్లేయానుమ్యం ఒక ప్రశ్న కానక్కరలేదు. ఎందుకంటే, స్వదేశీయులలో తమ అద్భుతమైన విచార ధారతో జడతా విచ్ఛేదకమైన ఒక జాగృతిని, ఒక చైతన్యస్ఫూర్తిని కలిగిం చిన మేధావులను, సఫల జన్ములను ఒకేసారి స్మరించుకోవడంలో అనౌచిత్యం ఏమీ లేదు.

భారత (స్వాతంత్ర్య) సంగ్రామారంభ దశలో ఆత్మవిస్మృతి స్థితిలో కింకర్తవ్యతా మౌఢ్యాన్ననుభవిస్తున్న ఆంధ్రజాతి అర్జునుడికి తమ దివ్యమైన వాణి ద్వారా కర్తవ్యోపదేశంచేసి 'ఆత్మలబ్ధి'ని ప్రసాదించిన రాజకీయ వేది, దార్శనిక వేత్త, సారస్వత మూర్తి శ్రీ కృష్ణారావుగారు. జాతీయోద్యమ స్వాతంత్ర్యోద్యమాలకు ప్రత్యక్షంగాను, భావి తరాలకోసం ఉజ్వలమైన గత చరిత్రను, ఉదాత్తమైన సాహిత్యాన్ని, ఉన్నతమైన ఆధ్యాత్మిక భావ ధారను మిగల్చడం ద్వారా పరోక్షంగానూ ఆయన తమ కృష్ణాపత్రిక సంపాదకీయాల మూలంగానూ ఇతర వ్యాసాల మూలంగానూ ఆంధ్ర పాత్రికేయ సారస్వత చరిత్రను సంపన్నం చేశారు.

మౌన ముద్రాలంకారుడైన వాగ్మిగా, మజ్జత్సంసారార్ణవుడైన తపస్విగా, మృత్యు రహస్యం తెలిసిన జీవుడుగా, 'శిబిరము వదలని యోధుడు'గా, నిర్లిప్త

దైన ఉద్యమిగా, రసాభిజ్ఞుడైన రాజకీయవేత్తగా, అనాహతనాదాత్మక సంగీత శ్రోతగా, అక్షర దీక్షాబద్ధుడైన చైతన్యోద్యమ నేతగా, హాస్యప్రియుడైన వేదాంతిగా, అహంపద వాచ్యుడైన నిరహంకారిగా, ఇంకా అనేకానేక వైరుధ్యాల సంగమ స్థానంగా వెలుగొందిన శ్రీ ముట్నూరి కృష్ణారావుగారొక సంపూర్ణమైన వ్యక్తి. పూర్ణ పురుషుడు.

"ఆయన ఆత్మను తాకని విషయమేది? ఆయన గుండెను కదిలించని సమస్య ఏది? ఆయన కలానికి అందని లోతులేవి? ఆయన గుండె నిరాబుద్ధి." "…. వారి కలంలో పది పాళీ లున్నాయనేవా రందరూ" అని ఆయన బహుముఖ ప్రజ్ఞను కీర్తించిన శ్రీ రావూరు వేంకట సత్యనారాయణరావు గారి మాటలు యథాక్షర సత్యాలు జంగమ జగద్జ్ఞానంగా, రసావతారంగా, తమ నిశితమైన భావధార ద్వారా ఒక తరాన్ని శాసింపగలిగిన శ్రీ ముట్నూరి వారి లేఖిని నుండి వెలువడిన సంపాదకీయ వ్యాసాలమీద వ్యాసాలే ఈ గ్రంథంగా రూపుదిద్దుకున్నాయి.

ఒక వ్యాసం వ్రాయడానికి సజీవమైన వస్తువు దొరకడం ఒక విశేషమైతే దాన్ని ఉత్తేజకరమైన శైలిలో చక చకా చదివింపగల రీతిలో నడిపింపగల్గడం మరొక విశేషం. పాఠకుల దృష్ట్యా అదొక ఉదాత్త సందేశ గర్భితమైన రచన అయితే చెప్పేదేముంది?

రచయిత చిరంజీవి దత్తాత్రేయ శర్మ, పాత్రికేయ సారస్వతానికీ గద్యరచనకూ సంబంధించిన అనేకములైన ఆంధ్రాంగ్ల గ్రంథాల్ని మథించి, పత్రికా సంపాదకీయ వ్యాసాల లక్షణాల్నీ, స్వరూప స్వభావాలనీ కృష్ణారావు గారి వ్యాసాల ప్రత్యేక సమన్వయంతో, ఆయన జీవితాన్నీ, సాహిత్యాన్నీ, స్వాతంత్ర్యోద్యమంలో ఆయన నిర్వహించిన ప్రముఖ పాత్రనీ ప్రతిబింబించే అంత సత్వంగల ఒక చక్కని రచనను తెలుగువారికి అందించాడు.

బరువైన విషయాన్ని 'హాయిగా' చెప్పడం ఒక కళ. పాఠకులకు ఒక enlightenment కలిగించే విషయాన్ని కాలక్షేపం కోసంలాగా క్లేశ రహి

తంగా ప్రపంచించడం ఒక టెక్నిక్. ఒక విస్తృతమైన అంశాన్ని సమగ్రత చెడని వింగడింపుతో క్లుప్తీకరించి వివరించడం ఒక శిల్పం. అస్తవ్యస్తంగా సాగి పోతున్న సంక్షుభిత సమాజానికి ఒక ఉన్నతమైన 'ఆదర్శాన్ని' అందింప గల్గడం ఒక ఔచిత్యం. ఒక జాతి సుస్థిరమైన మనుగడ సాగించడంలో ఎదు రయ్యే ఉపద్రవాలనీ, వాటితో జరిపే పోరాటాలనీ, అనుసరించే మార్గాలనీ దాచు కున్న చరిత్ర గర్భంలోని అనుభవాలనీ, జ్ఞాపకాలనీ భావితరాలకు ఎప్పటి కప్పుడు అందిస్తూ పోవడం ఒక అవసరం. ఈ లక్ష్యాల్ని సంపన్నం చేస్తూ సాగిన ఈ రచన సర్వథా అభినందనీయం.

22 నవంబర్ 1992

ఉమాపతి పద్మనాభశర్మ

పారుపల్లి వీధి
సిద్దిపేట.

# ప్రస్తావన

అశేష శేముషీ దురంధరులు, బహుముఖ ప్రజ్ఞాశాలి, విలక్షణమైన వ్యక్తిత్వం కలిగిన ముట్నూరి కృష్ణారావుగారు ఆంధ్ర గద్య వాఙ్మయానికి విలక్షణమైన సేవ లందించారు. పాండిత్యం, ఆత్మీయత, వ్యక్తిత్వం కలగలిపి ఆంధ్ర ప్రజానీకానికి అందించిన అరుదైన కానుకలు ఆయన సంపాదకీయాలు. కృష్ణాపత్రిక ఆయన మేధా పుత్రిక. కృష్ణాపత్రిక ఆయన సాధన భూమిక. కృష్ణాపత్రిక ఆయన కర్మక్షేత్రం, లక్ష్యం, గమ్యం. ఆయన జీవితమంతా ఆ లక్ష్య సాధనలోనే గడిచిపోయింది. ఆంధ్ర జాతి సముజ్జీవన చైతన్య శీలిగా చరిత్రలో ఆయన సుస్థిర స్థానం సంపాదించుకొన్నారు. సంజీవదేవ్‌గారన్నట్లు కృష్ణారావుగారి లాంటి వ్యక్తులు ప్రపంచంలోనే అరుదుగా ఆవిర్భవిస్తుంటారు. ఆయన సంపాదకుడుగా విశృంఖలుడు – భావ సంపన్నుడు. వ్యక్తిగా అంతర్ముఖుడు – తపస్సంపన్నుడు.

ఇది కృష్ణారావుగారి సంపాదకీయాలపై ఎం. ఫిల్. పట్టం కొరకు సమర్పిస్తున్న సిద్ధాంత వ్యాసం, విశ్వవిద్యాలయ పరిమితుల మేరకు, లభించిన అవకాశాల మేరకు, నా విజ్ఞత సాగినంత మేరకు ఆ మహితాత్ముని వాఙ్మయ మహోదధిలోకి చొచ్చుకుపోయాను. రాళ్ళే ఏరుకున్నానో, రతనాలే దోచుకున్నానో రసజ్ఞులే నిర్ణయిస్తారు. నా విజ్ఞానం పరిమితమైనదని నాకు తెలుసు. అయినా మహానిధి కంటబడ్డ నిరుపేదలా మోహరించాను. ఆ మహోదయుని ప్రతిభకు మోకరిల్లాను. మా పూర్వుల ఉత్తమ సంస్కారం, మా ఆచార్యవర్యుల ఔదార్యం నన్నీ ప్రయత్నానికి ప్రేరేపించాయి – ప్రోత్సహించాయి. కృష్ణరాయ వాఙ్మయ తేజోబింబాన్ని రేఖామాత్రంగానైనా నేనీ వ్యాసంలో ప్రదర్శించగలిగితే నా ప్రయత్నం చరితార్థమైందనే భావిస్తాను.

ఈ వ్యాసంలో ప్రధానంగా ఆరు అధ్యాయాలున్నాయి. మొదట కృష్ణారావుగారి జీవితాన్నీ, వ్యక్తిత్వాన్నీ రేఖామాత్రంగా దర్శించి ప్రదర్శింప జేసాను. కృష్ణారావుగారి ప్రతి పదంలోనూ ఆయన విశిష్ట వ్యక్తిత్వం ప్రతిధ్వనిస్తుంది. ఆయన వాఙ్మయాన్నీ, వ్యక్తిత్వాన్నీ విడదీసి చూడలేం.

కృష్ణారావుగారి ఆగమనంతో కృష్ణా పత్రిక పల్లవించి, కుసుమించి, ఫలవంతమైంది. కృష్ణారావుగారికి, కృష్ణా పత్రికకు ఉన్న అపూర్వానుబంధాన్ని రెండవ అధ్యాయంలో వివరించాను.

కృష్ణారావుగారి రాజసాన్ని, ప్రతిభను, కళాభిరుచిని, దేశభక్తిని బహిర్గతపరచిన రసమయవేదిక కృష్ణాపత్రిక దర్బారు. దర్బారు స్వరూపాన్నీ, వైశిష్ట్యాన్నీ కృష్ణారావుగారు దానికి కలిగించిన వికాసాన్నీ మూడవ అధ్యాయంలో వివరించాను.

నాల్గవ అధ్యాయంలో 'సంపాదకుడు- సంపాదకీయా'ల మూలతత్త్వాన్ని, స్వరూప స్వభావాలను కొంతవరకు పరిచయం చేయడం అవసరంగా భావించి వివరించాను. ఈ లక్షణాలను కృష్ణారావుగారికి కానీ ఆయన సంపాదకీయాలకు గానీ అనువర్తింపజేయటం నా ఉద్దేశ్యం కాదు. మన దేశంలో 'పత్రికారచన' రేకులు విప్పని (సర్వతోముఖ వికాసాన్ని పొందని) తొలిదశలోనే అద్భుత ప్రతిభులైన కృష్ణారావుగారు కృష్ణాపత్రికను నిర్వహించిన తీరు అనన్య సామాన్యం. ఆయన 'సంపాదకులకే సంపాదకులు'గా కీర్తింపబడ్డారు.

ఐదవ, ఆరవ అధ్యాయాలలో కృష్ణారావుగా- సంపాదకీయాల స్వరూప స్వభావాలను వివరించే ప్రయత్నం చేసాను. తొలి తెలుగు పత్రికల ఆవిర్భావ వికాసాలను విహంగావలోకనం గావించాను. కృష్ణారావుగారి సంపాదకీయాలను సాంఘిక రాజకీయాది విభాగాలుగా వర్గీకరించి, సోదాహరణంగా వాటిని విశదీకరించాను. అలాగే ఆయన సంపాదకీయాల భాషా లక్షణాలను, శైలిని, స్వభావాన్ని విశదీకరించాను. వీలైనంతవరకు ఉదాహరణలకే ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చి నా వ్యాఖ్యానాన్ని నియంత్రించుకొన్నాను. కృష్ణారావుగారి హృదయాన్ని భావ సౌందర్యాన్ని, యథాతథంగా వివరించే ప్రయత్నంలో కొన్నిసార్లు సుదీర్ఘమైన సంపాదకీయ భాగాలను ఉదహరించక తప్పలేదు. కృష్ణారావుగారి ఇతర రచనలను పరిశోధనా పరిమితుల దృష్ట్యా కేవలం స్పృశించి వదలివేసాను. అనుబంధంలో తెలుగు విశ్వ విద్యాలయం, వేటపాలెం 'సారస్వత నికేతన భాండాగారం' గ్రంథాలయాలలో నేను సేకరించిన సంపాదకీయాల శీర్షికలను కాలానుక్రమంగా ప్రదర్శించాను.

ముందుగానే మనవి చేసుకొన్నట్లుగా ఈ వ్యాసం దిఙ్మాత్ర పరిశీలన మాత్రమే. కృష్ణారావుగారి సంపాదకీయాలపైననే ఇంకెంతో పరిశీలించుట కవకాశముందనే ఆలోచనను కల్పిస్తూ- ఈ నా కృషి ఆ ఆలోచనకు ప్రాథమిక రూపంగా నిలుస్తుందని విశ్వసిస్తున్నాను....

ఎం. దత్తాత్రేయ శర్మ

# కృతజ్ఞతలు....

'ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయా'లపై పరిశోధించడానికి అనుమతి నిచ్చిన ఉస్మానియా విశ్వవిద్యాలయానికి, అప్పటి తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య శ్రీమతి నాయని కృష్ణకుమారి గారికి....

నా ఈ పరిశోధనా వ్యాసంగానికి సక్రమ పథ నిర్దేశకులై, సర్వథా సముచిత సలహాల నందిస్తూ నన్ను ప్రేరేపించి, అక్షరాశీస్సు లిచ్చి మింటి కెగిసిన సౌజన్యమూర్తి ఆచార్య ఇరివెంటి కృష్ణమూర్తి గారికి...

నన్నాశీర్వదించి నా ప్రయత్నానికి స్ఫూర్తినిచ్చి వెన్నుతట్టి ప్రోత్సహించిన తెలుగుశాఖ అధ్యాపకవర్గం ఆచార్య అమరేశం రాజేశ్వరశర్మ గారికి, డా. ఎల్లూరి శివారెడ్డి గారికి, డా. ఎన్. గోపిగారికి, డా. కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి, డా. శ్రీమతి సుమతీ నరేంద్రగారికి....

నా అభ్యర్థనను మన్నించి సందేహాలకు దయతో సమాధానాలిచ్చి, నాకు కావలసిన సమాచార మందించిన ప్రాజ్ఞులు డా. బెజవాడ గోపాలరెడ్డి గారికి, పొత్తూరి వెంకటేశ్వరరావుగారికి, ఎ. బి. కె. ప్రసాద్ గారికి, కాశీనాధుని పూర్ణమల్లికార్జునుడు గారికి, వి. సంపత్కుమార్ గారికి, డా. రామడుగు శ్రీమన్నారాయణశర్మ గారికి, పిరాట్ల వెంకటేశ్వర్లు గారికి....

నామీద అవ్యాజానురాగాన్ని కురిపిస్తూ నన్ను నిరంతరం ప్రోత్సహిస్తూ నా పరిశోధనను సుసంపన్నం చేసిన గురువర్యులు 'మంగళాశాసనం' చేసిన ఆచార్య ఎం. కులశేఖరరావు గారికి, 'మేలిపలుకు' లిచ్చిన ఆచార్య ఎస్వీ రామారావుగారికి, అడిగినంతనే ఆప్యాయతతో 'మంచి ప్రయోగ'మని మెచ్చుకోలిచ్చిన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి, వాత్సల్యంతో విలువైన సలహాల నిచ్చి తమ 'ఆత్మీయా'న్ని ప్రకటించిన మా పెదనాన్న బ్ర.శ్రీ. ఉమాపతి పద్మనాభ శర్మ గారికి....

నా కృషికి కొండత అండగా నిల్చి అక్షరమక్షరం సరిచూసి సాక్షరత్వం కలిగేలా వెలలేని దీవెనలిచ్చిన త్రివేణి త్రైమాసిక పత్రికా సంపాదకులు డా॥ భావరాజు నరసింహారావుగారికి....

శిథిలావస్థలో ఉన్న కృష్ణాపత్రిక పురాతన సంపుటాలను చూడటానికి అనుమతించిన తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయాధిపతి శ్రీ శంకర్ రెడ్డి గారికి వారి సిబ్బందికి, వేటపాలెం 'సారస్వత నికేతన' పుస్తక భాండాగార నిర్వాహకులు శ్రీ కె.వి.పి. మల్లికార్జునరావు గారికి, వారి ఇతర సిబ్బందికి....

JRF పారితోషికంతో పరిశోధన ఫలప్రదం కావడానికి ఆర్థికంగా సహకరించిన ఉస్మానియా విశ్వవిద్యాలయం U.G.C. విభాగం వారికి....

అడగ్గానే అందమైన ముఖచిత్రం గీసి ఇచ్చిన ఆత్మీయులు 'శ్యాం' సుందర్, శ్రీ పి.వి. రాజుగారికి....

శుద్ధ ప్రతి నిర్మాణంలో 'అక్షరాలా' తోడ్పడ్డ అర్ధాంగి అపర్ణకు, సోదరుడు వెంకటరమణ శర్మకు, హృన్మిత్రుడు జి.వి. రాఘవాచార్యులకు....

అందమైన అక్షరాల కూర్పుతో ముచ్చటగా ముద్రించి ఇచ్చిన 'పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్' అధినేత శ్రీనివాస్‌గారికి, వారి ముద్రణా సిబ్బందికి....

నిండుమనసుతో ధన్యవాదా లర్పిస్తున్నాను.

# అనుక్రమణిక

## అధ్యాయం ఒకటి

# ముట్నూరి కృష్ణారావుగారి జీవిత రేఖలు - వ్యక్తిత్వదర్శనం

ఒక మహత్తర కార్యాన్ని సాధించేందుకు అప్పుడప్పుడూ ఎందరో మహనీయులు ఆవిర్భవిస్తూ ఉంటారు. వారు తాము నమ్మిన సిద్ధాంతాలను లోకానికి ప్రచారం చేసి అగమ్యగోచరంగా ఉన్న సమకాలిక సమాజానికి నూతన్న దృక్కోణాన్నందించి, భావితరాలకు ఆదర్శమూర్తులై, నిష్కామ కర్మయోగులై నిష్క్రమిస్తారు. శ్రీ ఆది శంకరాచార్య, శ్రీ వివేకానంద స్వామి వంటి మహనీయుల జీవితాలు ఇందుకు తార్కాణాలు. గీతాచార్యుడు ప్రబోధించినట్లుగా కర్మాచరణమే తమ విధిగా భావించి ఐహిక మమకారపు జంజాటాల్లో చిక్కుకోక వారు తమ విశిష్ట వ్యక్తిత్వాన్ని ప్రకటించుకొంటారు.

19 వ శతాబ్దపు చివరి పాదంలో, పరజాతి పాలనలో చిక్కుకొన్న భారతీయులు ఆత్మ విస్మృతి పథంలో పయనిస్తున్నవేళ ఒక మారుమూల పట్టణంలో వార్తా పత్రికనే వేదికగా చేసుకొని యావదాంధ్ర జాతికి నవ్య చైతన్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని అపూర్వంగా కలిగించి, వారిని జాతీయోద్యమోన్ముఖులను చేసిన ముట్నూరి కృష్ణారావుగారు నిష్కామ కర్మయోగిగా తమవంతు బాధ్యత నిర్వహించి కృతార్థులయ్యారు.

ముట్నూరి కృష్ణారావుగారు బహుముఖీన ప్రజ్ఞాశాలి. రచయితగా, దార్శనికుడుగా, తాత్త్వికుడుగా, సంఘసంస్కరణాభిలాషిగా, స్వాతంత్ర్య సమర యోధుడుగా ఆయన వ్యక్తిత్వం బహుధా ప్రశంసనీయమైనది.

సుమారు నాలుగు దశాబ్దాలపాటు అవిరామంగా, అకుంఠితంగా, తమదైన ప్రత్యేక శైలితో కృష్ణా పత్రికకు సంపాదకత్వం వహించి, విస్తృత రచనా వ్యాసంగంతో ఆంధ్రదేశాన్ని యావత్తూ ప్రభావితం చేసారాయన.

ముట్నూరి వారి జీవితాన్నీ, సాహిత్యాన్ని పరిశీలించడమంటే ఒక తరాన్ని పూర్తిగా అధ్యయనం చేయడమే. నాటి భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖపాత్ర వహించిన గోఖలే, తిలక్, గాంధీజీ, రవీంద్రుడు, అరవిందుడు మొదలైనవారి జీవితాలను పరిశీలించి చూచినట్లైతే పైకి కన్పడే వారి రాజకీయ సంగ్రామం వెనుక అంతర్లీనంగా ఆధ్యాత్మిక శక్తి సుస్పష్టంగా గోచరిస్తుంది. ఈనాటి తరానికి వారందించిన నిస్స్వార్థ దేశభక్తి, అమేయ కర్తవ్య దీక్ష పరమాదర్శం కావాలి.

కృష్ణారావుగారు స్ఫుర ద్రూపి. మితభాషి. ప్రముఖ రచయిత, చిత్రకారుడు కృష్ణారావుగారి సన్నిహిత సహచరుడైన అడవి బాపిరాజుగారు కృష్ణారావుగారి సుందర విగ్రహాన్ని రమణీయంగా అభివర్ణించారు. "శ్రీకృష్ణరాయలు సుందరాకారుడు. మేలిమి బంగారు ఛాయ. విశాల ఫాలము. ఆకర్ణాంత ఇందీవర పత్రాలైన నేత్రాలు. గరుడ నాసిక. సమమైన కోల మోము. ఆమ్రఫల చిబుకము. శ్రీకరాలైన లంబకర్ణాలు. విపుల వక్షుడు. దీర్ఘ బాహుడునూ. తెల్లని కోర తలపాగా ధరించి, మోకాళ్ళవరకూ వేళ్ళాడే తెల్లని చొక్కా ధరించి, వేగంగా ఆయన నడచివెడుతూవుంటే ఒక దివ్యుడు భూమి కవతరించినట్లే వుండేది." 1

"ముట్నూరి కృష్ణారావుగారు మనీషి. ఆయన ఆలోచన దూరాలోచన. ఆయన ఆలోచన సూక్ష్మాలోచన. ఆయన ఆలోచన సమాలోచన. ఆలోచన, విజ్ఞత, పాండితితో మాత్రమే కృష్ణారావుగారి వ్యక్తిత్వం ఆగిపోలేదు. ఆయనలో మేధాశక్తులకు తోడు హృదయశక్తులు కూడా వికసించి ఉన్నాయి" అన్న సంజీవ్ దేవ్‌గారి మాటలు కృష్ణారావుగారి విశిష్టతను చక్కగా చాటే శబ్ద చిత్రాలు.

"వేషంలో, భాషలో, భావనలో, రచనలో. వర్తనలో, సౌందర్యాభివ్యక్తి, రసప్రకటన ఆయన ప్రత్యేకతలు. సౌందర్యారాధన, రసతృష్ణ, అనుభూతి స్పందన ఆయన విలక్షణ లక్షణాలు.

కృష్ణారావుగారు ఉచ్చరించే ప్రతి వచనమూ ఒక నిర్వచనం. రచించే ప్రతి వాక్యమూ ఒక గద్య కావ్యం: ఆయన అభివ్యక్తిలో లోతైన దార్శనిక

చింతన మేళవిస్తుంది. రసానుభూతి అనుమేళిస్తుంది. ఆయన జీవితం ఈ రెంటితో ప్రతిధ్వనిస్తుంది. ప్రతిబింబిస్తుంది."[2]

కళాతపస్విగా, ఉన్నత ప్రమాణాలందుకున్న పాత్రికేయులుగా, మౌన ముద్రాలంకారులుగా ఆయన తెలుగు ప్రజలకు కలకాలం గుర్తుంటారు. విశిష్ట వ్యక్తిత్వం, పదునైన నిజాయితీతో కూడిన లేఖనం కలగలిసి ఆయననొక మహోన్నత వ్యక్తిని గావించాయి.

కృష్ణారావుగారి జీవితం ఆబాల్య విశిష్టమైనది. ఆయన వ్యక్తిత్వం అత్యంత విచిత్రమైనది. ఆయన జీవితంలో ఎన్నో సంఘర్షణలను, సందిగ్ధ పరిస్థితులను ఎదుర్కొన్నా ఏనాడూ తమ మనో నిశ్చయాన్ని కోలుపోలేదు. ఏ ఒత్తిడులకు తలఒగ్గి తమ పంథాను మరల్చుకోలేదు. పైగా ఈ సంఘర్షణలే ఆయనలోని తాత్త్వికతను, రసజ్ఞతను పెంచి పెద్ద చేసాయి. ఆయనను రస తపస్విని చేసాయి.

కృష్ణారావుగారికి తమను గురించి ప్రకటించుకోవడంగానీ, ఇతరులు తమను గురించి గొప్పగా చెప్పడంగాని ఏమాత్రం ఇష్టం కాదు. అందుకే ఆయన ఎన్నడూ తమ గురించి ఎక్కడా వ్రాసుకోలేదు. తామే అధిపతియై, సంపాదకత్వం వహిస్తున్న కృష్ణాపత్రికలో ఎక్కడో చివరి పేజీ అట్టడుగు భాగాన ప్రభుత్వ నిబంధనల ననుసరించి విధిగా తమ పేరు సంపాదకుడిగా వేసుకొనేవారు. అంతేకాని, పత్రికలో ఇతర శీర్షికలెన్ని నిర్వహించినా, ఏ వ్యాసం వ్రాసినా తమ పేరు ప్రచురించుచుకునేవారుకాదు. వీలైనంతవరకు తమను గురించి ఇతరులెవరూ వ్రాయకుండా జాగ్రత్త వహించేవారు. ఆప్త మిత్రులకు సైతం ఆయన తమ జన్మదినాన్ని తెలియనివ్వలేదు. ఆడంబరాలకు, ఆర్భాటాలకు ఆయన జీవితంలో ఎన్నడూ అవకాశం ఇవ్వలేదు.

ఒకమారు బందరు జాతీయ కళాశాలను సందర్శించడానికి వచ్చిన గాంధీ మహాత్ముడు కృష్ణారావుగారిని చూచి, ఆయన కళ్ళలో దేదీప్యమానంగా విరాజిల్లుతున్న ఆధ్యాత్మిక తేజస్సును వర్ణిస్తూ "ఆ వ్యక్తిలో ఉండే గొప్పతనం మన తెలివికొద్దీ మనం వెదుకోవలసిందేతప్ప ఆయనలో ఉండే జలలు సామాన్యంగా బహిర్గతం కా" వని అన్నాడట.[3] కృష్ణారావుగారు ఏమాత్రం

అవకాశం ఇచ్చినా మహాత్ముడాయనను రాజకీయ రంగంలోకి సంపూర్ణంగా దింపేవారు.

కృష్ణారావుగారు 1879 వ సంవత్సరంలో జన్మించారు. ఆయన జన్మించగనే తల్లి గతించింది. బాల్యంలోనే తండ్రి పరమపదించాడు. పినతండ్రిగారి ప్రాపకంలో ఆయన బాల్యం గడిచింది. ఆయన తన తల్లిని తలచుకొన్నప్పుడల్లా లోలోనే 'నేను మాతృ హంత'నని దుఃఖించేవారట. పసితనంలోనే ఆయన తీవ్రవ్యాధిగ్రస్తులై వెంట్రుకవాసిలో మృత్యువాత తప్పించుకున్నారట. కృష్ణారావుగారి ఏకైక కుమారుడు ఆయన కళ్ళముందే మరణించాడు. ఆయన రెండవ అల్లుడు కూడా పిన్న వయస్సులోనే మరణించాడు. జీవితంలో ఇలాంటి విపత్తు లెన్నింటినో ఆయన ఎదుర్కొన్నా ఏమాత్రం చలించలేదు. అయితే ఆయన వీటన్నిటికీ అతీతుడై పాషాణ హృదయుడైన ప్రపంచం పట్టని విరాగి మాత్రం కాదు. ఇతరులకు హాని కలిగినా తనవారికి హాని కలిగినా ఆయన అందరి వలెనే శోకిస్తారు. "మానవతకు దూరం కాని మానవాతీతులు ఆయన. మనుషుల నుంచి దూరం కావడంలో కాక మనుషులకు దగ్గర కావడంలో ఆధ్యాత్మికత ఇమిడి వుందనే పంథాకు చెందినవారు కృష్ణారావుగారు. ప్రవృత్తి మార్గంలోనే మానవునికి ముక్తి వున్నది కాని నివృత్తి మార్గంలో కాదనేది వీరి సాధన."4 ఆయన జీవితంలో ఇతర రసాల మాదిరిగానే కరుణ రసాన్నీ సంపూర్ణంగా అనుభవించారు. అయితే అందరిలా ఆయన శోకాన్ని బహిర్గతపరచలేదెప్పుడూ. ఆయన ఆరాధ్య దైవం 'నిఖిల రసామృతమూర్తి.'5

కవికీ, ఋషికి కావలసిన క్రాంతదర్శిత్వాన్ని ఆయన సాధించారు. గంభీరమైన తపస్సు అది. లోకవృత్తంలో జరిగే ప్రతి విషయాన్నీ సాక్షీభూతంగా తిలకించడం, సంభవించిన ఫలితాన్ని సంతోషపూర్వకంగా స్వీకరించడం, నిర్మమత్వంతో కర్మ నాచరించడం ఆయన సాధనావిశేషాలుగా భావించవచ్చు. మౌనముద్ర ఆయన ధ్యానానికి, మననానికి, గాఢ తపస్సుకు సంకేతం. "సత్యాయ మిత భాషిణాం" అన్నది కూడా ఆయన అభిమతం.

కృష్ణారావుగారి ప్రాథమిక విద్యాభ్యాసం బందరు హిందూ హైస్కూలులోనే జరిగింది. పిదప బందరులోని నోబుల్ కళాశాలలో F. A. లో చేరిన

కృష్ణారావుగారికి కులపతి రఘుపతి వెంకటరత్నం నాయుడు గారి శిష్యులయ్యే మహదవకాశం సంప్రాప్తించింది. నాయుడుగారి దగ్గర అంతేవాసిత్వం కృష్ణారావుగారిలోని జిజ్ఞాసను, తాత్త్వికతను వికసింపజేసింది. కులపతి గారి సంఘ సంస్కరణశీలత, మూఢాచార నిర్మూలన వంటి ఉద్యమాలు కృష్ణారావుగారిని ప్రభావితులను చేసాయి. ఆ రోజుల్లోనే గురువుగారితో కలిసి బ్రహ్మ సమాజ సమావేశాల్లో పాల్గొనడం, సుదీర్ఘములైన, ఉత్తేజకరములైన ధార్మికోపన్యాసాలు చేయడం కృష్ణారావుగారికి అలవాటయింది. తొలి దశలో కృష్ణారావు గారిలోని తాత్త్వికతను బహిర్గత పరచి తీర్చిదిద్దిన ఘనత వెంకటరత్నం నాయుడు గారిదే. నాయుడుగారు కృష్ణారావు గారిని ఆదర్శ విద్యార్థిగా అనుగ్రహించడమేకాదు, ఎలాగైనా బ్రహ్మమిషనరీగా చేద్దామని సంకల్పించారట. అలాగే ఆంధ్రపత్రికా సంపాదకులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు అయిదువందల రూపాయల వేతనం ఆశపెట్టి కృష్ణారావుగారిని తమ పత్రికకు ఆకర్షించుకొనే ప్రయత్నాలు చేసారట. మరోవైపు గాంధీగారి ఆంతర్యమెరిగి పట్టాభిగారు కృష్ణారావుగారిని రాజకీయాల్లోకి దింపాలని విశ్వప్రయత్నాలు చేసారు. ఇవేవీ కృష్ణారావుగారిని చలింపజేయలేదు. ఆయన తామెన్నుకొన్న కార్యక్షేత్రం కృష్ణాపత్రికను వదలిపెట్టలేదు. ఏ ప్రలోభాలకూ లొంగలేదు. ఇది మరో రకంగా ఆంధ్ర ప్రజలకు ఆంధ్రభాషకు గొప్ప వరంగా మారింది.

కృష్ణారావుగారు సంస్కృత సాహిత్యాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసారు. ఉపనిషత్సారాన్ని ఆపోశన పట్టారు. అలాగే ఆంగ్ల సాహిత్యాన్ని అభిమానంతో అభ్యసించారు. బందరు వదలిపెట్టి మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో బి.ఏ. లో చేరారు. లెక్కల తరగతిలో చాటుమాటుగా ఎమర్సన్‌ను చదవడం, అవకాశం చిక్కినప్పుడల్లా తాత్త్విక గ్రంథాలను పఠించడం, వాల్ట్ విట్మన్, షెల్లీ, కూపర్‌ల వంటి పాశ్చాత్య మనీషుల రచనల నధ్యయనం చేయడం కృష్ణారావు గారి ప్రజ్ఞకు పదును పెట్టాయి. అయితే బి.ఏ. లో మాత్రం ఆయన నెగ్గలేక పోయారు. ఈ సమయంలోనే పట్టాభి సీతారామయ్యగారు ఆయనకు సహాధ్యాయిగా ఉన్నారు.

నాటి జాతీయోద్యమ సమయంలో చెరసాలలు మనోజ్ఞశాలలయ్యాయి. ఉరిదండలు విరిదండలయ్యాయి. ముట్నూరి కృష్ణారావుగారు ప్రజలకు ప్రబోధించడమే కాక తామే స్వయంగా అనేక ఉద్యమాలకు నాయకత్వం వహించారు. ఉప్పుసత్యాగ్రహం, శాసనోల్లంఘన సమయాల్లో ఆయన స్వయంగా పాల్గొని, తోటి సత్యాగ్రహులకు ఉద్యమ స్ఫూర్తి నందించేవారు. 1920-21 వ సంవత్సరంలో తూర్పు కృష్ణాజిల్లా సంఘానికి అధ్యక్షులుగా కూడా వ్యవహరించారు. 1930 లో, 1932 లో, తిరిగి 1943 లో ఆయన కారాగార వాసాన్ని అనుభవించారు. 1932 లో రాయవెల్లూరు జైలులో ఉన్నప్పుడు సహ సత్యాగ్రహులకు తత్త్వశాస్త్రము, యోగశాస్త్రము, సంస్కృత నాటకాలు, కావ్యాలు వినిపించి వివరించేవారట.[6] బిపిన్ చంద్రపాల్, అరవిందుడు, రవీంద్రుడు, గాంధీ మహాత్ముడు కృష్ణారావు గారిని ఎంతగానో ప్రభావితులను చేసారు.

కృష్ణారావుగారు 1903 లో విద్యాభ్యాసానంతరం బందరు చేరుకొని కృష్ణాపత్రికలో సహాయ సంపాదకులుగా చేరి, 1907 లోనే సంపాదకులైనారు. తదాది 1945 లో పరమపదించే వరకు తామే పత్రికాధిపతిగా, సంపాదకులుగా ఉన్నారు. తెలుగు భాషలోనే కాక ఇతర భాషల్లోనూ ఇంత ఎక్కువ కాలం పత్రికా నిర్వహణ చేసిన వారు అరుదు. 'ఆంధ్ర భారతి' అనే సాహిత్య పత్రికను ముట్నూరివారు కొంతకాలం నిర్వహించారు.[7]

కృష్ణారావు గారి కళాదృష్టి అపూర్వమైనది. ఆయన ఉన్న కొద్దిపాటి ఆఫీసు ప్రాంగణంలో, నివసించే భవంతిలో అనేక అద్భుతమైన శిల్పాలు, కళాత్మక వస్తువులు సేకరించి ప్రతిష్ఠించేవారు. అందమైన శిల్పాలు, కళాఖండాలపై ఆయన కెనలేని అభిమానం. ఒకమారు ఒక ఊరికి ఏదో సందర్భంగా ఉపన్యసించడానికి వెళ్ళిన ఆయనకు ఆ ఊళ్ళో అందమైన కృష్ణ విగ్రహం ఒకటి 'అధ్వాన్నం'గా పడి ఉండటం కన్పించిందట. ఆ రాత్రి అక్కడే బస చేస్తామని ఊరి పెద్దలకు చెప్పి అర్ధరాత్రి వేళ ఇంకొక మిత్రుని సాయంతో ఆ వెన్నలదొంగను దొంగిలించి ఎలాగో కష్టపడి బందరు చేరుకున్నారట. అంతటి కళాతృష్ణ. అఖదున చౌర్యానికి ఆయన వెరవలేదు.

మౌనంగా ప్రతినిత్యం శిల్పాలను అర్చించేవారు. శిల్పకళా, చిత్రలేఖన సంబంధితాంశాలపై పత్రికలో విశదంగా అనేక వ్యాసాలు వెలువరించారు. కృష్ణాపత్రిక కార్యాలయావరణంలో అందమైన పూలమొక్కలు నాటి స్వయం కృషితో అపర బృందావనాన్ని సృజించుకున్నారు. ప్రతి ఉదయం పూలచెట్లకు సపర్యలు చేస్తూ పూలబాసలు తెలిసికొంటూ వాటిని సంరక్షించే వారట. వెంట నున్నవారికి ఆ సమయంలో అద్భుత విషయాలు తెలిపేవారట.

ఒక పూవు ఆయనకు విరహోత్కంఠితయైన రాధికలా కనిపిస్తే మరొక పువ్వు స్వాధీన పతికలాగా కనిపించేది. తుమ్మెద దక్షిణ నాయకుడైన శ్రీకృష్ణుడుగా దర్శనమిచ్చేవాడు. ఇలా ప్రకృతితో తాదాత్మ్యమొంది ఆనం దించడం ఆయనకు సరదా. అందుకే దర్బారీయులు ఆయనకు "తోటా నందులు" అని పేరు పెట్టారు.

ఆయన వంగదేశ విభజన సందర్భంలో బిపిన్ చంద్రపాల్‌గారితో కలిసి వంగరాష్ట్ర పర్యటన గావిస్తున్నప్పుడు నెలకు, పదిహేను రోజులకు ఒకమారు ఇంటికి ఉత్తరాలు వ్రాస్తుండేవారట ఆ సుదీర్ఘ లేఖలనిండా ప్రకృతి వర్ణనలే ఉండేవట. ఊరుపేరు, తేదీల్లేని ఆ ఉత్తరాలు కృష్ణారావుగారిలోని మధుర భావుకతకు తార్కాణాలు.

కృష్ణారావుగారు పరిపక్వత చెందిన రచయిత. ఆయన జీవితంలోని చరమ దశలో తమ అనుభవ సారాన్ని, తాత్త్వికతను రంగరించి, ఉపనిష ద్వాక్యాల నుదహరిస్తూ సరళశైలిలో "లోవెలుగులు" "వెలుగు జిలుగులు" శీర్షికన కృష్ణాపత్రికలో అనేక వ్యాసాలు ప్రచురించారు. "సమీక్ష" పేరుతో సాహిత్యము, శిల్పము, ధర్మములపై ఆయన వ్రాసిన వ్యాసాలు పుస్తకరూపం సంతరించుకున్నాయి. కళా, సాహిత్య, సామాజిక, రాజకీయ, తాత్త్విక, ఆధ్యాత్మిక విషయాలపై ఆయన ఎన్నో వ్యాసాలు వెలువరించారు. ఇంకా తమ పేరు ప్రకటించకుండా వ్రాసిన రచనలెన్నో కృష్ణాపత్రికలో దర్శన మిస్తాయి. ప్రతి సాయంకాలం జరిగే కృష్ణరాయ దర్బారు సకల కళానిలయంగా విలసిల్లేది. కృష్ణరావుగారు అపరకృష్ణరాయలై వివిధ విషయాలపై గంభీరో పన్యాసాలు, చర్చలు, సమీక్షలు, వాదోపవాదాలు కొనసాగించేవారు. అది ఒక రసజగత్తు.

కృష్ణారావుగారి జీవితం ఆ రసజగత్తులోనే తేలియాడింది. నాడే ఋషి వాటికలోనో 'తపోభగ్నులై' నేడి తెలుగునాట అవతరించిన తాపసులుగా కృష్ణారావుగారిని వారి ప్రియతమ శిష్యులు గొట్టిపాటి బ్రహ్మయ్య గారు అభివర్ణించారు.[3] చివరి రోజుల్లో ఆయనను జలోదర వ్యాధి పట్టి పీడించింది. మృత్యువును మాతృమూర్తిగా దర్శించే కృష్ణారావుగారు తమ అవసాన సమయంలో కూడా మౌనవేదన ననుభవిస్తూనే ప్రళయ తాండవవేళ పరమశివుని కేళీ విలాసంగా దానిని భావిస్తూ జర్జర దేహాన్ని నిర్జించి పరమ శాంతిని పొందారు.

కృష్ణారావు గారు తమ జీవితమంతా సంఘర్షణలకు స్థానం ఇవ్వకుండా సాక్షీభూతంగా నిర్లిప్తంగా గడిపారు. ఎంతటి సంక్లిష్ట పరిస్థితులలోనైనాసరే ఆయన దిగాలుపడిపోలేదు. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ కాలం గడిపేవారు. కృష్ణారావు గారి జీవితంలో హాస్యరసానికి సముచిత స్థానం ఉన్నది. ఆయన తరచుగా చిలికించిన హాస్యాన్ని దర్బారీయులు రమణీయంగా కథలు కథలుగా వర్ణించారు.

ఒక వంక పరమ గంభీరస్థితి, మరొకవంక రసమయ హాస్యలీల, ఇంకొకవంక నిప్పులు చెరగే నిర్భీక రచనాపటిమ, వేరొకవంక రమణీయ కళాతృష్ణ. వీటన్నిటినీ అధిగమించిన తాత్త్విక దృక్పథం, అవ్యాజ దేశభక్తి, సార్థకమైన సంస్కరణ శీలత—అన్ని కలగలసి ముట్నూరి కృష్ణారావుగారిని మహా మనీషిగా తీర్చిదిద్దాయి. శాశ్వత కీర్తిని సమకూర్చాయి.

## అధోజ్ఞాపికలు

1. రసతపస్వి కృష్ణారావు — గొర్రెపాటి వెంకట సుబ్బయ్య. 1972 'మహా పురుషుడు' — వ్యాసం, అడివి బాపిరాజు, పే. 115.
2. Ibid — సంజీవదేవ్ 'దృక్కోణం' పుట 2.
3. 'I see the spiritual spark in his eyes........ you must draw him out, he will not came out so easilyl' గాంధీ మహాత్ముడు జాతీయ కళాశాలను సందర్శించిన సమయంలో తమ అంతరంగిక కార్యదర్శితో అన్నమాట. కోట సుబ్బారావుగారి వ్యాసం. రసతపస్వి. 157 వ పేజి.

4. Ibid........ సంజీవదేవ్ 'దృక్కోణం' పుట 5.

5. చూ. సమీక్ష. ముట్నూరి కృష్ణారావుగారి వ్యాస సంకలనం. 'రసస్వరూపము' వ్యాసం.

6. మాన్యులు బెజవాడ గోపాలరెడ్డిగారికి చెరసాలలో కృష్ణారావుగారు అభిజ్ఞాన శాకున్తలమ్, నాగానన్దమ్ మొదలైన గ్రంథాలు వినిపించారు. కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక. సంపాదకుడు – ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ. పుట 9. 1964 'నేనెరిగిన కృష్ణాపత్రిక'–వ్యాసం. బెజవాడ గోపాలరెడ్డి.

7. 1910 ఫిబ్రవరిలో కృష్ణాపత్రిక ముద్రణాలయం నుంచి కుమారరాజా యార్లగడ్డ అంకినీడు ప్రసాద్ ప్రభృతుల పోషణలో అయ్యంకి వేంకటరమణయ్యగారిచే "ఆంధ్రపత్రిక" ప్రారంభించబడింది. ఒక సంవత్సరం తర్వాత ఆ పత్రికను ముట్నూరి కృష్ణారావుగారు చేపట్టి మరికొంతకాలం నిర్వహించారు. చూ. తెలుగు జర్నలిజం. అవతరణ–వికాసం, డా॥ వి. లక్ష్మణరెడ్డి. పుట 244.

8. జాతి వెలుగులు – గొట్టిపాటి బ్రహ్మయ్య 'ముట్నూరి కృష్ణారావు' – వ్యాసం. పేజి 127.

# అధ్యాయం రెండు

# కృష్ణాపత్రిక - చరిత్ర

19వ శతాబ్దిలో భారతదేశంలో ఏర్పడ్డ సాంఘిక సంస్కరణల జాతీయోద్యమాల ప్రభావం ఆంధ్రదేశమంతటా విస్తృతంగా ప్రసరించింది. దేశాభ్యుదయకరాలైన అనేక ఉద్యమాలకు మార్గదర్శకులై బ్రహ్మసమాజ స్థాపకులైన రాజారామమోహన రాయలు, బాల్యవివాహాలను రూపుమాపేందుకు కంకణం కట్టుకొని సంస్కరణ రంగంలో పురోగమించిన ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు, వేశ్యావృత్తి నిర్మూలన వితంతు పునరుద్వాహాలవంటి ఎన్నో సాంఘిక సమస్యల పరిష్కారానికి కలం పట్టి ముందుకురికిన వీరేశలింగం పంతులు, హరిజనోద్ధరణ ఏకేశ్వరోపాసనలతో సర్వమత సమానత్వం కోసం దృఢదీక్షాబద్ధులైన రఘుపతి వెంకట రత్నం నాయుడు గారి వంటి ఎందరో సంఘ సంస్కర్తల, విభిన్న రంగాలకు చెందిన విజ్ఞానవేత్తల, దేశభక్తుల ఆదర్శాలతో ఉపదేశాలతో ఆంధ్ర ప్రజలు ఉత్తేజితులయ్యారు.

శ్రీ రామకృష్ణ పరమహంస ప్రియతమ శిష్యులై అధ్యాత్మిక తేజస్సుతో బాటు హైందవ మత ఔన్నత్యానికి ఖండాంతర వ్యాప్తి కలిగించిన వివేకానందుని బోధనలు ఈవరకే ఆంధ్రప్రజలను చైతన్య వంతులను గావించాయి.

భారతదేశంలో ఆంగ్లేయుల పాలనవల్ల ఇంగ్లాండులో ఏర్పడిన పారిశ్రామిక విప్లవం ప్రభావంగా గ్రామీణ, కుటీర పరిశ్రమలు మూల పడ్డాయి. దేశీయులలో ఒక విధమైన నైరాశ్యం చోటు చేసుకొంది. అంతేకాక ఆంగ్లేయుల పాలనలో వారు విధించిన మోయలేని పన్నులు ప్రజలను ఋణగ్రస్తులను చేసాయి. బ్రిటిషు పాలక వ్యవస్థకు అయ్యే అత్యధిక వ్యయం వల్ల భారత సంపద కొల్లగొట్టబడి దేశం ఎంతగానో పేదవడిపోయింది. వృత్తి విద్యలపట్ల అనాదరణ ఒకవైపు, ఉన్నతోద్యోగాలకు అనర్హత ఇంకోవైపు భారతీయులను తీవ్ర అసంతృప్తి జ్వాలలకు గురిచేసింది. అధికారుల చిన్నచూపు, కరువు కాట

కాలు భారతీయుల హైన్య స్థితికి కారణాలయ్యాయి.[1] దేశమంతటా వ్యాపించిన ఈ అసంతృప్తి జ్వాలలు ఆంధ్రదేశాన్ని పట్టి పీడించాయి.

ఆ కాలంలో ఆంధ్రదేశంలో బందరు పట్టణానికి ఒక విశిష్టమైన స్థానం ఉండేది. ఖండ ఖండాంతరాలతో వర్తకం సాగిస్తూ గోలకొండ రాజ్యానికి గొప్ప రేవు పట్టణంగా బందరు ప్రసిద్ధి వహించింది. సరకుల ఎగుమతి దిగుమతుల వ్యాపారాలతో, చేనేత కలంకారి అద్దకం మొదలైన వృత్తులతో నాటి బందరు ఎంతో సంపన్నంగా ఉండేది. అనాదిగా గ్రీకు, రోమక, పారసీక దేశాలకు బందరు నుంచి మంచి వస్త్రాలు ఎగుమతయ్యేవి. ఆంగ్లేయుల పరిపాలనకు పూర్వమే తెలుగుదేశంలో బందరు పట్టణం సుప్రసిద్ధ సాంస్కృతిక కేంద్రంగా రూపుదిద్దుకొంది.

అంతేకాక బందరు పట్టణం లలితకళలకు కూడా పేరుమోసింది. శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి వంటి మహా విద్వాంసులు, అశ్వధాటి రామమూర్తి గారి వంటి మృదంగ విద్వాంసులు, 'నటశేఖర' డి.వి. సుబ్బారావు, ప్రమోదకుమార ఛటర్జీ, అడివి బాపిరాజు, దామర్ల రామారావు గారల వంటి చిత్రకళావిదులు, హరినాగభూషణంగారివంటి సంగీత విద్వాంసులు, దాలిపర్తి పిచ్చహరిగారి వంటి నాదస్వర పండితులు బందరు కళా ప్రాభవానికి నిదర్శనంగా నిలుస్తారు.[2] వీటన్నిటికీ తోడుగా రాజకీయంగా, సాంఘికంగా కూడా బందరు పట్టణం ఎంతో చైతన్యవంతమైందనడంలో సందేహం లేదు.

క్రీ. శ. 1611 లోనే బ్రిటిషు ఈస్టిండియా కంపనీ వారు మచిలీపట్నం ఓడరేవు దగ్గర ఒక ఫ్యాక్టరీ స్థాపనకు అప్పటి గోలకొండ సుల్తాను వద్ద అనుమతి సంపాదించి, ఆంధ్రదేశంలో తొలిసారిగా పాదం మోపారు. ఈ రకంగా విదేశీయుల పరిపాలనలో బందరు ఆ రోజుల్లోనే ప్రధాన కేంద్రమైంది. ఆ కాలంలో కృష్ణా మండలంలో గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలు కలిసి ఉండేవి. అన్ని రకాల చైతన్యాలకు నిలయమైన కృష్ణా మండలంలో సంఘ సంస్కరణ శీలురు, ఉత్సాహవంతులైన కొందరు యువకులు కలసి 'కృష్ణా జిల్లా సంఘం'గా ఏర్పడ్డారు. రాజకీయ పరిజ్ఞానాన్ని ప్రజల కందించాలనీ,

ప్రజలను మూఢాచారాలనుండి మరలించి సంస్కరించాలని, రైతుల కష్ట సుఖాలను ఎప్పటికప్పుడు తెలిసికొని వారికి సముచితమైన సలహాల నందివ్వవలెనని, గ్రామీణ, కుటీర పరిశ్రమల విశిష్టతను చాటి చెప్పవలెననే సదాశయాలతో ఈ సంఘం క్రీ.శ. 1892 లో ఏర్పడింది. ఆంగ్ల విద్యాధికులు, దేశభక్తులైన ఈ యువకులు తమ సంస్కరణాభిలాష కనుగుణంగా జాతీయ భావాలతో ఈ సంస్థ నేర్పాటు చేసికొన్నారు.

దీనిలో భాగంగానే తమ ఆశయాల ప్రచారం కోసం కృష్ణా జిల్లాకే పరిమితంగా ఒక వేదిక నేర్పాటు చేసికోవాలనుకున్నారు. దాని ఫలితమే 'కృష్ణా పత్రికా' విర్భావం. కృష్ణా మండలం, కృష్ణా నదీతీరాలను పురస్కరించుకొని వారు తమ పత్రికకు 'కృష్ణాపత్రిక' అని నామకరణంచేసి ఉండవచ్చు. ఒక వేళ కృష్ణారావు గారు పత్రికావిర్భవవేళ అక్కడ ఉంటే కృష్ణా పత్రికకు, 'కృష్ణవేణి' అని పేరు పెట్టి ఉండేవారేమో[3].

1892 లో ఏర్పడ్డ కృష్ణాజిల్లా సంఘం క్రమక్రమంగా పుంజుకొని 1900 సంవత్సరం నాటికే ఒక పత్రిక నేర్పరచుకోవాలనే ఆలోచనకు వచ్చింది. రెంటాల వెంకట సుబ్బారావుగారు 1900 సంవత్సరంలో కృష్ణా మండల సభకు అధ్యక్షత వహించి పత్రిక నిర్వహించ వలెననే ఆలోచనకు స్ఫూర్తినందించి తదావశ్యకతను సభకు తెలియజేసారు. ఈ ప్రతిపాదనతో బాటుగా ఆయనే మొట్టమొదటగా వంద రూపాయల విరాళాన్ని కూడా ప్రకటించారు. వెనువెంటనే కృష్ణాజిల్లా సంఘంలోని ప్రధాన సభ్యులైన పురాణం వెంకటప్పయ్యగారు, జంధ్యాల గౌరీనాథ శాస్త్రిగారు, వేమూరి వెంకట సుబ్బారావుగారు, కెడింబి హనుమంతరావుగారు, కొండా వెంకటప్పయ్యగారు, అయ్యంకి వెంకట చలపతిరావుగారు, వల్లూరి సూర్యనారాయణ గారు, పెద్దిభొట్ల వీరయ్యగారు తమ తమ శక్తిమేరకు విరాళాలందించారు. జిల్లా సంఘ సంచార కార్యదర్శి శనగన రామస్వామిగుప్తగారు చందాలు వసూలు చేయడానికి పూనుకొన్నారు.[4] 1902 ఫిబ్రవరి 1 వ తేదీన కొండా వెంకటప్పయ్య పంతులు, దాసు నారాయణరావుగారల సంయుక్త సంపాదకత్వ బాధ్యతతో కృష్ణాపత్రిక ప్రథమ సంచిక వెలువడింది. ఆ పత్రికలోనే 'స్వవిషయం' అన్న శీర్షికన తమ పత్రిక ప్రకటనావశ్యకతను, తమ ఆశయాలను ప్రచురణకర్తలు ఈ విధంగా వెలువరించారు:

"రాజ్య పద్ధతులను, వాని లోపములను నివృత్తి చేయు మార్గములను, సంఘ సంస్కరణ రీతులను, రసవాద, ప్రకృతి శాస్త్ర విశేషములను, వ్యవసాయమును, చేతిపనులు మొదలుగాగల నుపయుక్త విషయముల నిందు వ్రాయుచుంటిమి. ఆ విషయములందు కూడ జన సామాన్యమునకు కొంతపాటి పరిచయము కలిగినగాని దేశమభివృద్ధి గానేరదు. స్వలాభమును గోరక దేశాభివృద్ధి కొరకై అభిమాన బుద్ధితో బూనిన యీ ప్రయత్నమునకు కృష్ణా మండలము నందలి చదువరులందరు తోడ్పడి దీనికి చందాదారులుగ జేరి దీని నభివృద్ధికి తెచ్చెదరని నమ్ముచున్నాము."

ప్రజలను అనేక రంగాలలో జాగరూకులను చేసి తద్వారా దేశాభివృద్ధికి పాటుపడడం, స్వలాభాపేక్ష లేకుండా దేశాభివృద్ధిని కాంక్షించడమనే ఈ ఆశయాలు పత్రిక చిత్తశుద్ధిని చాటుతున్నాయి.

ప్రారంభంలో కృష్ణాపత్రిక పక్షపత్రికగానే ఉండేది. 1905 వ సంవత్సరం వరకు పక్ష పత్రికగానే ఉండి 1905-7 సంవత్సరాల మధ్య వార పత్రికగా మారింది. కృష్ణాపత్రికకు సహ సంపాదకులైన దాసు నారాయణ రావుగారు 2-9 1905 న కాలధర్మ మొందగా ఆయన స్థానంలో ముట్నూరి కృష్ణారావుగారు కొండా వెంకటప్పయ్యగారికి సహాయ సంపాదకురాలైనారు.[5] 1905 లో కృష్ణాజిల్లాను పరిపాలనా సౌలభ్యం దృష్ట్యా రెండుగా విభజించి గుంటూరు ప్రాంతాన్ని ప్రత్యేక జిల్లాగా వేర్పరచారు. అంతవరకు శొడింబి హనుమంతరావు గారితో కలిసి ప్రాక్టీసు చేస్తున్నకొండా వెంకటప్పయ్యగారు తమ స్వస్థానమైన గుంటూరు జిల్లాకు మకాం మార్చారు. దానితో కృష్ణాపత్రిక నిర్వహణ సంపాదకత్వ బాధ్యతలు పూర్తిగా కృష్ణారావుగారిపైనే పడ్డాయి.

దాసు నారాయణరావుగారు సుప్రసిద్ధ రచయిత, గొప్ప దేశభక్తుడు. అనేక నాటకాలు, గ్రంథాలు వ్రాసి విస్తృతకీర్తి గడించారు. కృష్ణాపత్రిక వ్యవస్థాపక సంపాదకులుగా ఇతోధికంగా కృషిచేసి పత్రిక భవితవ్యానికి గట్టి పునాదులు నిర్మించారు. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు నిష్కళంక త్యాగమయ జీవితం గడిపినవారు. స్వరాష్ట్రం కోసం, స్వరాజ్యం కోసం అంకుఠిత దీక్షతో కృషి చేసిన దేశభక్తులు. మొదట్లో కృష్ణాజిల్లా

సంఘసభ్యులై పిదప కార్యదర్శులై కృష్ణాపత్రిక వ్యవస్థాపకులై భాషాసేవ ద్వారా దేశసేవ చేసిన ధన్యజీవి.

1905 లో వంగరాష్ట్ర విభజనకు యావద్దేశం అట్టుడికి పోయింది. విభజనకు అసమ్మతిగా తిలక్, అరవిందఘోష్, బిపిన్‌చంద్ర పాల్‌ల నాయకత్వాన విదేశీ వస్తు సంస్థల బహిష్కారానికి పిలుపు వచ్చింది. ఆ సమయంలో బిపిన్‌చంద్ర పాల్ గారు 'న్యూ ఇండియా' పత్రికను వెలువరించేవారు. ఆ పత్రిక కృష్ణారావు గారిని సమధికంగా ప్రభావితులను చేసింది. స్వదేశీ. స్వరాజ్యోద్యమాలు విస్తారంగా వ్యాపించాయి. 'వందేమాతరం' నినాదాలు మారుమ్రోగసాగాయి. ఈ పరిస్థితులలో కృష్ణారావుగారు పాల్‌గారితో కలిసి వంగదేశ పర్యటన గావించారు. ఈ మధ్యకాలంలో (1905-7 సంవత్సరాలలో) కొన్ని నెలలపాటు అవటపల్లి నారాయణరావుగారు కృష్ణాపత్రిక నిర్వహించారు.

అవటపల్లి వారు కృష్ణాపత్రికలో మొదట్లో సహాయ సంపాదకులుగా చేరారు. ఆయన జీవితంలో స్వయంకృషితో పైకివచ్చి తమదైన విశిష్టతను చాటుకున్నారు. కృష్ణాపత్రికలో, ఆంధ్రపత్రికలో కొంతకాలం పనిచేసారు. అమెరికా వెళ్ళి ఎం. ఏ. పట్టం పుచ్చుకొన్నారు. కొంతకాలం బర్మాలో ఉండి అక్కడి తెలుగు కూలీల దురవస్థలను తొలగించేందుకు నాయకత్వం వహించి అవిరామంగా కృషి చేసారు.అంతేకాక రెండుమార్లు శాసన సభ్యత్వం స్వీకరించి అక్కడి ప్రజలకు విశిష్ట సేవలందించారు.

1929లో ఆంధ్ర జనుల పక్షాన ఆయనే కృష్ణాపత్రిక, ఆంధ్ర పత్రికలకు సన్మానం జరిపించారు. అవటపల్లివారు ప్రకటించిన విశాలాంధ్రమనే పుస్తకం వారి అకుంఠిత కృషికి, అపూర్వ దేశభక్తికి నిదర్శనం.

బెంగాల్ పర్యటన అనంతరం కృష్ణారావుగారు 1907లో తిరిగి కృష్ణాపత్రికలో చేరి సంపాదకత్వ బాధ్యత స్వీకరించారు. స్వదేశీయోద్యమ ప్రభావంతో 'కృష్ణా స్వదేశీ ముద్రాక్షరశాల' అనే పేరుతో ఒక స్వంతప్రెస్సు నేర్పాటు చేసుకొని, పత్రికకు తామే సంపూర్ణాధిపత్యం వహించారు.

వంగరాష్ట్ర విభజన, వందేమాతరం ఉద్యమ ప్రభావం కృష్ణారావు గారిలో ఒక నూత్న చైతన్యాన్ని, జాతీయ స్ఫూర్తిని కలిగించాయి. అంత వరకు మితవాద ధోరణిలో నడుస్తున్న కృష్ణాపత్రిక కృష్ణారావుగారి ఆగమ నంతో కొంత తీవ్రవాద ధోరణిని అలవరచుకొంది. వందేమాతరం ఉద్యమ కాలంలో మాతృదేశభక్తిప్రపూరితులైన భారతీయ యువకులు కొందరు శ్వేత జాత్యధికారులను హత్య చేసే ప్రయత్నాలు గావించారు. యువకులు, ఉత్సాహవంతులైన కృష్ణారావు గారిలో పెల్లుబికిన ఆ జాత్యావేశ ఫలితమే – 1908 లో కృష్ణాపత్రికలో ప్రచురించిన "తెల్లవారిని తుపాకులతో కాల్చుట" అన్న సంపాదకీయం. ఈ సంపాదకీయం ప్రచురించిన వెంటనే పరిణామం చాలా దారుణంగా ఉంటుందని ముందే ఊహించి పత్రిక కాపీలన్నింటిని తగులబెట్టారు. కానీ ఒకటి రెండు కాపీలు ఎట్లో ప్రభుత్వం చేతికి చిక్కనే చిక్కాయి. ఆనాటి జిల్లా కలెక్టర్ స్కాట్ ఈ సంపాదకీయం చదివి క్రుద్ధుడై దాని రచయితను పత్రికనుండి తొలగించకపోతే తీవ్ర పరిణామా లెదుర్కో వలసి వస్తుందని కృష్ణాజిల్లా సంఘాధ్యక్షుడైన శొడింబి హనుమంతరావుగారిని పిలిపించి హెచ్చరించారు. ఫలితంగా కృష్ణారావుగారు, అవటపల్లివారు 18 - 07 – 1908 నుండి కృష్ణాపత్రికతో సంబంధం వదలుకున్నారు.[6]

నడక నేర్చుకుంటున్న శిశువు తప్పటడుగులు వేస్తూ దొర్లి పడిపోయినట్లు కృష్ణాపత్రిక చిరుతప్రాయంలోనే ఈ క్లిష్ట పరిస్థితికి గురైంది. జిల్లా సంఘం సమావేశమై కృష్ణాపత్రిక నిర్వహణను గురించి పునరాలోచించింది. కొందరు సభ్యులు పత్రికను పూర్తిగా ఎత్తివేయడమే మంచిదన్నారు. కొందరు తటస్థంగా ఉన్నారు. బందరులో అ నరికే పిస్తృత విఖ్యాతులైన డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు ముందుకు వచ్చి స్వచ్ఛందంగా కృష్ణాపత్రిక బాధ్యతను తమ భుజస్కంధాలపై వేసుకొన్నారు. ఈ విధంగా దాదాపు మూడు సంవత్స రాలు ప్లీడరు సి. వి. రామాచారి గారి పేరిట పట్టాభిగారే కృష్ణాపత్రికను నిర్వ హించారు. అంతేకాక తమ నేతృత్వంలో కృష్ణాపత్రికకొక సక్రమస్థితి కల్పించి రెండువేల రూపాయల లాభంతో 1912 లో తిరిగి కృష్ణారావు గారికి అప్ప గించారు.[7]

డా॥ పట్టాభి సీతారామయ్యగారు బహుముఖీన ప్రజ్ఞాశాలిగా అసాధారణ ప్రతిభతో అటు రాజకీయరంగంలో, ఇటు సంస్కరణ పథంలో ఎనలేని కృషి గావించారు. కృష్ణారావుగారికి ఆబాల్యమిత్రులే కాదు, ఆయన అంతరంగ మెరిగినవారు. కృష్ణారావు గారిని తన మిత్రుడిగా, వేదాంతిగా, మార్గదర్శకుడిగా ఎంచుకొని, పరదాస్య విమోచన కోసం పాటుపడ్డ క్రియాశీలి పట్టాభిగారు. "వైశ్య సూత్రకారుణ్ణి అయిన నాకు బ్రాహ్మణ బాష్యకారుడు పట్టాభి" అని ఒకమారు గాంధీ మహాత్ముడు పట్టాభిని ప్రశంసించారు. ఇది ఆయన రాజకీయ ధౌరంధర్యానికి తార్కాణ. ఆంధ్రా బ్యాంక్ మొదలైన అనేక సంస్థలను స్థాపించడమేకాక 'జన్మభూమి' 'స్టేట్స్‌పీపుల్' వంటి పత్రికలకు సంపాద కత్వం వహించారాయన. అఖిల భారత కాంగ్రెస్ చరిత్రను జైల్లో కూర్చుని రెండు నెలలలో వ్రాసిన ఘనత ఆయనది. పట్టాభిగారు పూనుకొనిఉండకపోతే కృష్ణాపత్రిక గతి ఏమయ్యేడిదో?

1911-1912లో తిరిగి సంపాదకులైన కృష్ణారావుగారి లేఖిని గతాను భవ ప్రభావంతో ఒక విధమైన గడుసుతనం సంతరించుకొంది. "చట్ట నిబంధ నలకు లొంగని, చక్కని వ్యంగ్య స్ఫూర్తితో బ్రిటిషు పరిపాలకుల నపహాస్య మొనరిస్తూ, తోటి దేశీయులల్లో జాతీయతా ప్రబోధం గావించిన వాక్చాతుర్య మది."[8] ఈ రచనా ధోరణి పఠితృ లోకాన్ని ఉర్రూత లూగించేది. విస్మయ చకితుల్ని చేసేది. కర్తవ్య దీక్షాబద్ధులుగా మలచేది.

ముట్నూరి కృష్ణారావుగారు కృష్ణాపత్రికను నిర్వహించిన తీరు అతి విశిష్టమైనది. ఏడాది పసిబిడ్డలాంటి కృష్ణాపత్రికను పొత్తిళ్ళలో పొదిమికొని పెంచి పోషించి అజన్మాంతం మొక్కవోని దీక్షతో నిర్వహించారు.[9] ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనానికి, అభ్యుదయ కళా కవిత్వ వికాసానికి కృష్ణాపత్రికను వేదికగా చేసికొని కృష్ణారావుగారు సమర శంఖం పూరించారు. సాంఘిక, రాజకీయ, ఆర్థిక సాహిత్య, శిల్ప, కళారంగాలపై విలువైన వ్యాసాలు వెల్లడిస్తూ కాలగతికి తమ సునిశిత పరిశీలనా శక్తితో శాస్త్రీయ వివేచనా దక్షతతో చక్కని వ్యాఖ్యానాలు వ్రాసారు. సకలాంధ్ర జగత్తూ కృష్ణా పత్రికను ఆదర్శంగా తీసుకొన్నదంటే అత్యుక్తి కాదు. పత్రిక రాకకోసం ఎదురుతెన్నులు గాసేవారు. గ్రామాలలో రచ్చబండలపై సమావేశమై పత్రికను చదివి,చర్చించు

కాని తమ కర్తవ్యాన్ని నిశ్చయించుకునేవారట.10 ఈ రకంగా కృష్ణారావుగారి చేతిలో కృష్ణాపత్రిక సర్వతోముఖ వికాసాన్ని సాధించింది.

1930 లో శాసనోల్లంఘన సమయంలో ప్రెస్సుకు ధరావత్తు చెల్లించమన్న ప్రభుత్వాదేశాన్ని తిరస్కరించినందుకు కృష్ణారావుగారిని ఆరు నెలలు రాయవెల్లూరు జైలులో నిర్బంధించారు. తిరిగి జనవరి 4, 1932 న అరెస్టుచేసి రెండేండ్ల శిక్ష విధించారు. ఈ వ్యవధానంలో కోట సుబ్బారావుగారు దాదాపు మూడేండ్లు కృష్ణారావుగారి అభీష్టం మేరకు సంపాదకత్వ బాధ్యత స్వీకరించారు. కృష్ణారావుగారు చెరసాలనుండి విడుదలై వచ్చి తిరిగి సంపాదకత్వం వహించింది 1935 లోనే.

ఈ మధ్య కాలంలో కోట సుబ్బారావుగారికి సహాయ సంపాదకుడుగా విశ్వనాథ వెంకటేశ్వర్లుగారుండేవారు. నార్ల వెంకటేశ్వర రావుగారు బందరు నోబుల్ కళాశాలలో బి. ఏ. విద్యార్థిగా ఉన్నందున కోట సుబ్బారావుగారికి సహాయ సంపాదకులుగా తోడ్పడుతుండేవారు.

1933 లో కమలాకర వెంకటరావు, 1938 లో రావూరు వెంకట సత్యనారాయణరావుగారలు కృష్ణాపత్రిక సంపాదకవర్గ సభ్యులయ్యారు.

కోట సుబ్బారావుగారు ముట్నూరువారిని గురుతుల్యులుగా భావించేవారు. భావించడమే కాదు-ఆరాధించి అభిమానించేవారు. ఆయన హృదయాన్ని ఎరిగి మసలేవారు. కృష్ణారావుగారు జైల్లో ఉన్నప్పుడు అచ్చంగా కృష్ణారావుగారే వ్రాస్తున్నారా అనే భ్రమ కలిగేటట్లు సంపాదకీయాలు వ్రాసేవారు. పత్రిక ఆఫీసులో కుర్చీపై కృష్ణారావు గారి చిత్రపటం ఉంచి, పత్రికలో ఒక పేజీ ఆయనపేర ఖాళీగా విడిచిపెట్టి భగవద్గీతా శ్లోకాన్నో, ఏదో ఒక సూక్తినో మాత్రం ఆ పేజీలో ప్రచురిస్తూ తమ విధేయతను ప్రకటించుకున్నారు. కృష్ణారావుగారి అంత్య దినాలలో కోట సుబ్బారావుగారు దగ్గరుండి గురువుగారికి సపర్యలు చేసి, చివరకు ఆయన అపర కర్మను సైతం ఆచరించిన అపూర్వ శిష్యులు.

1945 లో కృష్ణారావుగారు మరణానికి ముందే తమ తదుపరి కృష్ణా పత్రిక నిర్వహణకు విల్లు సిద్ధం చేసారు.

"కృష్ణారావుగారు (చికిత్స కోసం) మద్రాసు వెళ్ళబోయేముందు కృష్ణా పత్రికను, అచ్చు ఆఫీసును నిర్వహించడానికి ధర్మకర్తృత్వ సంఘం ఏర్పాటు చేసారు.

1. తన తరువాత సంపాదకుడుగా ఉండబోయే మహాకవి శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు
2. తమ పత్రిక ఆఫీసులో ఉపసంపాదకులుగా ఉన్న శ్రీ కమలాకర వెంకటరావు
3. శ్రీ రావూరు వెంకట సత్యనారాయణ
4. ఆఫీసు మేనేజర్ : శ్రీ కాజ శివరామయ్యగార్లను
5. ప్రెస్సు, కృష్ణాపత్రిక తన స్వంతం, తనస్థానే మనుమరాలు కుట్టెమ్మ (ముద్దుపేరు) అసలు పేరు శ్రీమతి నరసాబాయి (ఆచార్యులు వంగర శివరాంగారి కుమార్తె, శాంతి రామమూర్తి గారి కోడలు)

ఈ అయిదుగురిని పాలక వర్గంగా ఏర్పాటు చేసారు.

యజమాని, ఉద్యోగులు సమష్టిగా ప్రతిష్ఠాపనలను నిర్వహించి అవి తమవిగా భావించుకొని, అందువల్ల వచ్చిన లాభములను అనుభవించి ఆనందించుట ప్రజాస్వామ్యము—ఇదియే సామ్యవాదం. అందులకు అనుగుణముగా ఈ పాలక వర్గమును ఏర్పరచుట ఆయన పద్ధతి. అందులకు యిది నిదర్శనం."[11]

కృష్ణారావుగారు 1935 లో తిరిగి బాధ్యత గైకొన్నది మొదలు 1945 వ సంవత్సరం వరకు ఆయన సంపాదకత్వ చరిత్రలో చరమ ఘట్టం. "అస్తాద్రికి చేరబోవు భాస్కరుని శబల రోచిస్సులను ఈ దశలో వారు వెలయించుకుంటూ ఎల్లరకు సులభ గమ్యులయ్యారు. శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు, కాటూరి వెంకటేశ్వరరావు, అడివి బాపిరాజు, మల్లాది రామకృష్ణశాస్త్రి, కొడాలి ఆంజనేయులు, పింగళి నాగేంద్రరావు, జల

సూత్రం రుక్మిణీనాథశాస్త్రి ప్రభృతులు దర్బారీయులుగ ప్రఖ్యాతి కెక్కిన కృష్ణాపత్రిక దర్బారు వెలసినది. కృష్ణారావుగారు 'లో వెలుగులు' (వ్యాస సంకలనం) వ్రాసింది ఈ రోజుల్లోనే. 1938లో సహాయ సంపాదకులుగా చేరిన రావూరి వెంకట సత్యనారాయణరావుగారు "వడగళ్ళు' అనే క్రొత్త శీర్షిక క్రింద అపూర్వ ధోరణిలో హాస్యరసం కల్పించి కృష్ణాపత్రిక కొక క్రొత్త సొగసు దిద్దారు.

1945 సం॥ జూన్ 23 వ తేదీని కృష్ణారావుగారి నిర్యాణానంతరం వీలునామా ననుసరించి కాటూరి వెంకటేశ్వరరావుగారు విడిగా కొంతకాలం, కోలవెన్ను రామకోటేశ్వరరావుగారితో కలిసి మరికొంతకాలం పత్రికా సంపాదకత్వం నిర్వహించారు. ఇదొక ఆరు సంవత్సరాలు.

పిమ్మట మరొక ఆరు సంవత్సరాలు ఆర్. డి. ఎల్. నరసింహమూర్తి గారి యాజమాన్యాన నడిచింది. అప్పటి సంపాదకులు కమలాకర వెంకట రావుగారు.

అనంతరం కృష్ణారావు గారి దౌహిత్రుడు రామకృష్ణారావు గారి యాజమాన్యాన దాదాపొక సంవత్సరం నడిచింది.

తరువాత వి. వై. ఎల్. నరసింహారావు గారు కొంతకాలం మద్రాసులో నడిపారు. వారే 'లోవెలుగులు' కూడా ప్రకటించారు. అనంతరం అచిర కాలంలోనే ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ గారి చేతికి వచ్చింది."[12]

"కృష్ణాపత్రిక ఒక వ్యక్తిది కాదు. ఒక లేఖిని పరాస్తమైన, దానికి మారుగా సహస్రలేఖినులు బయలువెడలి, సత్యధర్మముల నెక్కువ శక్తితో ప్రకటింపగలవు. లేఖినులు కేవలము ఉపకరణములు. భారత శక్తి తన యమోఘ సంకల్పమును వీని మూలమున ప్రకటించుచున్నది. దోషములు, ఇతర వికారములు వ్యక్తులవిగాని ఆ మహా శక్తివి కావు" అన్న కృష్ణారావు గారి మహదాశయాన్ని ప్రేరణగా గైకొని సుబ్రహ్మణ్య శర్మగారు ఫిబ్రవరి ఆరవ తేది 1960 న సంపాదకత్వ బాధ్యత స్వీకరించారు. గత వైభవాన్ని

కొంతవరకైనా శర్మగారి హయాంలో కృష్ణాపత్రిక పొందగలిగిందంటే అది వారి దృఢ దీక్షకు నిదర్శనమే అవుతుంది.

క్షీణదశకు చేరుకొని దాదాపు అంతరించే స్థితికి సమీపించిన తరుణంలో, శర్మగారు కృష్ణారావుగారిపై నుండే ఆదరాభిమానాలతో కృష్ణాపత్రిక పునరుద్ధరణకు పూనుకున్నారు.

"…. పత్రికా ప్రవంతి ఇసుకతిన్నెలడ్డము వచ్చినంతమాత్రమున ఎట్లు అంతరించి పోగలదు? వేగమొకింత విఫలము కావచ్చును. ప్రతిఘటనములు ప్రబలతరము కావచ్చును. కాని సమ ప్రదేశమందు ప్రవహించు నదీ జలములు, కొండలడ్డమైనప్పుడు పొంగి పొరలి జలపాతముగా ఘూర్ణిల్లునట్లు ఈ పత్రిక గంభీర స్వరమున శబ్దించగలదు" అన్న కృష్ణారావుగారి విశ్వాసాన్ని ఊపిరిగా తీసుకొన్నారు. శర్మగారి ఆధ్వర్యవంలోనే కృష్ణాపత్రిక వజ్రోత్సవాన్ని జరుపుకోవడం విశేషం. 14-2-1964 న హైదరాబాదులో బెజవాడ గోపాలరెడ్డి గారి అధ్యక్షతన ఈ ఉత్సవం వైభవోపేతంగా జరిగింది. ఈ సందర్భంగా వెలువడిన 'వజ్రోత్సవ సంచిక'ను బూర్గుల రామకృష్ణారావుగారు ఆవిష్కరించారు. నీలం సంజీవరెడ్డిగారు, గొట్టిపాటి బ్రహ్మయ్యగారు మొదలైన ప్రముఖులు ఆ సభలో పాల్గొన్నారు.

దాదాపు 10 సంవత్సరాలు హైదరాబాదు నుండి, పిదప 1970 నుండి కొంతకాలం విజయవాడ నుండి పత్రికను నడిపించారు. సుబ్రహ్మణ్యశర్మగారి తర్వాత కృష్ణాపత్రికాధికారాలు ప్రస్తుతం పిరాట్ల వెంకటేశ్వర్లుగారికి సంప్రాప్తించాయి. వారి సారథ్యంలో ఇటీవల కృష్ణాపత్రిక దిన పత్రికగా వెలువడుతున్నది.

## అధో జ్ఞాపికలు :

1. భారత జాతీయ కాంగ్రెస్ (1885-1985) శతజయంతి సంచిక. పుట 4. 'భారత స్వాతంత్ర్య ఉద్యమం' వ్యాసం - రచయిత డి. రామలింగం.
2. వీరిలో కొందరు బందరు వాస్తవ్యులు కాకపోయినా చాలా కాలం బందరులో ఉండి తమ కళలతో బందరుకు పేరుతెచ్చారు.
3. కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక సంపా. ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మ. అరువది రెండేండ్లు నిండిన 'కృష్ణాపత్రిక' వ్యాసం - దర్బారీయుడు పేజి. 3.
4. అదే పుస్తకం, అదే పుట.
5. బందరు, మద్రాసులలో విద్యాభ్యాసం పూర్తిచేసుకొని 1903 వ సంవత్సరంలోనే కృష్ణారావుగారు కృష్ణాపత్రిక సంపాదకులైన కొండా వెంకటప్పయ్య పంతులు, దాసు నారాయణరావు గారలకు సహాయ సంపాదకులుగా చేరారు.
6. 'కృష్ణాపత్రికాధిపతులగు ముట్నూరు కృష్ణారావుగారును, సహాయ పత్రికాధిపతులగు అవటపల్లి నారాయణరావుగారును ఈ నెల 18 వ తేదీని తమ ఉద్యోగములకు రాజీనామా ఇచ్చి, నాటి నుండియు పత్రికతో సంబంధము వదులుకొనిరని తెలియజేయుచున్నాము.'
— 19-07-1908 నాటి కృష్ణాపత్రికలో ప్రకటన.
7. చూ. జాతి వెలుగులు - గొట్టిపాటి బ్రహ్మయ్య 'మహామేధావి డా. పట్టాభి సీతారామయ్య' వ్యాసం పేజి నం. 80.
8. కృష్ణరాయ సంపాదకీయ వ్యాసాలు - ౧
కృష్ణాపత్రిక ప్రచురణలు. ప్రథమ ముద్రణ 1968.
పరిచయం - కమలాకర వెంకటరావుగారు పుట 7.
9. కృష్ణారావుగారు తమ విద్యాభ్యాసానంతరం 1903 లో బందరు చేరుకొని కృష్ణాపత్రికలో సహాయసంపాదకులుగా చేరి క్రమేణా సంపాదకులై, అధిపతులై 1945లో స్వర్గస్థులయ్యేవరకు పత్రికను నిర్వహించారు.

10. "ఈ సంపాదకీయాలు చదివి, కాంగ్రెస్ ఉద్యమంలోకి ఉరికిన వారెందరో ఉన్నారు. ఒక రోజున ఒక ఊరిలో కృష్ణాపత్రిక సందేశం విని ఇరవై మంది శాసనోల్లంఘనం చేసి జైలుకు వెళ్ళినారట"- కళాప్రపూర్ణ రావూరు. 'మన ముట్నూరి'. పుట 76.

11. జాతి వెలుగులు - గొట్టిపాటి బ్రహ్మయ్య పుట. 127 ద్వి. ము. 1979.

12. 1945 నుండి 1952 వరకు కాటూరి, కోలవెన్ను, కమలాకర వెంకట రావుగారల నిర్వహణలో-1952 నుండి 1957వరకు ఆర్.డి.ఎల్. నరసింహమూర్తిగారి యాజమాన్యాన, కమలాకర వెంకటరావుగారి సంపాదకత్వంలో కృష్ణాపత్రిక వెలువడిందని తెలుస్తుంది. 1957 నుండి 1960 మధ్యకాలంలో రామకృష్ణారావుగారు, వై. వి. ఎల్ నరసింహారావుగారల నిర్వహణలో ఉండవచ్చు. 'అరువది రెండేండ్లు నిండిన 'కృష్ణాపత్రిక' వ్యాసం ఆధారంగా-దర్బారీయుడు. పుట 5.

# అధ్యాయం మూడు

# కృష్ణాపత్రిక – దర్బారు

కృష్ణాపత్రిక ముట్నూరి కృష్ణారావు గారికి ఎనలేని ఖ్యాతి నార్జించి పెట్టింది. కృష్ణారావుగారి ఆధ్వర్యంలో కృష్ణాపత్రిక తెలుగు పత్రికారంగంలో అగ్రస్థాన మలంకరించింది.

"కృష్ణారావు గారికీ కృష్ణాపత్రికకూ వున్న సంబంధం అవినాభావ సంబంధం. కృష్ణారావు గారి పేరుతో కృష్ణాపత్రిక స్థాపించబడలేదు, కృష్ణా పత్రిక పేరుతో తమకు కృష్ణారావు అనే నామకరణం చేయబడలేదు. అయినా పత్రిక పేరే దాని సంపాదకునిది, సంపాదకుని పేరే తన పత్రికది కావటం విచిత్ర సమన్వయం!"[1]

కృష్ణాపత్రిక కృష్ణారావు గారి ఆలోచనలకు, దార్శనికతకు వేదికగా నిలచి యావదాంధ్ర దేశాన్నీ జాగరితం చేసింది. పత్రిక ద్వారా ఆయన ప్రకటించిన మాటైన, దీటైన రచనలు సమకాలిక సమాజాన్ని ఎంతగానో ప్రభావితం చేసాయి. అయితే ఆయన రచనలకు అంత వాడి, వేడి ఎలా కలిగిందో పరిశీలించవలసి ఉంది.

కృష్ణారావు గారు కృష్ణాపత్రికను నిర్వహించిన తీరు అతి విచిత్రంగా ఉండేది. కృష్ణాపత్రికలో ప్రత్యక్షరంలో కృష్ణారావు గారి వ్యక్తిత్వ ముద్ర ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. ఆయన కేవలం పత్రికాధిపతిగానే కాక ఉత్తమ కోవకు చెందిన పాత్రికేయులుగా సమకాలిక రచయితలకు మార్గదర్శకు లయ్యారు. ఆయన నెరపిన రచనావ్యాసంగం, అందరికీ ఆమోదయోగ్యంగా గడిపిన జీవన విధానం ఆదర్శప్రాయంగా అలరారింది.

ప్రత్యక్షంగానో, పరోక్షంగానో భావితరాల పాత్రికేయు లెందరినో ఆయన ప్రభావితుల్ని చేసారు. అడివి బాపిరాజు, కోలవెన్ను రామకోటేశ్వరరావు,

రావూరి వెంకట సత్యనారాయణరావు, కోట సుబ్బారావు, కమలాకర వెంకటరావు, ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మ, భావరాజు నరసింహారావు, నార్ల వెంకటేశ్వరరావు గారల వంటి ప్రాతికేయులెందరో ముట్నూరి వారి అనుయాయులై వారి ఉన్నతాశయాల నవలంబిస్తూ ఉత్తమ సంపాదకులుగా కీర్తి గడించారు.

కృష్ణాపత్రిక నిర్వహణమే ఏకైక ధ్యేయంగా ఎంచుకొన్న కృష్ణారావు గారు తమ అపూర్వ మేధా విలసితాలైన వ్యాస పరంపరను వెలయిందారు. పత్రికాధిపతిగా కంటే పత్రికా సంపాదకులుగానే ఆయన ఎక్కువగా రాణించారంటే అసంభావ్యమేమీ కాదు. పత్రిక ఆదాయ వ్యయాలను, ఇతర పరిపాలనా సంబంధమైన వ్యవహారాలను సిబ్బందికే అప్పగించి తమ ఆదర్శాల కనుగుణంగా పత్రిక నడిపే బాధ్యత మాత్రం గైకొన్నారు. అవసరమైతే పత్రికలో చంద్రనిప్పులు కురిపించేవారు. ప్రభుత్వ దురాగతాలను చీల్చి చెండాడేవారు. ఆర్థిక, సాంఘిక సమస్యలకు చక్కని పరిష్కారాలందించేవారు. నైతికపు విలువల పరిరక్షణకు ఉద్యమించేవారు. జాతీయ స్ఫూర్తిని ప్రదర్శించేవారు. శాస్త్ర సాంకేతిక కళా సాహిత్య రంగాలపై అద్భుత రచన లందించేవారు. గహనమైన తాత్త్విక వేదాంత విషయాలను సైతం తర్కించి సరళతరం చేసి ప్రకటించే వారు. ఒక్కమాటలో చెప్పాలంటే ఎన్నుకున్న ప్రతివిషయాన్నీ కూలంకషంగా పరిశీలించి వాని నిగ్గు తేల్చేవారు. అందుకే ఆయన ఏది వ్రాసినా పరిపూర్ణత గోచరిస్తుంది. స్వయంసమృద్ధమైన భావాలతో విషయాన్ని వివేచించి ప్రదర్శించడంలో ఆయన సిద్ధహస్తుడు.

పత్రికా సంపాదకుడైన వ్యక్తికి సత్యావిష్కరణకు, విషయ వివేచనకు ప్రధానంగా కావలసిన లక్షణాలు రెండు: ఒకటి - భాషలో లోతైన పరిజ్ఞానం. రెండు - అనేక రంగాలతో సన్నిహిత పరిచయం. అయితే ఏ వ్యక్తీ జన్మతః సర్వజ్ఞుడు కాడు, అలాగే వారి రచనలూ సర్వసమగ్రాలు కాలేవు. కాని అపార లోకానుభవంతో, స్వీయ ప్రతిభను పెంపొందించుకొని నాన్యతోదర్శనీయమైన ప్రజ్ఞను ప్రదర్శిస్తారు కొందరు.

కృష్ణారావుగారి సమగ్రమైన, శక్తిమంతమైన రచనల వెనుక ఉన్న రహస్యమిదే. కృష్ణా పత్రిక కార్యాలయాన్నే ఆస్థానంగా చేసికొని నాటి జాతీ

యోద్యమ సమయంలో ఒకవైపు పోరాటం సాగిస్తూ మరోవైపు ఎందరో రాజ కీయ నాయకులకు, కళావేత్తలకు, సంఘ సంస్కర్తలకు, కవి గాయకులకు, విజ్ఞాన వేత్తలకు ఆలంబనగా నిలిచి, వెన్నుతట్టి వారిని ముందుకు నడిపిన క్రియాశీలి కృష్ణారావుగారు. నాటి కృష్ణా పత్రిక కార్యాలయం కదన రంగంగా, కళానిలయంగా, సాహితీ సదనంగా కళకళలాడింది. అదే అపర 'కృష్ణరాయ దర్బారు'గా పేరుగాంచి ఎందరినో చైతన్యవంతులను చేసింది.

కృష్ణా పత్రిక దర్బారులో ప్రతి నిత్యం సాయం సమయాల్లో అనే కానేక విషయాలపై చర్చలు, ఇష్టాగోష్ఠులు, వాదోపవాదాలు జరిగి కృష్ణా రావుగారి ఆమోద ముద్రతో ముగిసేవి. నిష్ణాతులైన పండితులు వాటిలో పాల్గొని తమ అభిప్రాయాలను వెలవరించేవారు. రోజూ జరిగే ఈ సమావేశాలలో ప్రసక్త మయ్యే విషయాలన్నిటినీ 'మౌనముద్రాలంకారులు' కృష్ణారావుగారు ఆకళింపు చేసుకొనేవారు. తమ స్వకీయ ముద్రతో మరుసటి సంచికలో ఆ విషయాలను సమన్వయించి, సవరించి, పెంచి, సంపాదకీయాలుగా, ఇతర వ్యాసాలుగా ప్రచురించేవారు. ఆ రచనలు ఆయా రంగాలలో నిష్ణాతులైన వారిని సైతం ఆశ్చర్య చకితులను చేసేవిగా ఉండేవి. పలువురి ద్వారా సేకరించడం వల్ల విషయంలోని లోతుపాతులు అవగాహనమవడమేకాక సత్యాన్వేషణకు దోహదపడేవి. కృష్ణారావుగారి చేతిలోపడి అవి అద్భుత వ్యాసాలుగా రూపు దిద్దుకునేవి.[2]

కృష్ణారావుగారు, కోపల్లె హనుమంతరావుగారు, భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు (ఈ ముగ్గురిని 'బందరు త్రయం'గా వ్యవహరించేవారు), కౌతా శ్రీరామశాస్త్రిగారు ప్రభృతులు మొదట్లో బందరులోని కృష్ణా క్లబ్‌లో సభ్యులుగా ఉండేవారు. అయితే ఆ క్లబ్‌లో సర్వసాధారణంగా జరిగే ఆట పాటలు, ధూమపానాది వ్యసనాలకు ఇష్టపడని వీరు సాయం సమయాల్లో బందరు సమీపంలోని కృష్ణాకాలువ గట్టున (బొంబాయి అని పిలువబడే ప్రాంతంలో) అడపా దడపా సమావేశ మయ్యేవారు. ఇష్టాగోష్ఠిగా అనేక విషయాలు చర్చించుకునేవారు. ఆ చర్చలలో సందర్భవశాత్తు అమూల్యమైన అనేక విషయాలు దొర్లేవి.

ఈ రకమైన సమావేశాలు క్రమక్రమంగా కృష్ణాపత్రిక కార్యాలయం లోకి మారి కృష్ణారావుగారి నేతృత్వంలో జరుగసాగినవి. ప్రథమ, ద్వితీయ ప్రపంచ సంగ్రామాల సమయాలలో శాసనోల్లంఘనం, ఉప్పుసత్యాగ్రహం, సైమన్ కమీషన్ నిరసన, క్విట్టిండియా మొదలైన జాతీయోద్యమాల సందర్భంగా కృష్ణాపత్రిక కార్యాలయంలో అర్ధరాత్రి వేళలలో రహస్య సమావేశాలు జరిగేవి. అంతేకాక ఎందరో రాజకీయ నాయకులు, సత్యాగ్రహులు కృష్ణారావు గారితో సంప్రదింపులు జరిపి, సలహాలు స్వీకరించి కర్తవ్యోన్ముఖులయ్యేవారు. అందుకే కృష్ణాపత్రికపైన, పత్రికా కార్యాలయం పైన ప్రభుత్వం ఎప్పుడూ ఒక కన్నువేసి ఉంచేది. గూఢచారుల నిఘా కూడా తప్పేది కాదు.

కృష్ణారావు గారి జీవిత చరమ ఘట్టంలో (1935-45) దాదాపుగా ప్రతి దినం సాయంత్రం కృష్ణాపత్రిక దర్బారు జరిగేది. సరస సాహితీనిలయంగా, సకల కళామందిరంగా, రాజకీయ వేదికగా, వినోదాల వేడుకల కూడలిగా రోజుకొక వింతరూపం సంతరించుకునేది.

కృష్ణాపత్రిక కార్యాలయంలో జమ్ముగడ్డితో కప్పబడిన పాకనే "జామ్మా మసీదు" అని ముద్దుపేరుతో పిలుచుకునేవారు. అక్కడే ప్రతినిత్యం కృష్ణరాయ దర్బారు జరిగేది. అలనాటి భువన విజయాన్ని తలపోస్తూ ఈ దర్బారు అలరారేదని దర్బారీయులు సగర్వంగా చెప్పుకునేవారు. కృష్ణారావుగారే అపర కృష్ణరాయలు. 'గురుగ్రంథ సాహెబ్' గా దర్బారీయులాయనను మన్నించే వారు. వారి చర్చల్లో ఏవైనా వివాదాలు, సందేహాలు ఏర్పడితే కృష్ణారావుగారే తీర్పు చెప్పేవారు. స్వాభావికంగా మౌనముద్ర వహించి ఉండే కృష్ణారావు గారు దర్బారులో మహావక్తగా దర్శనమిచ్చేవారు. ఆయన ఎప్పుడో ఒకసారి తప్ప పెదవి విప్పేవారు కాదు. ఇందుకు భిన్నంగా కొన్నిసార్లు అనర్గళంగా అనేక విషయాలపై సుదీర్ఘోపన్యాసాలూ గావించేవారు. విద్యార్థి దశలోనే కృష్ణారావు గారు గురువుగారైన రఘుపతి వెంకటరత్నం నాయుడుగారిచే మంచి వక్తగా అభినందన లందుకున్నారు. అరుదుగా మాట్లాడినా ఆయనది అనర్గళమైన వాగ్ధాటి.

కృష్ణారావుగారిని ఒక చరత్ విజ్ఞాన సర్వస్వంగా అనేకులు భావించి, గౌరవించి ఆయన దర్శనం చేసుకొనేవారు. ఆయన సాన్నిధ్యమే ఒక యూనివర్సిటీగా, ఆయనతో మాట్లాడడమే ఒక ఎడ్యుకేషన్‌గా భావించే వారెందరో. దర్బారు ప్రవేశంకోసం కవులు, గాయకులు, నటులు, కళా కారులు ఎంతగానో తాపత్రయపడేవారు. దర్బారు ప్రవేశానికి కనీస అర్హత ఏమిటంటే, వారి రచనలు పత్రికలో అచ్చుకావడమే. ఆ రోజుల్లో బందరులో అడుగుపెట్టిన వారందరికీ అటు జాతీయ కళాశాల, ఇటు కృష్ణాపత్రిక దర్బారు దర్శనీయ స్థలాలైనాయి.

కృష్ణాపత్రిక దర్బారులో కృష్ణారావుగారితో సమానస్థాయిలో పట్టాభి గారు వ్యవహరించేవారు. రాజకీయ విషయాలను కృష్ణారావుగారితో చర్చించే వారు. ఆయన రాజకీయరంగంలో అవిశ్రాంత జీవనం గడుపుతున్నా తీరిక దొరికినప్పుడల్లా దర్బారుకు హాజరయ్యేవారు. కృష్ణారావుగారికి రాజకీయ, న్యాయపరమైన అనేకాంశాలలో చిట్టా సుందరరామయ్య పంతులుగారి సహాయ సహకారాలందేవి.

కాటూరి వెంకటేశ్వరరావు 'దర్బారు శాయరు' (కవి) గా ప్రసిద్ధు లయ్యారు. కృష్ణాపత్రికలో 'పన్నీటి జల్లు'లు (ఒక శీర్షిక) కురిపించేవారు. వ్యంగ్య రీతిలో దర్బారీయులపై కృష్ణారావుగారి నుద్దేశించి ఆయన పన్నీటి జల్లులు తరచుగా పత్రికలో ప్రచురించేవారు.

ఇంకా అడివి బాపిరాజుగారు (నాట్యాల బావగా విఖ్యాతులు) కమ్మగా గళమెత్తి జానపదగేయాలు ఆలపించేవారు. జరుక్‌శాస్త్రిగా పిలువబడే జల సూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు పేరడీలతో దర్బారును నవ్వుల పందిరిగా మలచేవారు. మాన్యులు బెజవాడ గోపాలరెడ్డిగారు హుందాగా దర్బారులో ప్రవే శించి రవీంద్రునిపై, జాతీయోద్యమాలపై ఉపన్యసించేవారు. బి.ఎన్. రెడ్డి, హెచ్.ఎమ్ రెడ్డి, కె. వి. రెడ్డి, చిత్తూరు నాగయ్య గారలవంటి చిత్రసీమకు చెందిన ప్రముఖులు దర్బారుకు చేరి కృష్ణారావుగారితో సంభాషించేవారు. విశ్వ నాథ సత్యనారాయణ, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి గారల వంటి విద్వాంసుల కవితాగానాలతో దర్బారు కళకళలాడేది.

మల్లినాథుడుగా ప్రసిద్ధుడైన శ్రీశైల మల్లికార్జునరావుగారు (ట్రైపిస్టు) తరచుగా టీ పార్టీ నిర్వహించేవారు. రావూరి వెంకట సత్యనారాయణరావుగారు "వడగళ్ళు" వినిపించేవారు.

ఇంకా కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు, పింగళి నాగేంద్రరావుగారు, మల్లాది రామకృష్ణశాస్త్రిగారు, దామరాజువారు, భావరాజు నరసింహారావుగారు, గోపరాజు గారు, కొడాలి ఆంజనేయులుగారు, గుడిసేన సుబ్బయ్యగారు, కాశీనాథుని పూర్ణమల్లిఖార్జునుడుగారు, పువ్వాడ శేషగిరిరావుగారు, గురజాడ రాఘవశర్మగారు, మునిమాణిక్యం నరసింహారావుగారు, గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, పెనుమర్తి వారు, గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు....వంటి ఎందరెందరో కవి పండితులు దర్బారు దర్శనం చేసికొన్నారు.

ఈ రకంగా ఎందరినో ఆకర్షించిన కృష్ణాపత్రిక దర్బారులో అంతర్జాతీయ రాజకీయాలు మొదలుకొని మునిసిపాలిటీ మురికి కాల్వల దోమల బాధల వరకు సమస్త విషయాలు విమర్శింపబడుతుండేవి.[3]

ఆచార్య పీఠమలంకరించిన 'గురుగ్రంథసాహెబ్' కృష్ణారావుగారు ఉపనిషత్తత్త్వ సారాన్ని, శిల్పకళా రహస్యాలను, వేదాంత విషయాలను, సామాజిక నీతి మర్యాదలను, రాజనీతి విషయాలను – ఒకటేమిటి, సమస్త విజ్ఞానాంశాలను వివరిస్తూ సదస్యుల నలరించేవారు.

ఈ విధంగా కృష్ణాపత్రిక దర్బారు రాజకీయ,సామాజిక, సాహిత్య, కళా చైతన్యాలకు నిలయమై ప్రజలకు నూత్న స్ఫూర్తి నందించింది.

## అధోజ్ఞాపికలు

1. రసతపస్వి కృష్ణారావు - గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, 1972.
2. అదే పుస్తకంలో -

"సత్యసేకరణకు వారు అవలంబించే విధానాన్ని చర్చిద్దాం. ఈ విషయాన్ని గురించి ఒక విమర్శకుడు 'ఆయన పదిమందినీ పోగుచేసేవాడు. పదిమందిచేతా వాగించేవాడు. మరునాటి సంపాదకీయంలో ఆ విషయాలే వ్రాసేవాడు'' అన్నారు.

కృష్ణారావుగారి శక్తి అన్నిటినీ సమన్వయం చేసుకోవాలనే శక్తి. ఆయన తాపత్రయం అన్నిటినీ తనలో ఇముడ్చుకోవాలనే. ఈ శక్తి ప్రవాహం లాంటిది. అన్నింటినీ ఏకం చేసుకోవాలనే తహతహే తప్ప విభజించి చూచే గుణం లేదు దీనికి."

- త్రిపురనేని గోపీచంద్ వ్యాసం 'మౌనముద్రాలంకారులు' పుటలు. 120 - 121.

3. అదే పుస్తకం-

'కృష్ణాపత్రిక దర్బారు' వ్యాసం - చెరకువాడ వేంకట నరసింహరావు. పుట. 212.

## అధ్యాయం నాలుగు

# సంపాదకుడు - సంపాదకీయం

సాధారణంగా లోకంలో చాలామందికి వార్తాపత్రికా పఠనంతోనే ప్రాతః కాల కార్యక్రమాలు ప్రారంభమౌతాయి. ఈ రోజుల్లో వార్తాపత్రికలు అక్షరాస్యులైన ప్రతి వ్యక్తికీ వార్తలద్వారా, తమ వ్యాఖ్యానాలద్వారా సమగ్ర సమాచార మందిస్తూ సమకాలిక సంఘటనలపట్ల సమ్యగవగాహన కలిగిస్తున్నాయి. వార్తాపత్రికలు కేవలం వార్తాప్రదర్శకాలే కాకుండా చిత్రాలతో, కార్టూన్లతో, వైజ్ఞానికవిశేషాలతో, వివిధరంగాలకు సంబంధించిన విశ్లేషణాత్మక వ్యాసాలతో (ఈ మధ్య డైలీ సీరియల్స్‌తో) విలసిల్లుతూ సామాన్యునికిసైతం అందుబాటులో ఉండే విజ్ఞాన సర్వస్వాలుగా అలరారుతున్నాయి. వార్తాహరునినుంచి, ప్రధాన సంపాదకుని వరకు ఎన్నో అంచెలుగా సాగే జర్నలిజం వ్యవస్థలో ఎందరో జిజ్ఞాసువులు, అన్వేషకులు, తాత్త్వికులు, మేధావులైన రచయితల సమష్టి కృషితో నేటి పత్రికలు అనుదినం వికసిస్తున్న వైజ్ఞానిక సాంకేతిక శక్తికి నిదర్శనంగా సర్వాంగసుందరంగా మనకందుతున్నాయి.

సమాజాన్ని జాగరితం చేస్తూ, వారికి సమకాలిక సంఘటనలపట్ల, సమస్యలపట్ల సరియైన అవగాహన కలిగిస్తూ వారిని చైతన్యవంతులుగా మార్చ గలుగుతున్న పత్రికా వ్యవస్థ ఔన్నత్యం ఎవరూ కాదనలేనిది.

సృష్టిలో ఏ ఇతర జీవికి లేని 'భాష'ను వరంగా పొందిన మానవుడు అనాదిగా తన హృదయ వేదనలను, ఆలోచనలను ఎదుటివారికి అభివ్యక్తం చేయగలుగుతున్నాడు. కాలక్రమానుగతంగా భాషాపరిణామరూపమైన లేఖనాన్ని సాధించి ప్రచార, ప్రయాణ సాధనాలేవీ అందుబాటులో లేని తొలి రోజుల్లోనే సంఘజీవియైన మానవుడు తన కాలంనాటి విశేషాలను తరువాతి తరాలకు అందించాలని తాపత్రయపడ్డాడు. శిలా, లోహ, దారు, చర్మచిత్రాలు లేఖనాలు ఇందుకు తార్కాణాలు.

నాటి రాచరికపు వ్యవస్థలో సమాచారమంటే కేవలం రాజాజ్ఞలు, రాజకీయ నిర్ణయాలు మాత్రమే. చాటింపు (దండోరా) పద్ధతిలో రాజాజ్ఞలను, రాజకీయ నిర్ణయాలను అవసరమైన మేరకు ప్రజలకు తెలియజేసేవారు. రాజకీయ ప్రకటనను రాతిపలకాలపై చెక్కించి ప్రతిష్ఠించేవారు. క్రమక్రమంగా రంగులతో వ్రాసే చిత్రలిపి వెలిసింది. కాలక్రమేణ ఏరోజు కారోజు తాజావార్తలు వ్రాసే అలవాటు ఏర్పడింది. కాగితం వ్యాప్తిలోకి రాకముందు రాతకోతలకు భూర్జపత్రాలను, తాళపత్రాలను, మృగ చర్మాలను, లోహం రేకులను ఉపయోగించేవారు.[1] తర్వాత తర్వాత కాగితం వాడుకలోకి వచ్చి వార్తాప్రకటనకు ప్రముఖ సాధనమైంది.

వార్తాలేఖకులు, గూఢచారులు వార్తలను సేకరించి ప్రభువులకు, అమాత్యులకు నివేదించేవారు. నాటి ప్రజాస్వామ్య వ్యవస్థలో వార్తలపై అధిపతుల నియంత్రణ అధికంగా ఉండేది. ఏవో కొన్ని వార్తలు మాత్రమే సామాన్య ప్రజలకు అందేవి. ప్రజాహిత కార్యకలాపాల నిర్వహణకు, శత్రువుల దాడుల నెదుర్కొనేందుకు ప్రభువులు గుప్తచారుల నివేదికలపైననే ముఖ్యంగా ఆధారపడి ఉండేవారు.[2]

ముద్రణ కళావికాసం, తంతి-తపాలా సౌకర్యం, అత్యాధునిక ప్రయాణ సాధనాలు, పరిణతి చెందిన సాంకేతిక విజ్ఞానం నేడు శీఘ్రగతిన వార్తా ప్రసారానికి దోహద పడుతున్నాయి. సమాచార సేకరణ, ప్రచురణ, రవాణాలు రాకెట్ వేగంతో సాగుతున్నాయి. సుశిక్షితులైన ఎందరో కార్యకర్తలు తమ సేవలతో పత్రికా రంగాన్ని సుసంపన్నం చేస్తున్నారు.

వార్తా పత్రికలు మామూలుగా ప్రతి పేజీలోనూ వార్తలతో, విశేషాలతో, వ్యాసాలతో నిండి ఉండి ప్రపంచపు పోకడలను, సమాచారాన్ని, ఆలోచనలను అందిస్తాయి. అయితే ఒక్క పేజీని మాత్రం (కొన్ని పత్రికలు ఒక్క 'కాలమ్'నే) తమ స్వంత భావాలను, అభిప్రాయాలను అభివ్యక్తీకరించడానికి భద్రపరచుకుంటాయి. ఆ పేజీ లేక పేజీలో కొంత భాగమే 'సంపాదకీయం'. వార్తల నాధారం చేసికొని వార్తా పత్రికలు తమ వ్యాఖ్యానాన్ని అభిప్రాయాన్ని అక్కడ ప్రకటిస్తాయి. తొలినాళ్ళలో పత్రికలలో ప్రత్యేకంగా సంపాదకీయాలు వ్రాసే అలవాటు కన్పించదు. ఆ రోజులలో వార్తలను అభిప్రాయా

లను కలగలిపి ప్రకటించేవారు. **Noah Webster** అనే పాశ్చాత్య పాత్రికే నికే ప్రథమంగా పత్రికలో సంపాదకీయాన్ని వెలువరించిన ఘనత దక్కింది.[3]

'వార్త' అన్నమాటకు వృత్తాంతం, సమాచారం, నడవడి, జీవనో పాయం, అర్థానర్థాల్ని తెలిపే ఒక శాస్త్రం అనే అర్థాలున్నాయి. మహాభారతం లోని 'వార్తయందు జగము వర్తిల్లుచుండును'[4] అన్న సూక్తి నేటి వార్త సమగ్ర స్వరూపానికి దర్పణం పడుతున్నది.

"పుత్తడి గలవాని పృష్టంబు పుండైతే
వసుధలోన చాల 'వార్త' కెక్కు
పేదవాని యింట పెండ్లైన నెరుగరు...."

అన్న వేమన్న మాటలో వార్త వైశిష్ట్యం వ్యంగ్యంగా భాసిస్తుంది.

మొత్తంమీద 'వార్త' అంటే సంఘటన లేక సన్నివేశ యధార్థస్థితిని ఎరుగని వారికి ప్రకటించడం అనుకోవచ్చు. వార్తకు వ్యాపనము (ప్రసరణ గుణం) ముఖ్య లక్షణంగా ఉంటుంది. ఆ వార్తయొక్క వివరణాత్మక లేదా విశ్లేషణాత్మక రూపం 'వ్యాఖ్య' అవుతుంది. వార్తపైన (సన్నివేశం లేదా సంఘటన లేదా యధార్థ స్థితిపైన) వ్యాఖ్యాన ప్రాయమైన, సమీక్షా ప్రాయ మైన లేక సమస్యా పరిష్కార ప్రాయమైన లేదా సందేశరూపకమైన ప్రతిభా వంతమైన వివరణయే 'సంపాదకీయం'. సంపాదకీయం ద్వారా పాఠకులను/ సామాజికులను జాగరితం చేసి నూత్న దృక్కోణాన్ని అందించడమే సంపాద కీయ నైతిక కర్తవ్యం.

ఒక పత్రికలో ప్రచురితమయ్యే అనేక శీర్షికలకు, వ్యాసాలకు, వార్త లకు చట్టరీత్యా సంపాదకుడే బాధ్యుడు. అందుకే **1867** లో వెలువడిన Press and Regestration of books act సంపాదకుడంటే 'పత్రికలో ప్రచురితమయ్యే సమాచారం ఎంపికను నియంత్రణ చేసే వ్యక్తి' అని నిర్వచిస్తుంది.[5]

సంపాదకుడు, సంపాదకీయం పదాల రూపాలను నైఘంటికార్థాలను పరిశీలిస్తే ఈ విషయాలు మరింత స్పష్టమౌతాయి.

ఈ పదాలకు

"సంపద్యతే అనేన ఇతి సంపాదకః", లేదా
"సంపాదయతి ఇతి అసౌ సంపాదకః"
'సంపాదకస్య ఇదం సంపాదకీయం'

అని వ్యుత్పత్తిని చెప్పుకోవచ్చు.

ఆంగ్లంలోని 'ఎడిటర్' అన్న పదానికి తెలుగులో 'సంపాదకుడు' అనే మాటను సమానార్థకంగా వాడుతున్నాము. Edere (ఎడరే) అన్న లాటిన్ భాషా పదాన్ననుసరించి ఆంగ్లంలో Editor అన్న పదం ఉద్భవించి ఉండవచ్చునని కొందరు భావిస్తున్నారు.[6]

తెలుగు నిఘంటువులు కొన్ని 'సంపాదకుడు' అనే పదానికి కేవలం ధనార్జనాపరుడు (Collecter), సమకూర్చువాడు (గడించువాడు) అనే అర్థాలు మాత్రమే ఇస్తున్నాయి. ఇతరానేక ప్రక్రియల వలెనే పత్రికల ప్రచురణ కూడా ఆంగ్ల భాషా ప్రభావంవల్ల మనకు సంక్రమించినందువల్ల, ఇతఃపూర్వం మన భాషలో పత్రికలు లేనందువల్ల సంపాదకుడనే మాటకు నిఘంటువులలో ఈ పరిమితార్థమే గోచరిస్తుంది. మొదట్లో మన పత్రికలలో సంపాదకీయాల ప్రాథమిక రూపాలు స్వవిషయం, స్వవిజ్ఞాపనం, స్వాభిప్రాయం, విన్నపం అన్న పేర్లతో కనిపిస్తున్నాయి. తర్వాత కాలంలో అవి 'ఎడిటోరియా' అన్న పేరుతో పిలువబడేవి. తొలి తెలుగు పత్రికలలో 'ఎడీటరు' - 'ఎడిటరు' పదాలే ఎక్కువగా వాడేవారు. తెలుగులో ఆంధ్రపత్రిక సంపాదకుడు, సంపాదకీయం అన్న పదాలను పదే పదే ప్రచురిస్తూ వాటికి బహుళ వ్యాప్తిని కలిగించింది.

కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు తొలిసారిగా 'సంపాదకుడు' అన్న పదం వాడి ఉండవచ్చునని ఆంధ్రప్రభ పత్రికా సంపాదకులు పొత్తూరి వెంకటేశ్వరరావుగారు భావిస్తున్నారు.[7]

Editor — సంపాదకుడు అన్న పదానికి కొన్ని ఆంధ్రాంగ్ల ప్రసిద్ధ నిఘంటువులు ఇచ్చిన అర్థాలు ఇలా ఉన్నాయి:

1. ఆంధ్ర శబ్ద రత్నాకరము; చలమచర్ల రంగాచార్యులు త్రు.సం.
సంపాదకుడు – పత్రికాధిపతి.
1. గడించువాడు 2. సమకూర్చువాడు.
(వ్యు. (సమ్ + పద) (ణిచ్) + ణ్వుల్ + అక) కృ.ప్ర.

2. శబ్ద రత్నాకరం; బహుజనపల్లి సీతారామాచార్యులు.
సంపాదకుడు – పత్రికాధిపతి.

3. సూర్యరాయాంధ్ర నిఘంటువు
సంపాదకుడు – 1. నెఱవేర్చువాడు 2. గడించువాడు.

4. శబ్దార్థ దీపిక; విద్వాన్ ముసునూరి వేంకటశాస్త్రి.
సంపాదకుడు – 1. గడించువాడు 2. ఆర్జకుడు.
–గ్రంథాదులను ముద్రించి ప్రకటించువాడు.

5. C. P. Brown : English-Telugu Dictionary
Editor - He that revises or prepares any work for Publication.

1. అచ్చువేయడానికి గ్రంథమును సవరించి ఇచ్చేవాడు. ఉదా॥ పెద్దిభొట్లు మాఘ మనే కావ్యమును దిద్ది పరిశుద్ధము చేసి టీక వ్రాసినాడు.
2. టాడ్డు (Todd) అనే వాడు జాన్‌సన్ డిక్షినరీని (Johnson's Dictionary) సవరించి యింకా కొన్ని శబ్దములను చేర్చి అచ్చు వేయించినాడు
3. ప్రసిద్ధ పత్రికను సవరించి యిచ్చే వాడికిన్ని (Editor) రూకలు పెట్టి కాగితము వేయించేవాడికిన్నీ (Owner) వివాదము జరిగినది.
4. జ్ఞానోదయ మనే సమాచార పత్రిక సవరించి కుదిర్చి అచ్చుకు యిచ్చే వాడు.

6. English-Telugu Dictionary : గిడుగు సీతాపతి, Dr. చిలుకూరి నారాయణరావు, వేదం లక్ష్మీనారాయణ శాస్త్రి Editor-అచ్చు వేయుటకు గ్రంథమును సవరించి ఇచ్చువాడు - గ్రంథ ప్రకాశకుడు - గ్రంథ శోధకుడు. వార్తాపత్రికాధిపతి One who edits a work or a newespaper - సంపాదకుడు.

7. The Oxford English Dictionary Vol. III. Editor: one who edits (edit to publish, give to the world).

1. The publisher of the book.
2. One who prepares the literary work of another person, or number of persons for publication, by selecting, revising and arranging the material also one who prepares an edition of any literary work.
3. One who conducts a newspaper or periodical publication.

8. The Encyclopaedic Dictionary (Sp. edition): Cassell and Company Ltd.

Editor : (Lat, from editus, P.a. Par of edo = to give out, to publish) One who edits; one who superintends or revises any book for publication; one who conducts or manages a periodical, newspaper or a magazine for publication.

సంపాదకీయం - Editorial అన్న పదానికి నైఘంటుకార్థాలను పరిశీలిస్తే -

1. C.P. Brown. English - Telugu Dictionary :

Editorial : గ్రంథమును సవరించి ఇచ్చేవాని సంబంధమైన.

2. English - Telugu Dictionary : గిడుగు సీతాపతి, డా॥ చిలుకూరు నారాయణరావు, వేదం లక్ష్మీనారాయణశాస్త్రి.

Editorial : A leading article in a periodical. వర్తమాన పత్రిక యందలి ముఖ్య గ్రంథము, వ్యాసము, సంపాదకీయము, పత్రికాధిపతి వ్రాయునది.

3. The Oxford Dictionary :

Editorial : (1) of or pertaining to an editor proper to or characteristic of an editor. (2) A newspaper article written by or under the responsibility of the editor, a 'Leader'.

4. The Encyclopaedic Dictionary :

cassell and company, Ltd.

Editorial : (A) of or pertaining to an editor written by or proceeding to an editor. (B) An article in a news-paper written by the editor; a Leading article.

హిందీలో సంపాదకీయాన్ని 'అగ్రలేఖ్' అనడానికి ఈ అర్థమే కారణం కావచ్చు.

Edit, Editor/Editress, Edition, Editorial, Editor-ship — ఈ పదాలన్నీ ఒక్క కుదుట పుట్టినవే. పై పదాల అర్థాలను పరిశీలించిన మీదట 'edit' అంటే విషయాన్ని క్రమపద్ధతిలో అమర్చి అచ్చుకు సిద్ధం చేయడంగా భావించవచ్చు.

సాహిత్యేతరమైన ఎడిటింగ్ సినిమారంగంలోనూ ఉంది. One who collects literary or artistic material and sets in a sequence before publication as per his taste as he thinks to be worth captivating is called editing.

ఎడిటర్ - తన అభిరుచి ననుసరించి ప్రజానురంజకత్వం ఎట్లు సాధ్య పడుతుందో ఆలోచించి ఎన్నుకొన్న విషయాన్ని, వార్తను లేదా కళాఖండాన్ని ముద్రించే ముందు క్రమపద్ధతిలో అమరించేవాడు.

సంపాదక శబ్దంలో ఈ Sequence (క్రమపద్ధతిలో అమర్చడం) అనే అర్థం లేదు. Editor శబ్దంలో ఆ అర్థం స్ఫురిస్తుంది. కానీ ప్రస్తుతం జన బాహుళ్యంలో సంపాదకుడన్న పదమే వ్యాప్తిలో ఉంది. పైగా రూఢ్యర్థంలోనూ ఈ పదమే సరిపోతుంది.

ఎడిటర్, సంపాదకుడు పదాలు సమానార్థకాలా కావా? అనే అనుమానం పెట్టుకోకుండా చాలామంది ఈ రెండు పదాల్ని జమిలిగా వాడుతున్నారు. కనుక ఈ మీమాంస ఇక అనవసరం.

వార్తాపత్రికలోని Leading article సంపాదకీయం. పాత్రికేయ పరిభాషలో దీన్ని 'Leader' అని పిలుస్తారు. పత్రికలోని ఇతర వార్తలకు, వ్యాసాలకు నాయకత్వం వహిస్తుంది కనుక పత్రికకు సంపాదకీయాన్ని ప్రాణంగా కొందరు భావిస్తే, పత్రికా సౌందర్యానికి నుదుటితిలకంగా మరి కొందరు భావించారు. తొలి రోజుల్లోని పత్రికలలో సంపాదకీయాలే కరువైతే ఈ రోజుల్లో సంపాదకీయాలులేని పత్రికలే లేవు.

దినపత్రికలు, వారపత్రికలు, పక్షపత్రికలు, మాసపత్రికలు మొదలైన కాలవ్యవధిని అనుసరించి వెలువడే పత్రికలు, వార్తా పత్రికలు, సినిమా పత్రికలు, రాజకీయ పత్రికలు, సెక్స్ పత్రికలు, బాలల పత్రికలు, మహిళల పత్రికలు, ప్రభుత్వ సమాచార శాఖ పక్షాన వెలువడే పత్రికలు, విజ్ఞాన శాస్త్ర పత్రికలు, క్రీడా పత్రికలు మొదలైన వివిధ రంగాలకు సంబంధించిన పత్రికలు సైతం తప్పనిసరిగా తమ అభిప్రాయ ప్రకటన కోసం సంపాదకీయాలు వెలువరిస్తుంటాయి. సాంఘిక రాజకీయ ఆర్థిక కళా సాహిత్య న్యాయ విద్యా వైద్య వైజ్ఞానిక వ్యావసాయిక అంశాలేవైనాసరే సంపాదకీయాలుగా రూపొంద వచ్చు. సంపాదకుని హృదయ స్పందన ఫలితంగా, తమ పత్రిక ఆలోచనా ధోరణికి నిదర్శనంగా సంపాదకీయం భాసిస్తుంది.

ప్రతి పత్రిక ఒక పంథాను (Policy) కలిగి ఉంటుంది. ప్రతి సంపాదకీయంలో ఆ పత్రికోద్దేశం తప్పనిసరిగా ప్రతిఫలిస్తుంది. "ఇతర పేజీలన్నీ వార్తలతోనో ఇతరులు వ్రాసిన వ్యాసాలతోనో నిండి ఉంటాయి. కనుక పత్రిక తన ప్రత్యేక వ్యక్తిత్వ నిరూపణకోసం తనదంటూ ఒక బలమైన అభి

ప్రాయాన్ని పఠితృలోకానికి అందించి తీరాలి. లేకపోతే దాని వ్యక్తిత్వానికే కాదు. అస్తిత్వానికే స్థిరత్వం ఉండదు. అందుకే పత్రికలకు సంపాదకీయాలు ఎంతో అవసరం."[8]

సంపాదకీయం పాఠకులకు కరదీపిక లాగా ఉండాలి. "క్లిష్టమైన సాంఘిక, ఆర్థిక, రాజకీయాది విషయాలను ఏ దృక్కోణంతో చూడాలో ప్రజలకు చూపెట్టి తద్వారా వారిని చైతన్యవంతులను చేయడం సంపాదకీయం పరమోద్దేశ్యం."[9]

"అల్పాక్షర న్యాయంలో అనల్పార్థమైన ప్రయోజనాన్ని సాధించి పెట్టేది సంపాదకీయం. ఏరోజు వార్తపైన ఆ రోజే అప్పటికప్పుడే సాధికారికంగా సంపాదకుడు తన వ్యాఖ్యను విధిగా అందించి వెంటనే వెలువరించాలి. క్లుప్తంగానే కాకుండా అందంగా, సూటిగానే కాకుండా నవరసభరితంగా ఆ క్షణంలో అప్పటికప్పుడే ఆనాటి ఘటనలపై తన పాఠక లోకాన్ని కదిలించే రచనే సంపాదకీయం"[10]

సంపాదకీయం పత్రికలోని ఇతర వ్యాసాలకు వార్తలకు వ్యాఖ్యలకు నాయకత్వం వహిస్తుంది కనుక పత్రికలోని ఇతర పేజీలకు, సంపాదకీయానికీ సన్నిహిత సంబంధం ఉంటుంది. అయితే ఇతర పుటలలోని విషయాలు సంపాదకీయాభిప్రాయాన్ని తెగనాడేవిగాకానీ, సంఘర్షించేవిగా కానీ ఉండకూడదు.

సంపాదకీయం విషయ ప్రాధాన్యంతో, వివరణాత్మకంగా, ప్రబోధాత్మకంగా, సమస్యా పరిష్కార రూపంగా హృదయానికి హత్తుకుపోయే రీతిగా వ్రాయడం ఒక కళ. గంభీరంగా ఉండే వార్తల మధ్య విషయ వివేచనతో, తార్కికంగా, యుక్తిసహంగా, కించిత్ హాస్యభరితంగా సాగే చతుర రచన సంపాదకీయమైతే పాఠకుడు సంపూర్ణంగా తృప్తిని పొందుతాడు. వార్తలోని వాస్తవికతను సంపాదకుడు తన సునిశిత మేధతో పరిశీలించి, నిర్మమత్వంతో అన్వేషించి పాఠకునికి సత్య సందర్శనం కలిగించగలిగితేనే సంపాదకీయానికి సార్థకత చేకూరుతుంది.

కొందరు ప్రఖ్యాత పాశ్చాత్య పాత్రికేయులు సంపాదకీయాన్ని గూర్చి వెలువరించిన అభిప్రాయాలు ఇలా ఉన్నాయి:

1. William Allen White, editor and publisher of the Emporia (kan) Gazette, "...........generally speaking, an editorial is an expression of opinion, based upon a selection of facts which present a truth in a new light-something that everyone knows which none before ever thought of !"

2. Leon Flint 'The editorial' Author (U.S.A.), "The editorial The published expression of the opinions of an editor is one of the many mediums through which men have satisfied their instinct to spread ideas. Storm centers of thought furnish its natural habitat."

3. M. Lyle Spencer, the author of 'Editorial Writing', "An editorial may be defined as a presentation of facts and opinion in concise, logical, pleasing order for the sake of entertaining, of influencing opinion or of interpreting significant news in such a way that its importance is clear to the average reader."

సహజంగా వ్యాసానికి వర్తించే లక్షణాలన్నీ సంపాదకీయానికి అనువర్తిస్తాయి. కానీ సంపాదకీయం సామయిక వ్యాసం. సంపాదకుడు సమయజ్ఞుడు. సంపాదకీయం సిద్ధాన్నం లాంటిది. అందుకే నార్ల వెంకటేశ్వరరావు గారు సంపాదకీయాన్ని గూర్చి వ్రాస్తూ అప్పుడే వండి వార్చిన అన్నంతో సామ్యం చూపారు.[11] దీని కపవాదంగా సంపాదకీయం సామయిక రచన మాత్రమే కాకుండా సార్వకాలికమైన సత్యాలను వెల్లడించేదిగానూ ఉండవచ్చు. ప్రతిభావంతుడైన రచయిత చేతిలో సమకాలిక విషయాలు సైతం సార్వకాలికమైన సత్యాలుగా రూపుదిద్దుకోగలవు. ముట్నూరి కృష్ణారావు గారి సంపాదకీయాలు

ఈ విషయాన్ని ఋజువు చేయగలుగుతున్నాయి. కేవలం వార్తలు మాత్రమే సంపాదకీయాలుగా రూపొందవలసిన అవసరం లేదు. వార్తేతర విషయాలు సైతం సంపాదకీయాలుగా రూపుదిద్దుకోవచ్చు.

స్వరూప దృష్ట్యా వ్యాసానికివలెనే సంపాదకీయానికి మూడు ప్రధాన భాగాలుంటాయి. (శీర్షికను కలుపుకొని నాలుగు భాగాలని చెప్పవచ్చు). అవి ఉపోద్ఘాతం లేదా పరిచయం; విషయ వివేచనం; ముగింపు లేదా సమన్వయం. అయితే వ్యాసంలో మాదిరిగా వీటిని యథాక్రమంగా వాడుకోనవసరం లేదు. సమయానుకూలంగా, విషయాన్నిబట్టి సంపాదకీయ రచయితలు ఈ విభాగాలను మార్చుకోవచ్చు.

సంపాదకీయానికి 'శీర్షిక' అతి ముఖ్యమైన అంశం. సంపాదకీయంలో ప్రసక్తమయ్యే విషయసారాన్ని క్లుప్తంగా, సూటిగా ఒకటి రెండు మాటల్లో చెప్పగలిగే ఆకర్షణీయమైన శీర్షిక పాఠకుడిని తన వైపుకు త్రిప్పుకొంటుంది. శీర్షికను చూడగానే ఆ సంపాదకీయాన్ని చదవడమో మానడమో పాఠకుడు మనసులోనే బేరీజు వేసుకొని నిశ్చయించుకుంటాడు.

సంపాదకీయానికి ఎన్నుకున్న విషయాన్ని లేదా అంశాన్ని గురించిన పరిచయం పాఠకునికి అవసరం. అందుకే విషయాన్ని గురించిన ఒక అవగాహన కలిగించడానికి దానిని గూర్చి సంక్షిప్తంగా పరిచయం ఉంటుంది. లేకుంటే పాఠకుడు తరువాత సంపాదకుడు వెలువరించబోయే అభిప్రాయాలను స్వీకరించలేడు.

విషయ వివేచనలో విషయానికి సంబంధించిన అంశాల పూర్వాపరాలను సోపపత్తికంగా సమీక్షించి, సమాలోచించడం జరుగుతుంది. విషయచాలనంలో సంపాదకుని ప్రతిభ, లోకానుభవం, సమయస్ఫూర్తి ప్రకటితమౌతాయి.

పాఠకునికి విషయంలోని లోతుపాతులను గురించిన ఒక అవగాహన ఏర్పడ్డాక ఆ విషయంపై తన అభిప్రాయాన్నిగానీ, పరిష్కార మార్గాన్నిగానీ సూచించి, ఒక క్రొత్తదారి చూపించి సమన్వయించడం జరుగుతుంది.

సంపాదకీయాల కూర్పు కథాత్మకంగా కానీ, వివరణాత్మకంగాకానీ, విశ్లేషణాత్మకంగాకానీ ఉండవచ్చు. చర్చారూపంగానో, సంవాదరూపంగానో, తార్కికంగానో కూడా ఉండవచ్చు. సంపాదకీయాలలో విషయ ప్రకటన కొన్నిమార్లు ఉద్రేక పూరితంగా ఉంటే మరికొన్నిమార్లు ఆలోచనాత్మకంగా, వినయ పూర్వక విజ్ఞాపనగా ఉండవచ్చు. వ్యంగ్య పూర్వకమైన అధిక్షేపణగా ఉండటం కూడా కద్దు. హెచ్చరికలు, సందేశాలు, సంతాపాలు కూడా సంపాదకీయాల రూపం సంతరించుకోవచ్చు. సామాజిక, ఆర్థిక, రాజకీయ, కళా, సాహిత్య, వైజ్ఞానిక, వినోదాత్మక, వైయక్తిక అంశాలేవైనా సంపాదకీయాలుగా పత్రికలలో దర్శన మివ్వవచ్చు. ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ సమస్యలేవైనా సరే సంపాదకీయాలలో చర్చించవచ్చు.

సంపాదకీయాల్ని సంపాదకుడే వ్రాయాలనే నియమమేమీ లేదు. పత్రిక సమగ్రరూపకల్పన పత్రికా సంపాదకుని బాధ్యత. ఈ బాధ్యతలోనే సంపాదకీయ రచనా నిర్వహణలు ఇమిడి ఉన్నాయి. ముద్రాపకుడు, యజమాని, సంపాదకుడు - ఈ బాధ్యతలన్నీ ఒక్కరే నిర్వహిస్తున్న పత్రికలు ఎన్నో ఉన్నాయి. అలాగే యాజమాన్యంలో భాగస్వామ్యంలేక కేవలం పత్రికా సంపాదకులైనవారూ ఉన్నారు. అయితే పత్రికలో ప్రచురితమయ్యే అన్ని అంశాలకు నైతిక బాధ్యత వహించేది సంపాదకుడే. సంపాదకీయం పూర్తిగా సంపాదకునికే చెందినదైనప్పటికీ కొన్ని పత్రికలు 'లీడర్ రైటర్స్'ని ఏర్పాటు చేసుకొంటాయి. వివిధ రంగాలలో నిష్ణాతులైనవాళ్ళు ఆయా రంగాలకు సంబంధించిన అంశాలపై అవసరమైనప్పుడల్లా సంపాదకీయాలు వ్రాస్తుంటారు. వారు సంపాదకుని నేతృత్వంలో సంపాదకీయాలు వ్రాయవచ్చు లేదా పత్రికా సంపాదకుడే స్వయంగా సంపాదకీయాలు వ్రాసుకోవచ్చు. అయితే ఈ నవీన యుగంలో పత్రికా నిర్వాహకులు పత్రికలను సర్వసమగ్రంగా నడపడం కోసం విషయాలను విభజించుకొని తమ పత్రిక సిబ్బందిలోని నలుగురైదుగురికి సంపాదకీయాలు వ్రాసే బాధ్యత నప్పగిస్తున్నారు. ప్రధాన సంపాదకుడు 'సమన్వయకర్త'గా, సంపాదకీయ వర్గానికి అధిపతిగా వ్యవహరిస్తూ, పత్రికా వ్యవహారాలు చూచుకుంటూ, ఇతర వ్యాసాలకు, వార్తలకు బాధ్యుడుగా ఉంటాడు. అయితే నిర్మాణాత్మక క్రియాశీలం కలిగిన జర్నలిజంలో కనీసం ఎ.బి.సి.డి. లు తెలియని వాళ్ళు అధిపతులై, ప్రధాన సంపాదకులుగా వ్యవహరిస్తూ ఈ వ్యవస్థనే వ్యాపారాత్మకంగా మార్చివేస్తున్నారనే తీవ్ర విమర్శ కూడా ఉంది.

పత్రికా సంపాదకుని విధులు అత్యంత క్లిష్టమైనవి. అతడు నిర్వర్తించే కార్యక్రమాలు బాధ్యతాయుతమైనవి. ఒక వ్యక్తిగా కాక సమష్టి శక్తిగా పత్రికకు పూర్తి బాధ్యత వహిస్తూ పత్రికను సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దగలగాలి. సర్క్యులేషన్ పెంచుకోవటంలో పోటీని తట్టుకోగలగాలి.

పత్రికా సంపాదకుని ప్రధానమైన విధులు ఇవీ అని తేల్చి చెప్పలేకున్నా సత్య ప్రదర్శన, ప్రజాస్వామ్య పరిరక్షణ, పౌరుల నైతికపు విలువల సంరక్షణ వంటి సల్లక్షణాలకు సర్వధా తమ పత్రిక ఆలవాలంగా అలరారునట్లు చూచుకోవాలి. స్థిరమైన లక్ష్యం, విలక్షణమైన శైలి, భావ నివేదనలో స్పష్టత సంపాదకుని మనుగడకు సాధనాలు. దృఢదీక్ష, ధీరత్వం, స్వేచ్ఛా ప్రవృత్తి కలిగి ఉంటేనే ఈ రంగంలో సంపాదకుడు బాగా రాణించగలుగుతాడు.

సంపాదకుడు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పలువురి ఒత్తిడులకు గురికావలసివస్తుంది. అయినప్పటికీ ఎట్టి క్లిష్టపరిస్థితుల్లోనూ తన మనోనిశ్చయాన్ని కోల్పోక, తాను నమ్మిన సత్యాన్ని లోకానికి ప్రవచించగలిగే ధృతి కలిగి ఉండాలి.

సంపాదకునికి అనేక రంగాలతో పరిచయం అవసరం. వివిధ వ్యక్తులు సంస్థలతో సాన్నిహిత్యం, బహుగ్రంథ పఠనం, నిరంతర లేఖనంవల్ల వారికి కావలసిన పాండిత్యం సమకూరి, వారి మనోగత భావాలకు అక్షరదీప్తిని కలిగిస్తుంది.

సంపాదకునిపై ఉండే అనేక రకాల ఒత్తిడులను కొంతవరకు ఈ చిత్రం ప్రదర్శిస్తుంది:



పత్రికా యాజమాన్యం, సంపాదకుడు వేరువేరైతే సంపాదకుని బాధ్యత కత్తిమీది సాములాగా ఉంటుంది. విలేఖరులు తమ వార్తల ప్రచురణకు సంపాదకునిపై ప్రత్యక్షంగా, పరోక్షంగా ఒత్తిడి కలిగించవచ్చు. సంపాదక వర్గం నిర్ణయాలను సంపాదకీయ లేఖల ద్వారా ఇతరత్రా తమ అభిప్రాయాలను సంపాదకునికి నివేదిస్తారు. పాఠకుల అభిప్రాయాలను, అభిరుచులను గమనించకపోతే పత్రిక మనుగడకే ముప్పువాటిల్లక మానదు. పాఠకులకే మాత్రం అసంతృప్తి కలిగినా అమాంతంగా సర్క్యులేషన్ తగ్గిపోతుందన్నది కఠోర సత్యం. అటు ప్రభుత్వం, ఇటు యాజమాన్యం కొన్ని వార్తలపై విధినిషేధాలు కల్పిస్తూ నియంత్రించడానికి నిహూవేసి సిద్ధంగా ఉంటాయి. సభా హక్కుల తీర్మానాల ద్వారా, ఇతరత్రా వేధింపులకు గురైన పత్రికాధిపతులు, పాత్రికేయులు ఎందరో ఉన్నారు. తమ స్వేచ్ఛకు భంగం వాటిల్లినప్పుడు, తమ ఉనికికి అస్థిరత్వ మేర్పడినప్పుడు తాము నమ్మిన సిద్ధాంతాలకు ప్రతిఘాత మేర్పడి నప్పుడు లేదా యాజమాన్యం తమపట్ల విశ్వాసాన్ని కోల్పోయినప్పుడు ఎందరో సంపాదకులు తమ పత్రికల నుండి నిష్క్రమించిన సంఘటనలు చరిత్రలో కోకొల్లలు. కొంత కాలం క్రితం మన దేశంలో యావత్పత్రికా లోకం ఏకమై తమ స్వేచ్ఛకు తీవ్ర ప్రతిబంధకంగా పరిణమించేలా ప్రభుత్వం తలపెట్టిన పరువు నష్టం బిల్లును నిరసించి ఉద్యమ స్ఫూర్తితో ప్రతిఘటించి త్రిప్పికొట్టింది.

ఉత్తమ సంపాదకుడు తన పత్రికాధిపత్యాన్నైనా వదులుకుంటాడు కానీ తన స్వేచ్ఛకు భంగం వాటిల్లితే మాత్రం భరించలేడు.

నిజాయితీతో కూడిన పదునైన రచన, భాషలో లోతైన పాండిత్యం, విషయ వివేచనలో విజ్ఞత, అభివ్యక్తిలో స్పష్టత, వాడి, వేడి కలిగిన భావ తీవ్రత, నిర్భయత్వం, దేశభక్తి, ప్రజాహితైక ధ్యేయం లక్షణాలుగా కలిగిన సంపాదకుడు నిజంగా నాయకత్వ స్థానంలో నిలబడి పాఠకులకు మార్గదర్శకుడౌతాడు.[12]

## అధోజ్ఞాపికలు

1. విజ్ఞాన సర్వస్వము - మల్లంపల్లి సోమశేఖరశర్మ, 'ముద్రణము' 1961.
2. నేటి ప్రజాస్వామ్య వ్యవస్థలోనూ వార్తలపై నియంత్రణ తప్పడం లేదు. అటు ప్రభుత్వం ఇటు పత్రికా యాజమాన్యం నిరంతరం నిఘావేసి ఉంచి వార్తా ప్రకటనపై నియంత్రణాధికారాన్ని ప్రదర్శిస్తుండడం జగమెరిగిన సత్యం.
3. చూ. An Introduction to Journalism by F. Fraser Bond. Second Edition 1961 U.S.A. Page 212.
4. "వార్తయంద జగము వర్తిల్లుచున్నది
   యదియులేనినాఁడ యఖిల జనులు
   నంధకార మగ్ను లగుదురు గావున
   వార్త నిర్వహింప వలయుఁ బతికి"
   — మహాభారతం సభాపర్వము - ప్రథమాశ్వాసము 51 వ పద్యము.
5. జర్నలిజం, చరిత్ర - వ్యవస్థ, రాపోలు ఆనందభాస్కర్. ఉదయం ప్రచురణలు. పేజి నం. 36 (వ్యవస్థ).
6. చూ. ఎ. బి. కె. సంపాదకీయాలు. (లాటిన్ భాషలో edo = to give out, to Publish అనే అర్థాలున్నాయి. చూ. ఇదే వ్యాసంలో పేజి నం. 46).
7. పొత్తూరి వెంకటేశ్వరరావుగారితో ముఖాముఖి జరిపినప్పుడు. ఈ విషయాన్నే ఆలోచనాలహరిలోని "కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులు" వ్యాసం ధ్రువీకరిస్తుంది. చూ. పే. 65. "యువభారతి" ప్రచురణ.
8. ఎ.బి.కె. ప్రసాద్ గారితో ముఖాముఖి సందర్భంగా....
9. పొత్తూరి గారి వివరణ.
10. ఎ.బి.కె. గారు చెప్పిన దినపత్రిక సంపాదకీయ వివరణ.
11. చూ. మూడు దశాబ్దాలు పీఠిక.
12. చూ. అనుబంధం ఒకటి, రెండు—

N C E W మరియు అఖిల భారత వార్తా పత్రికల సంపాదకుల సదస్సులలో రూపొందించిన సంపాదకుల, సంపాదక రచయితల నియమ నిబంధనలను వెల్లడిస్తాయి.

# అధ్యాయం అయిదు

# ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయాలు

## పూర్వరంగం

సాహిత్యానికి సమాజానికి విడదీయరాని బంధం ఉంటుందన్న సంగతి ప్రపంచంలోని ఏ భాషా సాహిత్యాన్ని పరిశీలించినా తప్పక తెలుస్తుంది. వాల్మీకి రామాయణం పఠించినా, వర్డ్స్‌వర్త్ కవిత్వం విన్నా. భావవాదం వెల్లివిరిసినా, భౌతిక వాదం విజృంభించినా ప్రతి యుగంలోనూ సాహితీవేత్తలెందరో తమ సాహిత్యం ద్వారా సమాజాన్ని ప్రభావితం చేస్తూనే ఉన్నారు. సమాజంలోని సాంఘిక రుగ్మతల నిర్మూలనకు, శాస్త్ర కళా వైజ్ఞానికాది సమస్త విషయాలకు సాహిత్యాన్ని సాధనంగా చేసుకొని పురోగమించిన వారెందరో మనకు చరిత్రలో దర్శనమిస్తారు. "మానవ సమాజం - సాహిత్యం ఇవి రెండూ ఆధార ఆధేయ సంబంధంగల వ్యవస్థలు. మానవ సమాజం యొక్క నాగరకత సంస్కృతులకు ముఖ్యలక్షణం సాహిత్యం. ఈనాడు సాహిత్యం లేని నాగరక మానవ సమాజం లేదు. సాహిత్యం సమాజాన్నాశ్రయించి అనుగమించినా, కొన్ని ఘట్టాల్లో సాహిత్యమే సమాజం యొక్క పురోగతికి చోదకమౌతుంది."[1]

అనాదిగా వేదశాస్త్రాది సకల విజ్ఞానాలకు ఆలవాలమైన భరతఖండం మహమ్మదీయుల దండయాత్రలతో, ఆంగ్లేయుల దురాక్రమణతో పద్దెనిమిదవ శతాబ్ది నాటికే తన పురావైభవాన్ని కోల్పోయింది. 18వ శతాబ్ది వరకే ప్రాచీన విద్యాపీఠాలు క్రమశః నశించిపోయి ఆంగ్లవిద్యా నాగరకతల పట్ల దేశీయులలో ఒకవిధమైన అభిమానం పెరుగసాగింది. సంస్కృతం స్థానే ఆంగ్లభాష వ్యాపించసాగింది. మెకాలే ప్రవేశపెట్టిన ఆంగ్ల విద్యా పథకం దేశమంతటా అపూర్వ సంచలనాన్ని సృష్టించింది. క్రైస్తవ మత ప్రచారం,

గుమాస్తాల తయారీ ముఖ్యధ్యేయాలుగా ప్రవేశ పెట్టబడిన ఆంగ్ల విద్యావిధానం దేశీయులలో నూత్న సంస్కారాన్ని కలిగించడమే కాకుండా వారిలో జాతీయత, స్వాభిమానం, స్వదేశోద్ధరణ వంటి సంస్కార భావాలను పెంపొందించుటకు కూడా దోహదపడింది. "రామమోహనరాయల ఉద్యమము ఫలితముగా దేశీయులలో అపూర్వ చైతన్యము రేకులు విప్పినది. ఆంగ్లవిద్యా సముపార్జన ఫలితముగా భారతీయులలో ఛాందసదృష్టి తొలగి సరికొ్రొత్త దృక్పథము జనించినది. ఇంగ్లీషు చదువుకొన్న ప్రాచ్యభాషా పండితులు (Orientalists) వినూత్న దృక్పథముతో సాహిత్యాధ్యయనము చేయసాగిరి. విస్మృతి గర్భములో విలీనమైయున్న జాతిరత్నములను (Classics) పునరుద్ధరించి ప్రచురింప దొడగిరి. ప్రాచీన సంస్కృత గ్రంథములను సహేతుక దృష్టితో పరిశీలింప సాగిరి. మిషనరీలు తమ మతగ్రంథ ప్రచురణము కొరకు ముద్రణాలయములను నెలకొల్ప దొడగిరి. వీరి కృషి కూడా భారతదేశంలో విద్యావ్యాప్తికి అక్షరాస్యతా విస్తృతికి దోహదకారి యైనది."[2]

1857 నాటికే బొంబాయి, కలకత్తా, మద్రాసు నగరాలలో విశ్వవిద్యాలయాలు స్థాపించబడి పాశ్చాత్య భాషా విజ్ఞానాల అధ్యయనానికి సౌలభ్యమేర్పడింది. ఉద్యోగరీత్యా భారతదేశానికి వచ్చి ఉత్సాహంతో భారతీయ భాషల నధ్యయనం చేసిన పాశ్చాత్య పండితుల ప్రభావంతో దేశ భాషలలో అపూర్వ గ్రంథాలు, పత్రికలు, నిఘంటువులు వెలిసాయి. మన దేశభాషల నధ్యయనం చేసి వాటి ఔన్నత్యం గ్రహించిన పాశ్చాత్య విద్వాంసులు భారతీయ భాషలకు చేసిన సేవలు చిరస్మరణీయాలు. ఆంగ్ల భాషాధ్యయన ప్రభావంతో కందుకూరి వీరేశలింగం పంతులుగారి వంటి సంఘ సంస్కర్తల, సాహితీవేత్తల పూనికవల్ల ఆంధ్రభాషలో ఆధునికయుగం ఆరంభమయింది. నూతన సాహిత్య ప్రక్రియా సృష్టికి, సాంఘిక దురాచార నిర్మూలనకు, ఆంధ్ర జాతీయతా ప్రచారానికి వీరేశలింగంగారే ఆద్యులయ్యారు.

తెలుగునాట అప్పటికే ఎన్నో పత్రికలు వ్యాప్తిలో ఉన్నా వీరేశలింగం గారి 'వివేకవర్ధని' ఆవిర్భావం ఆంధ్ర సాహిత్యరంగంలో విలక్షమైన సంచలనాన్ని సృష్టించింది. ప్రజలను అజ్ఞానాంధకారం నుండి విముక్తులను చేస్తూ వారిని విజ్ఞాన పథంలో పయనింపజేయడం, లంచగొండితనం, అవినీతి మొద

లైన దురాచారాల నిర్మూలనం, స్త్రీ విద్య, వితంతు పునర్వివాహాల ప్రోత్సాహం వంటి సాంఘిక సమస్యల పరిష్కారానికి తమ జీవితాన్ని అంకితం చేసిన సుసంస్కారి వీరేశలింగం పంతులుగారు. ఆయన భాషాభివృద్ధిద్వారా దేశాభి వృద్ధిని సాధించేందుకు తమ పత్రికను ఎంతగానో వినియోగించుకున్నారు.

తొలినాట వెలసిన తెలుగు పత్రికలలో చాలా వరకు భాషా సంబంధ మైన వివాదాలను పరిష్కరించడానికో, మత ప్రచారానికో, అముద్రిత గ్రంథ ప్రచురణకో, పాఠ పరిష్కరణలకో ఉద్దిష్టమైనవే ఎక్కువగా కనిపిస్తున్నాయి. క్రైస్తవ మిషనరీల ప్రభావంతో తొలిదశలో పత్రికలు వెలసినా కొలది దినాలలోనే చాలా పత్రికలు భారతీయ భాషా సంస్కృతుల ప్రచారానికి వేది కలుగా నిలిచాయి. వివేకవర్ధని (1874) కి ముందు వెనుక నున్న పత్రికల పేర్లను బట్టే వాటి లక్షణాలను, ఆశయాలను కొంతవరకు ఊహించే అవకాశ ముంది. తొలి తెలుగు పత్రికగా పలువురిచే భావింపబడుతున్న 'సత్యదూత' (1835) క్రైస్తవ మత ప్రచారానికి బళ్ళారి నుండి వెలువడింది. 'వృత్తాంతి' 1838 లో మండిగల వెంకట రామశాస్త్రి గారి సంపాదకత్వంలో వెలువడింది. సయ్యద్ రహమతుల్లా అనే మహమ్మదీయుడు 1842 జనవరి 8 వ తేదీన 'వర్తమాన తరంగిణి'ని వ్యవస్థాపించాడు. ఆంగ్లోద్యోగుల అవినీతి, మతం మార్పిడులకు వారవలంబించే విధానాలు మొదలైన విషయాలకు ఈ పత్రిక ప్రాధాన్యమిచ్చేది. ఇంకా 'హితవాది' (1848-67), 'దిన వర్తమాని' (1856 - ఇది వారపత్రిక), 'రవి' (1910), 'వివేకవతి' మొదలైన పత్రికలు క్రైస్తవ మత ప్రచారార్థం వెలసినవి కాగా 'శ్రీ ధర్మరక్షిణి' (1891), 'సన్మతదర్శిని' (1891), 'ఈశ్వరవాది' (1873-76, 1924-32), 'స్వధర్మప్రకాశిని', 'ముముక్షు జనరంజని' (1898), 'ఆర్యమత బోధిని' (1905) మొదలైన పత్రికలు సనాతన భారతీయ ధర్మాన్ని ప్రకటించేవి. 1885లో పూండ్ల రామకృష్ణయ్యగారి 'అముద్రిత గ్రంథ చింతామణి' ఆంధ్రభాషకు చేసిన సేవ గణనీయమైనది. గ్రంథ విమర్శనకు, అముద్రిత గ్రంథ ప్రచురణకు ఈ పత్రిక పూనుకొన్నది. వీరేశలింగం పంతులుగారి 'వివేకవర్ధని' అందించిన చేయూతతో సంఘసంస్కరణాభిలాషులైన ఎందరో సాహితీవేత్తలు పత్రికలద్వారా సంస్కరణరంగంలో పురోగమించారు. 'పురుషార్థ ప్రదాయిని' (శ్రీరంగనాయకులు), 'హిందూజన సంస్కారిణి' (మన్నవ బుచ్చయ్య),

'సత్య సంవర్థిని' (ప్రార్థనాసమాజం), 'హితబోధిని' (శ్రీనివాసశర్మ), 'సమదర్శిని' (పింజల సుబ్రహ్మణ్యసెట్టి) మొదలైనవి ఇందు కుదాహరణంగా పేర్కొనవచ్చు.

పత్రికా ప్రచురణలో కొక్కొండ వెంకటరత్నంగారికి, వీరేశలింగం పంతులుగారికి మధ్యన సాగిన పోటీ స్పర్ధలవల్ల తెలుగుభాషకు ఎంతో మేలు జరిగిందని విమర్శకుల అభిప్రాయం. 'ఆంధ్రభాషా సంజీవని' (1871), 'హాస్యవర్ధిని' (1875) కొక్కొండ వారి నేతృత్వంలో వెలసిన పత్రికలు కాగా వీటికి ప్రతిగా 'వివేక వర్ధని' (1874), 'హాస్య సంజీవని' (1876) పత్రికలు కందుకూరి వారి నేతృత్వంలో వెలువడ్డాయి.

తెలుగు భాషా వ్యాప్తికీ, విమర్శనకు పుంఖానుపుంఖాలుగా పత్రికలు వెలువడినా జాతీయోద్యమ కాలంలో ఉద్యమ స్ఫూర్తితో ప్రజలను ముందుకు నడిపిన పత్రికలు ఎన్నో ఉన్నాయి. వాటిలో 'కృష్ణా పత్రిక' (1902 – కొండా వెంకటప్పయ్య, దాసు నారాయణరావు గారలు), 'ఆంధ్ర పత్రిక' (1908 – కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు), 'స్వరాజ్య' (1907 – గాడిచర్ల హరిసర్వోత్తమరావు ప్రభృతులు), 'మనోరమ' (1906 – చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారు), 'దేశాభిమాని' (1896 – దేవగుప్తం శేషాచలపతి గారు), 'నవయుగ' (1907 – చిల్లరిగె శ్రీనివాసరావు గారు), 'ఆంధ్రకేసరి' (1907 – చిలుకూరి వీరభద్రరావు గారు), 'కాంగ్రెసు' (1922 - మద్దూరి అన్నపూర్ణయ్య గారు) మొదలైన పత్రికలు సాంఘిక, రాజకీయ, సంస్కరణ పరమైన విషయాలకు విశేష ప్రాముఖ్యాన్నిచ్చాయి.[3]

జాతీయోద్యమ కాలంలో పత్రికల ఏకైక ధ్యేయం స్వాతంత్ర్య సంపాదనం. దేశమాత దాస్య విమోచనం కోసం ఉద్యమించిన నాటి పత్రికలు ప్రజలలో జాతీయాభిమానాన్ని రేకెత్తించడమే కాక వారికి సాంఘిక, నైతిక, రాజకీయ, సాహిత్య, వైజ్ఞానికాది విషయాలను సరళతరం చేసి అందించ గలిగినవి. ఆంగ్లేయుల పరిపాలనలో పత్రికలు ప్రజల పక్షం వహించి ప్రభుత్వ దురాగతాలను ఎప్పటికప్పుడు విమర్శిస్తూ జాతీయోద్యమాన్ని బల పరిచేవి. ప్రభుపాలన అంతరించి ప్రజాపాలన వెలుగుచూసే సంధియుగంలో

నాటి పత్రికల పాత్ర ఎట్టిదో తెలుసుకోవడానికి 'కృష్ణాపత్రిక' ఎంతగానో ఉపకరిస్తుంది. సహజ ప్రతిభావంతుడు, స్వయంభావుకుడైన ముట్నూరి కృష్ణారావుగారి నేతృత్వంలో కృష్ణాపత్రిక జాతీయ వారపత్రికగా ఆంగ్లేయుల పాలనను అపహాస్యం పాలుచేస్తూ ప్రజలను చైతన్యవంతులను చేసింది. ప్రజా జీవితంలో పత్రికల స్థానాన్ని వాటి ఆవశ్యకతను గూర్చి కృష్ణారావుగారు ఒక చోట ఈ విధంగా పేర్కొన్నారు. "....ప్రజలను నిద్రపోనియ్యవు. సంఘములను మరుగుకానియ్యవు. లోపములను వెల్లడిపరచును. జనవాక్యము నేకోన్ముఖము సేయును. భౌతిక ప్రపంచమున రైళ్ళు, టెలిగ్రాఫులు ఏమి చేయుచున్నవో, పత్రికలు మానసిక ప్రపంచమున ఆ కార్యమునే నిర్వహించుచున్నవి. లోకమునంతను ఒక్కమారుగ బహిరంగపరచి దేశకాలములను బంధించివైచుచున్నవి. నదులెట్లు కొండలలో బుట్టు ఊటలనేకము చేసి పల్లపు భూములు నింపునో అట్లే పత్రికలు మేధావంతుల తలలలో బుట్టు తలంపులను క్రోడీకరించి జనసామాన్యము యొక్క సంకీర్ణ హృదయములపై వెదజల్లును. పత్రికలు, ప్రజలు తమ స్వత్వ రక్షణమునకై కల్పించుకొనిన వజ్రాయుధములు వానిముందు ప్రభుత్వములు, మతములు, పూర్వాచార దుర్గములు, నిరంకుశత్వములు - సర్వము గడగడలాడక తప్పదు. ప్రజయొక్క మేఘగంభీర ఘోష పత్రికా ద్వారమున బ్రతిధ్వనించి భావికాల గర్భమునుండి ప్రసవించుచున్న ప్రజాస్వామికమునకు స్వాగతమొసగు చుండును. పత్రికల శక్తి యమోఘము, అప్రతిహతము."[4]

కృష్ణాపత్రికలో కృష్ణారావుగారు ప్రచురించిన సంపాదకీయాలు ఆయన ఆలోచనాధోరణికి, తార్కికపటిమకు నిదర్శనాలు. తాత్త్వికుడైన మేధావి, అభిరుచికల్గిన రచయిత, దార్శనికుడు అయిన కృష్ణారావుగారు తమ సంపాదకీయాల ద్వారా ఎందరినో ప్రభావితులను చేశారు. కృష్ణారావుగారి సంపాదకీయాలను గురించి ఆయన సమకాలికుడు, అంతేవాసియైన రావూరి వెంకట సత్యనారాయణరావుగారు "కృష్ణారావుగారు కలాన్ని కత్తిగా మార్చుకొని రచనలు సాగించారు. కొన్ని సంపాదకీయాలను రక్తచిత్రాలుగా పోల్చారు పాఠకులు. కొన్నిటిని శంఖారావాలన్నారు. మరికొన్నిటిని రసతరంగిణులన్నారు. కొన్నిటిని సాహిత్య సందేశాలన్నారు. కొన్నిటిని అపూర్వ విమర్శా

పత్రాలన్నారు. కొన్నిటిని అత్యుత్తమమైన రాజకీయ రసాంకాలన్నారు. మరి కొన్నిటిని వసంతారామ పులకిత పరభృత గానాలన్నారు. కొన్నిటిని తేనెవాక లనీ, కొన్నిటిని మినువాక గలగలలనీ వర్ణించారు.

ఇన్నిటికీ మూలాధారం......పరిపూర్ణమైన, ప్రజ్ఞాయుతమైన, ప్రతిభా న్వితమైన కృష్ణారావుగారి హృదయస్పందన. అవి సంపాదకీయములు కావు. సందర్భోచిత, భావనాపూరిత, కళావైదగ్ధ్య ప్రమాణములు....పరిణామములు"5 అని వ్యాఖ్యానించారు.

సాధారణంగా వార్తాపత్రికల సంపాదకీయాలు సమకాలిక సంఘటనల పట్ల, సమస్యల పట్ల ప్రతిస్పందిస్తూ సద్యస్స్ఫూర్తిని ప్రదర్శిస్తుంటాయి. కృష్ణా రావుగారి సంపాదకీయాలలో స్పందనను మించిన దార్శనికత, సార్వజనీనత, ప్రతిభావంతమైన పరిష్కారం లేదా ప్రబోధం కనిపిస్తాయి. సంపాదకీయ రచనకు తామెన్నుకున్న అంశం చిన్నదైనా పెద్దదైనా, సమకాలికమైనదైనా శాశ్వతమైనదైనా విషయంలోని లోతుపాతులను తరచిచూడనిదే రచన కుద్య మించని తత్త్వం ఆయనది. అందుకే ఆయన వెలువరించిన ప్రతి సంపాద కీయం విలక్షణ లక్షితమై రచనా విషయకంగానో, భావ స్ఫురణలోనో, అభి ప్రాయ నివేదనలోనో ఏదో ఒక ప్రత్యేకతతో గోచరిస్తుంది.

ఒక ప్రతిభావంతుడైన రచయిత/సాహితీవేత్త తప్పక తనచుట్టూవున్న సమాజాన్ని ప్రభావితం చేయగలడనేది జగమెరిగిన సత్యం. 'ఒక దేశం సాంఘికంగా కానీ, మత విషయకంగా కానీ, రాజకీయంగా కానీ అలజడి పాలైె నప్పుడు మనుష్యుల హృదయాలు ఒక విధంగా కలత చెందుతై. ఆ కలత కవుల గ్రంథాలలోను, చిత్రకారుల చిత్రాలలోను ప్రతిబింబిస్తూ ఉంటుంది."6

వ్యక్తిగత రచనల్లోను, చిత్రకారుల చిత్రాల్లోను ప్రతిబింబించే ఈ కలత, సమష్టి వ్యవస్థయైన పత్రికారంగంలో మరింత బాధ్యతాయుతంగా గోచరిస్తుంది. ప్రచార సాధనాల్లో ప్రాముఖ్యం సంతరించుకొన్న వార్తాపత్రికలు ప్రజల ఆశయాలను, అవసరాలను, అభిరుచులను ఎప్పటికప్పుడు గమనిస్తూ వారికి సామాజిక, రాజకీయ, నైతికాది విషయాలలో తగిన సమాచార మందిస్తూ వారిని చైతన్యవంతులను గావించే బృహత్తర బాధ్యతను నిర్వహిస్తుంటాయి.

ఒక పత్రికలోని సంపాదకీయం సందర్భాన్నిబట్టిగాని, విషయాన్నిబట్టిగానీ సంపాదకుని హృదయం పొందిన పరిణామానికి అనుగుణంగా రూపుదిద్దు కొంటుంది. సంపాదకీయాన్ని స్వరూపాన్ననుసరించి భాషా, శైలి మొదలైన విశేషాలను నిర్ణయించవచ్చు. స్వభావాన్ననుసరించి సంపాదకీయ తత్త్వాన్ని విషయపరంగా వర్గీకరించవచ్చు. ఈ రెండు పద్ధతుల ద్వారా కృష్ణారావుగారు కృష్ణా పత్రికలో వ్రాసిన సంపాదకీయాల స్వరూప స్వభావాలను పరిశీలించ డమే ఈ వ్యాసోద్దేశం.

కృష్ణారావుగారి సంపాదకీయాలు కృష్ణా పత్రికలో మధ్య పేజీలో ఉండేవి. ఒకటి రెండు సంపాదకీయేతర వ్యాసాలు ఇతరులు వ్రాసినవి ప్రతి పత్రికలోనూ ప్రచురించేవారు. కొన్నిసార్లు ఇతరులు వ్రాసి పంపిన వ్యాసాలను సైతం కృష్ణా రావు గారు సంపాదకీయాలుగా వారి పేరుతోనే ప్రకటించి తమ ఔదార్యాన్ని, సౌజన్యాన్ని ప్రదర్శించేవారు.[7] సంపాదకీయేతర వ్యాసాలన్నిటినీ అధిగమించి సంపాదకీయమే 3, 4 (ఫుల్ స్కేప్) పేజీల వరకు విస్తరిల్లేది. కృష్ణారావుగారు సంపాదకీయాన్ని సమగ్ర వ్యాసంగా సుష్ఠుగా వ్రాసేవారు. ఏ విషయాన్ని గ్రహించి వ్రాసినా ఆసాంతం పాఠకులను ఉత్సుకతతో ఆగకుండా చదివించ గలిగిన భావ పరిపుష్టిగల రచనా సంవిధానం ఆయన ప్రత్యేకత. అవసరాన్ని బట్టి, అవకాశాన్నిబట్టి ఒకే సంచికలో రెండు మూడు సంపాదకీయాలను సైతం ఆయన వ్రాసేవారు. స్వరూపంలో చిన్నవీ, పెద్దవీ కలిసి ఆరేడు సంపాద కీయాలు ఒకే వారం వ్రాసిన సందర్భాలూ కోకొల్లలు. కొన్ని 'కాలమ్' దాటని సంపాదకీయాలైతే కొన్ని కలకాలం నిలిచిపోయేవి. ఎత్తిన కలం దించకుండా సాగిపోయే భావధార ఆయనచే సుదీర్ఘ సంపాదకీయాలు వ్రాయించింది. కొన్ని వారాలపాటు ఒకే అంశం గురించి వ్రాసిన ధారావాహిక (Serial) సంపాద కీయాలు ఉన్నాయి. ప్రతి వారం కొంత కొంత విషయం వ్రాసి నాలుగైదు వారాలపాటు వరుసగా వ్రాసేవారు. ఉదాహరణకు జేబున్నీసా నాటకం I, జేబున్నీసా నాటకం II, .... III.

కృష్ణారావుగారు స్వాభావికంగా ఎంతటి మౌనులో రచనా విషయకంగా అంతటి అంతులేని ప్రాగల్భ్యాన్ని ప్రదర్శించేవారు.

కృష్ణారావు గారి సంపాదకీయాలను విషయ ప్రాధాన్యాన్ని బట్టి ఈ విధంగా వర్గీకరించుకోవచ్చు:

i. సాంఘిక విషయకములు
ii. సంస్కరణాత్మకములు
iii. నైతిక సంబంధములు
iv. రాజకీయ విషయకములు
   a) ఆంగ్లేయుల పరిపాలనకు సంబంధించినవి
   b) దేశభక్తి - జాతీయోద్యమాలతో ప్రభావితమైనవి
   c) కాంగ్రెస్ పార్టీని గురించి వ్రాసినవి
v. వ్యక్తి విషయకములు
vi. ఆర్థిక విషయకములు
vii. యుద్ధ - ఉద్యమ పరములు
viii. ఆధ్యాత్మిక - తాత్త్విక విషయకములు
ix. కళాత్మకములు

## i. సాంఘిక విషయకములు

అనాదిగా మానవుడు సంఘజీవి. ఇతర జీవజాలానికి భిన్నంగా సంఘటిత మానవ జాతి ఎంతగానో అభ్యున్నతి సాధించి విశాల విశ్వానికి అధిపత్యం వహించగలుగుతున్నది. మానవ జాతి పరస్పర సహకారంలో అభివృద్ధిని సాధించినట్లే పరస్పర వైషమ్యంతో వినాశాన్నీ, విలయాన్నీ పొందుతుండటం చరిత్ర చాటిచెప్పే సత్యం. ఆచార వ్యవహారాలలో, ఆహార విహారాది కర్మకాండలలో, జీవనలో, వర్తనలో సారూప్యం కలిగిన కొందరు మానవుల సమూహమే సంఘ మనుకుంటే ప్రతి సంఘానికి తమదైన విశిష్ట వ్యక్తిత్వం ఉండి తీరుతుంది. తరతరాలుగా ఆ విశిష్టతను నిలుపుకొనే ఆరాటం ప్రతి వ్యక్తిలో ఉంటుంది. అదే సంస్కృతి. అంతేకాక 'మానవుడు అభివృద్ధి మార్గమున నడిచిన రీతినే సంస్కృతి అనవచ్చు.'8 ఒక సమాజం ఆచార వ్యవహారాల పరంగా కానీ, కుల మత వర్గ స్నేహ వైషమ్యాది విషయకంగా కానీ సమష్టిగా సమాజ జీవితానికి, సంస్కృతికి సంబంధించిన అంశాల నన్నిటినీ సాంఘిక/సామాజిక విషయాలుగా పేర్కొనవచ్చు.

రాజకీయాలు, కళలు, సారస్వతాది విషయాలు సమాజానికి సంబం ధించినవే కనుక ఇవన్నీ సామాజికాలే కావలసిఉన్నప్పటికీ సమాజానికి సంబం ధించిన కొన్ని విలక్షణాంశాల నుండి వీటిని వేరుచేసి ప్రత్యేకంగా పరిశీలిం చడం అవసరం.

కృష్ణారావుగారి సంపాదకీయాలలో సాంఘిక విషయాలకు సముచిత స్థానం ఉన్నది. ఆయన వ్రాసిన సంపాదకీయాలలో ఆనాటి ఆచార వ్యవహా రాలపై, సంస్కృతీ సంప్రదాయాలపై ఆయనకున్న సుస్థిరాభిప్రాయాలు ప్రకటితమయ్యాయి.

"మానవుని ప్రవృత్తి ధర్మములు విశృంఖలముగ నున్న కాలములో మతాచారములును, మతనిబంధనలును మానవుని చిత్తసంస్కారమునకును, ఆత్మియోన్నతికిని దోడ్పడగలిగి యుండెను. కానీ కాలములు మారినవి. ఆచారములు సహితము మతిదప్పి మానవ జీవనము యొక్క సహజ విలసనము నకు ప్రతిబంధకములైనవి. స్వమతాభిమానము అన్యమతా సహిష్ణుతగ పరిణ మించినది. మానవులు తమలో తాము గిరులు గీసుకొని 'నన్ను ముట్టుకోవద్దు నామాల కాకి' యను సామెతగ వైషమ్యములను పెంచుకొనసాగిరి. ప్రకృతి యిట్టి ప్రతిరోధమును సహింపజాలదు......... మానవుడింక తన గిరుల యందు బంధింపబడి యుండజాలడు. ఇంతకాలము విడివడియున్న దిక్కులు అన్యోన్యాశ్లేషణమునకై చేతులు చాచుచున్నవి.....జాతిభేదములు, వర్ణభేదము లిక మానవుని విభాగములుగ విభజించి యుండజాలవు....."[9] అనే ఆశా భావాన్ని వెలువరించారు.

ఆంగ్లేయుల పరిపాలనవల్ల ఆత్మవిస్మృతి పథంలో కొట్టుమిట్టాడుతున్న భారతీయులకు తమదైన విశిష్టతను ప్రతిపదంలో నొక్కిచెప్పుతూ వారి నైరాశ్యాన్ని పటాపంచలుగా గావించే యత్నం ఆయన రచనలలో కనిపిస్తుంది.

"రాజకీయ దాస్య ఫలితముగా హిందూదేశము తన చూపును గూడ గోలుపోయినది. ఆంగ్ల విద్యాధిక మండలికి సౌందర్యాసౌందర్య వివేచన మున పాశ్చాత్యుల లక్షణములే ప్రమాణములైనవి. విద్యాధికులు ధరించు వేషములు, నిర్మించు గృహములు, వాడుకొను ఉపకరణములు, ఆడు ఆటలు,

ప్రకటించు అభినయములు సర్వము పాశ్చాత్యమయములు....విద్యాధికుల చూపులో, భావనలో, రసజ్ఞతలో విపరీతములైన వికారములు కలుగుటచే భారత కళాలక్ష్మి స్పృశించిన ప్రతి వస్తువు, ప్రతి యలంకారము, విద్యాధికుల బుద్ధికి నిషిద్ధమైనది."10 "జాతీయ సమ్మేళన మనిన, సకల మతములు, సకల సంప్రదాయములు సకల సంఘములు వానివాని ప్రత్యేకతలను విశిష్ట లక్షణములను విడనాడి విలాసము లేని వికాసరహితమైన ఒక మట్టిముద్దవలె నగుట కాదు. ఒక మతము, ఒక భాష, ఒక సభ్యత యుండినగాని అయ్యది ఏక రాష్ట్రముగ నుండజాలదని చరిత్ర విమర్శకులును, రాజ్య తంత్రజ్ఞులును మొన్నటి వరకు బోధించు చుండెడివారు....మానవ జాతిలో భేదములను రూపుమాపుట వట్టి వ్యర్థ ప్రయాసమని చరిత్ర ముక్త కంఠముతో ఘోషించు చున్నది."11

హిందూ మహమ్మదీయ సంఘర్షణలతో దేశం తల్లడిల్లి పోవడాన్ని గూర్చి తమ విచారాన్ని వ్యక్తంచేస్తూ "ఒకరినొకరు శత్రువునిగ చూచుకొని అసహనమును బెంచుకొనిరి. క్రోధాగ్నిని రగుల్గొలిపిరి. వైరమును సాధించిరి....స్థూలదృష్టికి ఈ సంఘర్షణము వైరముగ గన్పడు చున్నదియేకాని అది నిజము కాదు. హిందూ మహమ్మదీయ మతములు సామరస్యము నొందుటకై యవి యన్యోన్యము ఒరసికొనుచుండును. ఆ యొరసి కొనుటనే స్థూల దృష్టితో గాంచి వైరము పొసగినదని భయపడితిమి. పై వినాశమునకు దిగులొందితిమి. ఇది ప్రకృతియొక్క లీల. ఈ విరసము భావికాలపు సామరస్యము యొక్క సూచన. భూమిని నాగలితో జీల్చిన గాని పంటకు పదునుగాదు. విత్తనము పైభాగము కుళ్ళినగాని మొలకెత్తదు. అగ్ని పరితప్తమైనగాని బంగారము వన్నె కెక్కదు. హిందూ మహమ్మదీయ మతముల వైరమునందు గాని సఖ్యత యుదయించలేదు."12 ముట్నూరివారి సూక్ష్మాలోచనకు, ఆధ్యాత్మిక వికాసానికి పై వాక్యాలు నిదర్శనాలు.

మన పండుగలు, వర్ణాశ్రమ ధర్మాలు, హైందవ ధర్మతత్త్వం, హిందూ మహమ్మదీయ సఖ్యత, పాశ్చాత్య నాగరకతా వ్యామోహం, స్త్రీ విద్యా స్వాతంత్ర్యాలు, గోసంరక్షణ, హరిజనోద్ధరణ, అస్పృశ్యతా నివారణ, మద్యపాన నిషేధం, రజస్వలా వివాహాలు, పడుపు వృత్తి మొదలైన సాంఘిక

సమస్యలన్నిటిని ఆయన సంపాదకీయాలలో పేర్కొన్నారు. 'తెలగ మహాసభ'[13] అనే శీర్షికతో వ్రాసిన ఒక సంపాదకీయంలో కులాన్ని గురించి ఈ విధంగా పేర్కొన్నారు. "కులము సంకుచితమైనది కావచ్చు, స్థానికమైనది కావచ్చును. కానీ కల్పితము మాత్రము కాదు. వ్యక్తి ఎంత యథార్థమో, కుటుంబమెంత యనివార్యమో, కులము కూడ అంత స్వభావ సిద్ధము. కులమే మానవునకు ప్రాణము, బలవర్ధకము, నీతిదాయకము. దానిని విడనాడిన వ్యక్తి నీటబాసిన కమలము భంగి వాడిపోవును....ఎవరి తల్లి వారికి పూజ్యురాలు. ఎవరి కులము వారికి గొప్పది .... 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' 'మేము కాపులము' అను ఆత్మ జ్ఞానము, స్వాభిమానము, హృదయాంతరాళమున ప్రజ్వరిల్లుచుండుటచేతనే ఈ మహాసభయొక్క ఆహ్వానము నింతమంది సంతసముతో నందుకొనిరి. అది వారికి తల్లి పిలుపువలె మధురమైనది. 'అబ్బాయి' అని అమ్మ పిలుచుటతోడనే ఏ కుమారుడు పరుగిడి రాకుండును? కులాభిమానమట్టిది" అంటారు. ఇవేకాక వైశ్య మహాసభ, కమ్మ మహాసభ, విశ్వబ్రాహ్మణసభ, ఆంధ్రాస్తిక మహాసభ, నియోగి మహాజనసభ, బ్రాహ్మణేతరసభ, దేశీయ క్రైస్తవ మహాసభలు వంటి కులమత వర్గ సంబంధితాంశాల నాధారం చేసికొని సంపాదకీయాలు వెలువరించారు. వీటిలో ఆయా వర్గాల కులసభల, సమ్మేళనాలలోని సంకుచితత్వాన్ని, మౌఢ్యాన్ని, ఛాందసత్వాన్ని నిశితంగా, నిర్భయంగా, నిష్పక్షపాతంగా విమర్శించారు.

సంవత్సరాది, దసరా వేడుకలు, బ్రిటన్ యువరాజు పట్టాభిషేక మహోత్సవం, సంక్రాంతి, దీపావళి మొదలైన ఉత్సవాలకు, పండుగలకు సంబంధించిన సంపాదకీయాలు ఎన్నో ఉన్నాయి.

సాంఘిక విషయాలు, సమస్యలపై వ్రాసిన సంపాకీయాలు మధుపాన ప్రోత్సాహం, ప్రాగ్దేశపు పర్దా, క్షామములు, పడుపువృత్తి, నవనారి, కల్లు అంగళ్ళు మొదలైన శీర్షికలతో దర్శనమిస్తాయి.

'ఐదవతనమే లోపం'[14] అనే శీర్షికతో వ్రాసిన ఒక సంపాదకీయంలో బ్రిటిషు ప్రభుత్వానికి దాస్యమనుభవిస్తున్న భారతదేశాన్ని పట్టమహిషిగాకాక పాదదాసిగా ఉందని అభివర్ణిస్తూ తమ ఆవేదనను వ్యక్తపరచారు.

"అన్ని లక్షణాలూ సరిగానే ఉన్నాయి గాని, అయిదవతనమే తక్కువ అన్న లోకోక్తి జ్ఞాపకం వస్తుంది నేటి మన భారతదేశపరిస్థితి తలచుకుంటుంటే. బ్రిటిషు ప్రభువులాంటి సర్వసమర్థుని అండను కాపురం చేస్తుంటే చూస్తూ చూస్తూ అమంగళం పలుకుతావేమని ప్రభుభక్తి పరాయణులెవరైనా ఆగ్రహించ వచ్చు. కాని బ్రిటిషు ప్రభువుకు భారతవర్షం అగ్నిసాక్షిగా వివాహం చేసుకొన్న భార్య కాకపోవడమే కాక, ఉంపుడుగత్తె కూడా కాదు.... స్వగృహిణిని, స్వగృహాన్ని (తమ దేశాన్ని) అతి మమకారంతో చూచుకుంటూ బహు జాగ్రత్తగా కాపురం చేసే స్వచ్ఛమైన గృహస్థు బ్రిటిషు ప్రభువు. మరి భారతదేశంతో గల సంబంధం ఏమిటంటారా? భార్యా బిడ్డలతో గృహస్థు సమస్త భోగాలూ అనుభవించాలంటే పుష్కలంగా సంపదలు సమకూర్చు కోవాలి. సకలోపచారాలకు దాసదాసీ జనములుండాలి. భారతదేశం బ్రిటనుకు అట్టి పరిచర్యలు చేయడాని కేర్పడిన దాసీ తప్ప మరొకటి కాదు."

## ii. సంస్కరణాత్మకములు

సంస్కృతికి విఘ్నం వాటిల్లినపుడు, నైతికపు విలువలు నశించి పోతున్నప్పుడు, సంస్కారం అడుగంటిపోయి సంఘంలో సభ్యతలు తారుమారై నప్పుడు, జీవితంలో నైరాశ్యం చోటు చేసుకొన్నప్పుడు, మానవత్వపు విలువలు కనుమరుగై పోయినప్పుడు కాలచక్రం నిర్వీర్యపోయి నిలిచిపోదు. కాలగమనం లోంచే సంస్కర్తలు ఉద్భవిస్తారు. తమ జాతిని, నీతిని పరామర్శిస్తారు. మంచిని పెంచి చెడును తుడిచేసి తమ సౌశీల్యంతో, సంస్కరణలతో జాతికి నవ్య చైతన్యం కలిగిస్తారు.

దురాచారాలతో, ఛాందసత్వంతో, అవిద్యతో, అజ్ఞానంతో నిద్రాణ ప్రతిభులై ఉన్న భారతీయుల మనో క్షేత్రాలలో త్యాగం, ధైర్యం, దేశభక్తి, ఆత్మవిశ్వాసం వంటి సల్లక్షణాలను పెంపొందిస్తూ వారి చీకటి బ్రతుకుల్లో చిరుదివ్వెలు వెలిగించేందుకు గత శతాబ్దిలో ఎందరో సంస్కర్తలు ఆవిర్భ వించారు. 19, 20 వ శతాబ్దాలలో ఆంగ్లేయుల పాలనలోని సంఘ సంస్కరణ లను, సంస్కరణలకు పూనుకొన్న సంస్కర్తలను గురించి ముట్నూరి కృష్ణా రావుగారు చాలా సంపాదకీయాలు వ్రాసారు. విద్యాసాగరుడు, రామమోహన

రాయల ప్రేరణలతో ఆంధ్రదేశంలో వీరేశలింగం పంతులు, రఘుపతి వెంకటరత్నం నాయుడు, గురజాడ అప్పారావు గారల వంటి సంఘ సంస్కర్తలు సాంఘిక రంగంలో ఎనలేని సేవలు చేసారు. వారికి రాజకీయ సంస్కరణలు, విద్యా సంస్కరణలూ తోడైనాయి.

సంస్కరణలు వ్యక్తుల నుండి ప్రారంభం కావాలి. వ్యక్తి సంస్కారమే క్రమంగా జాతి సంస్కరణకు సాధన మౌతుంది. ఈ విషయాన్నే ఉద్ఘాటిస్తూ 'వివాహ సంస్కారము'[15] అనే సంపాదకీయంలో కృష్ణారావుగారు "వ్యక్తి స్వాతంత్ర్యము నంగీకరింపజాలని దేశమునకు రాష్ట్రీయ స్వాతంత్ర్యమున కర్హతలేదు. భారతజాతి స్వాతంత్ర్యమును గోరుచున్నది. ఇంగ్లాండు యెడల ద్వేషముండి కాదు. కేవలము స్వార్థపరత్వము చేతనుకాదు. భారత వర్షము విశ్వరంగ మధ్యమున సమాన ప్రతిపత్తితో నిలువబడుటకై స్వాతంత్ర్యము నభిలషించుచున్నది........ పూర్వాచారములను మేము నిందింపము. కానీ వాని యవసరము తీరినది. అవి ఇప్పుడు పాషాణప్రాయములై జాతీయ జీవనమును ప్రతిబంధించుచున్నవి. వానిని సడలించవలసిన తరుణ మాసన్నమైనది. ఇంత కాలము జాతిభేదము, మతభేదము, వర్ణభేదము మొదలగు వ్యత్యాసములను కాపాడుట కేర్పడిన నిబంధనల బిగువును తగ్గించి, మానవైక్యతను పురిగొల్పు నూతన సంస్థలను గల్పించవలసిన అవసరము కలిగినది. సంఘప్రవక్తలీ యుగధర్మమును గమనించిరా, భారతవర్షము తిరిగి తన ప్రాక్తన వైభవమును బొందగలదు. గమనించరా, లోపలను బయటనుగూడ దాస్య శృంఖలముల చిక్కుకొని కృశించిపోవును" అని హెచ్చరించారు.

'సంస్కర్తల దౌర్బల్యము'[16] అన్న సంపాదకీయంలో సనాతన ధర్మాన్ని ప్రతిపాదిస్తూ ఈ విధంగా పేర్కొన్నారు: "బాల్యవివాహ నిషేధము సనాతన ధర్మ విధ్వంసకమని మాత్రము వాదించకుడు. సనాతన ధర్మమంత దుర్బలమైనది కాదు. సనాతన ధర్మమే యొక సాంఘికాచారమునకు, ఏయొక మత సంప్రదాయమునకు, ఏయొక సామాజిక నీతికిని గట్టుబడినది కాదు. శ్రుతులు విభిన్నములు, స్మృతులు విభిన్నములు. మతాచారములు, సాంఘిక వ్యవస్థలు పరివర్తనము నొందుచుండును. సనాతన ధర్మము మాత్రము మారునది కాదు. అయ్యది నిత్యము. శరీరము మారినను ఆత్మ మారదు. అయ్యది

జాహ్నవివలె అనాది నుండి నేటివరకు ఏకధారగ, అవిచ్ఛిన్నముగ, అంతస్స్రోతస్సుగ భారత జాతియందు ప్రవహించుచునే యున్నది. బాల్య వివాహాచారమే సనాతన ధర్మమునకు మూలమైన యెడల, నది యేనాడో నామరూపము లేకుండ ఈ భూతలమునుండి పరిమార్జితమై పోయెడిది. బాల్య వివాహముల నెరుగని ఆర్య ఋషుల ముఖ వినిస్సృతమైన వైదిక ధర్మమా శారదా బిల్లుచే విధ్వంసక మగుచున్నది! సత్యభామ, రుక్మిణి మొదలగు వీర వనితలను బెండ్లాడిన శ్రీకృష్ణుని గీతాధర్మమా బాల్యవివాహ నిషేధక శాసనముచే బరాస్తక మగుచున్నది!

తమ యపూర్వ క్షాత్రతేజముచే భారతేతిహాసమును ప్రకాశవంతముగ జేసిన భారత వీరుల, రాజపుత్ర శూరుల ప్రౌఢ వివాహములా సనాతన ధర్మమును నాశనము జేయునది! ఎంత వెఱ్ఱి! ఇట్టి అల్ప సంకల్పముచే సనాతన ధర్మమును బరిహసింపకుడు. ఎంత కాలము భారత జాతియందు విషయ భోగము తృణీకరింపగల ఇంద్రియ నిగ్రహము, సామ్రాజ్యములను ధిక్కరింపగల ఆత్మశక్తి, పరదాస్య శృంఖలములను బూర్ణముగ జూర్ణము చేయగల స్వాతంత్ర్య నిరతి, బ్రహ్మానందమును గ్రోలగల రసపిపాస, లోకదుఃఖ నివృత్తికై బరితపింపగల అతీంద్రియ దృష్టి ఎంతకాలము వర్ధిల్లు చుండునో, అంతకాలము సనాతన ధర్మము చిరస్థాయియై ప్రకాశించగలదు."

సంఘ సంస్కరణ సభలు, శుద్ధి సంస్కారము, అంత్యవర్ణాల ఉద్ధరణ, వడుపుజీవనం, రజస్వలావివాహం, మద్యపాన నిషేధం, గోరక్షణ, సోషల్ రిఫారమ్‌ల వంటివి సాంఘిక సంస్కరణ విషయకంగా వ్రాసినవి. ఇవికాక మైనరుబాలికల సంరక్షణ బిల్లు, విద్యాసంస్కరణలు, పార్లమెంటో సంస్కరణలు మొదలైనవి రాజకీయ సంస్కరణ విషయాలపై కొన్ని సంపాదకీయాలను కృష్ణారావుగారు వ్రాసారు.

సంఘ సంస్కరణశీలి, బ్రహ్మర్షి, రఘుపతి వెంకట రత్నం నాయుడు గారిపై వ్రాసిన ఒక సంపాదకీయంలో వడుపు వృత్తిని నిరసిస్తూ, దాని నివారణకు బద్ధకంకణులైన నాయుడుగారిని గూర్చి ఈ విధంగా వ్రాసారు : "కన్యలను నరమాంస విక్రయ తుల్యమగు వడుపు వృత్తి యందు బంధించి స్త్రీజాతి కంతకు దీరని కళంకమును దెచ్చిన ఓ దురాచార పిశాచమా! నీ వెంత

కాల మీకర్మభూమి యందు స్వేచ్ఛావిహారము గావించెదవు? ఆ పుణ్యశీలుని నేత్రముల నుండి పడిన బాష్పబిందువులు అగ్నికణములై నిన్ను దహించి వేయుగాక!" అని ప్రతిఘటిస్తూ, నాయుడుగారు ప్రారంభించిన భోగము వృత్తుల నిర్మూలనోద్యమానికి ఊపిరి పోసారు. "నాయుడుగారు ప్రారంభించిన ఉద్యమమును వేశ్యావృత్తి సహాయ నిరాకరణోద్యమమని పిలువవచ్చు. ఇది వేశ్యకులమునకు ప్రతికూలమైనది కాదు. ఇది ఆ స్త్రీల దాస్యవిమోచనమునకై ఉద్యమించిన ప్రయత్నము. స్త్రీల మాతృ స్వరూపమును ఆరాధనచేయు సాధు సత్తమునకీ ప్రయత్నముకంటే గొప్ప సాధన ఏమి కావలెను?"[17] అని వితర్కించారు.

ఆంగ్లేయ పాలకులు భారతదేశాన్ని సంస్కరించి స్వరాజ్యం ప్రసాదించడానికి పూనుకొన్నారని వ్యంగ్యంగా విమర్శిస్తూ 'సంస్కరణాల ఓడలు దిగుతున్నా'యనే సంపాదకీయం[18] ప్రకటించారు.

## iii. నైతిక సంబంధములు

విశ్వచైతన్యానికి కేంద్రబిందువు వ్యక్తి. వ్యక్తి మానసికతత్త్వాన్ని స్వీయానికీ, సమాజానికి ఉపయోగకరంగా మలచడానికి వీలైన కట్టుబాట్లు అనూచానంగా వస్తున్నాయి. ఈ కట్టుబాట్లు మతం నిర్దేశించినవి కావచ్చు; చట్టం శాసించినవి కావచ్చు; ప్రాంతీయమైన శిష్టులు నిర్ణయించినవీ కావచ్చు లేదా మనిషి సంస్కారాన్నిబట్టి వ్యక్తిలోనే ఉద్బుద్ధమయ్యే నియమాలూ కావచ్చు. 'నీతి' అన్నమాటను పూర్వులు రాజనీతికి మాత్రమే పరిమితం చేసారు. వంశపారంపర్యంగా సంక్రమించే రాజ్యాధికారంతో పరిపాలన సాగించే రాజులపట్ల ప్రజలు సర్వధా విధేయత ప్రకటిస్తూ వారి ధర్మనిర్ణయాలకు, సార్వభౌమాధికారాలకు ఒడబడి ఉండేవారు. నేడు రాజ్యాంగం సక్రమంగా నడిచేందుకు, ప్రజాస్వామ్య పరిరక్షణకు, పౌరుల హక్కుల బాధ్యతలకు భంగం వాటిల్లకుండేందుకు ఏర్పరచుకొన్న నియమాలను నైతికపు విషయాలుగా పరిగణించవచ్చు. వ్యష్టిగా వ్యక్తికి, సమష్టిగా సమాజానికి పరస్పర సమన్వయం కలిగిస్తూ అతని/దాని సుఖజీవనంకోసం ఏర్పరచుకొన్న నియమాల రాశిని 'నీతి' అనవచ్చు. నైతికపు విలువల పరిరక్షణలో పూర్తి బాధ్యత

న్యాయస్థానాలది, ప్రభుత్వానిది కాగా, ధీయుతులైన ప్రజలు, ప్రజాసంఘాలు, వాటి ప్రతినిధులు, పత్రికలు నిరంతరం జాగరూకతతో వ్యవహరిస్తూ నైతికపు విలువల పరిరక్షణకు ఉద్యమిస్తుంటారు.

కృష్ణాపత్రికలో కృష్ణారావు గారి సంపాదకీయాలలో నైతిక విషయాలపై వ్రాసిన సంపాదకీయాలు ఎన్నో ఉన్నాయి. సాంఘిక నైతిక విషయాలు, రాజకీయ నైతిక విషయాలుగా వాటిని విభజించుకోవచ్చు.

సమాజంలోని దుర్మార్గాలను, దౌష్ట్యాలను, దురాచారాలను ప్రతిఘటిస్తూ వ్రాసినవి సాంఘిక నైతిక విషయాలు. రాజకీయపరమైన చట్టాలు, శాసనాలు న్యాయపరమైన తీర్మానాలు రెండవ కోవకు చెందినవి. కాగా సనాతన భారతీయ సంస్కృతిని ప్రతిబింబించేవి, పదిలపరచేవి, తత్త్వసంపన్నులు, మహా మనీషులైన ద్రష్టలు ప్రతిపాదించిన నిబంధనలు ధార్మిక నైతిక విషయాలుగా పరిగణింపవచ్చు.

కృష్ణారావు గారి రచనలలో కొన్నిసార్లు ఈ మూడు విధాలు ఒక దానితో ఒకటి పెనవేసుకొని పోయినట్లుగా కనిపిస్తాయి. సాంఘిక విషయాలకు సైతం ఆధ్యాత్మికమైన తీర్పులు సూచించి సమన్వయించడం ఆయన విశిష్టత. స్మృతులు, శాస్త్రాలు మొదలైన పారంపరిక విజ్ఞానాన్ని ఒంటబట్టించుకొన్న జిజ్ఞాస కృష్ణారావు గారి సంపాదకీయాల్లో ద్యోతకమౌతుంది.

అస్పృశ్యతా జాడ్యాన్ని తీవ్రంగా గర్హిస్తూ వ్రాసిన యీ మాటలు కృష్ణారావు గారి నైతిక ప్రవృత్తిని, ఆధ్యాత్మిక పరిణతిని తెలుపుతున్నాయి. "ప్రకృతి యేదోషమునైనను సహించి యూరుకొనును గానీ మానవుని పశువు కంటెను హీనముగా జూచు ఏ వ్యవస్థను సహించి యూరుకోదు. ప్రకృతి క్షమాశీల. తొందర పడదు. సంస్కరణమునకు తగు కాలవిలంబనము నిచ్చును. సంఘ ప్రవర్తకుల నెన్ని మారులో మందలించి జూచును. కానీ ఈ సహనమునకు గూడ నొక మేర గలదు. అది తప్పిన క్షమారూపిణియైన ప్రకృతి సంహారమునకు గడంగును.....నేడు భారత దేశమును ప్రపంచములో కెల్ల పరాధీన భూమిగ, దాస్య జాతిగ, గౌరవమున కనర్హముగజేసి వైచినది. ఈ దుర్గతి యంతయు అస్పృశ్యత యొక్క పాపఫలితము."[19]

'మత స్వాతంత్ర్యము'[20] శీర్షికన వ్రాసిన సంపాదకీయంలో నాటి రాజ్యాంగము మత విషయంలో తటస్థంగా ఉండకపోవటాన్ని తీవ్రంగా గర్హించారు. "కోర్టు లేర్పడనంత వరకు ఇట్టి మార్పులెన్నియో (దేవాలయా లలో పూజారుల నియామకం మొదలైన మార్పులు) సహజ రీతిన జరిగిపోవు చుండెను. కానీ కోర్టు లేర్పడిన పిమ్మట ఆ సహజధార కట్టువడిపోయెను. నేటి యాచారములకు కోర్టులు రక్షణాలయములైనవి....నేడే కోర్టును తిరుపతి వేంకటేశ్వరాలయమును తిరిగి శైవుల పరము చేయజాలదు. శ్రీశైలము జంగమువారి చేతిలో నుండవలసినదే కాని వారిని తరిమివేసి బ్రాహ్మణులను నియమించు అధికారము కోర్టులకు లేదు....ఆ కాలములో సంఘమునకే మత విషయములలో సర్వాధికారము లుండెడివి. ఇప్పుడట్టి సంఘ స్వాతంత్ర్య మును గోరుట న్యాయవిరుద్ధమైనది. నేడు అస్పృశ్యులను తమతోపాటు తమ రామాలయము లోనికి తీసుకొని పోవుటకు ప్రజలెంత కోరుచున్నను, ఈ కోర్టులాకోరిక నరికట్టుచున్నవి....రాజ్యాంగము మత విషయమున తాటస్థ్యముగ నుండవలసినదని గదా మనము కోరుచున్నది. నేడు రాజ్యాంగ మట్టి తాటస్థ్య మును వహించుటలేదు. ఇయ్యది కేవలము హిందూ సంఘమునకు సంబం ధించిన విషయము. రాజ్యాంగము సంపూర్ణముగ తాటస్థ్యము వహించవలసిన సందర్భమిది. అయినను రాజ్యాంగము తన కోర్టుల ద్వారా హరిజనులకు దేవాలయ ప్రవేశము లేదని తీర్పు చెప్పుచున్నది .... మత స్వాతంత్ర్య మన నేమి? ప్రజలు ఒక యాచారమును నిలువబెట్టుకొనుటకుగాని మార్చుకొనుటకు గాని గల హక్కే స్వాతంత్ర్యము" అని సాధికారికంగా నిర్వచించారు.

సర్వమానవ ఐక్యత, సహనము, శాంతి, మూఢాచారాలపట్ల తిరస్కార భావం, సత్యాహింసల యెడల దృఢదీక్ష, స్థిర సంకల్పాన్ని కలిగి ఉండి అధర్మాన్ని ఎదుర్కొనే మానసిక శక్తిని పెంపొందించుకోవటం వంటి అంశా లను నొక్కి చెప్పుతూ అనేక సంపాదకీయాలు ఆయన వ్రాసారు. ప్రపంచ మంతటా నిండివున్న వర్ణద్వేషాన్ని వివరిస్తూ, శ్వేత జాతీయులు భారతీయుల కంటే, ప్రపంచంలోని ఇతర వర్ణాల వారికంటే తామే సమున్నతులమని భావించడాన్ని గర్హిస్తూ, ఒకచోట "ప్రకృతిలో వర్ణవైచిత్ర్యము ఆనంద దాయకము. కానీ మానవులలో నది పరిభవములకెల్ల మూలకారణమగు చున్నది. ఈ ద్వేషమును జూపించువానిబుద్ధి వక్రమగుటయేకాక, ఈ ద్వేషము

నకు గురియగు మానవుని శీలమును గూడ నాశనము చేయును. వర్ణద్వేషము ఈ లోకమును నరక కూపముగ మార్చివేయుచున్నది"[21] అని కృష్ణారావుగారు తమ వ్యధను, వ్యతిరేకతను వెల్లడించారు.

## iv. రాజకీయ విషయకములు

హైందవ ధర్మానుగుణంగా ప్రాచీన భారతీయుల జీవన విధానంలో గుణకర్మ విభాగానుసారం చాతుర్వర్ణ్యాలు సృజింపబడ్డాయి. జాతి చైతన్యం కోసం, మానవాభ్యున్నతి కోసం నాటి జనులు తమతమ కులమతాచారాలను సంస్కృతి, సభ్యతలను ఏ మాత్రం ఉల్లంఘించక సహజీవనం గావించేవారు. మేధావి వర్గం (పురోహిత వర్గం) మంత్రాగాన్ని నిర్వర్తిస్తుంటే, దృఢకాయ వర్గం పరిపాలనా బాధ్యత వహించేది. వ్యవసాయం, పశుపోషణ, వాణిజ్యం, వైశ్య వృత్తులైతే, కాయకష్టం, వృత్తిపన్నుల నిర్వహణ చతుర్థ వర్గ విధులుగా భావించేవారు. నాడు రాజకీయమంటే రాజు, రాజ్యం, ప్రజలు, వరిపాలన సంబంధితాంశాలే. రాజు ప్రజానురంజకుడై, ధర్మవర్తనుడై సామ్రాజ్యాన్ని విస్తృతపరచుకుంటూ చతుర్విధ పురుషార్థాలను తూచా తప్పకుండా అనుసరిస్తూ సాగించే సువ్యవస్థితమైన, పరిపాలనా పరమైన విషయాలు రాజకీయాలుగా ప్రాచీన భారతంలో ప్రచురంగా ఉండేవి.

19 వ శతాబ్దాంతానికే కాల పరిణామ క్రమంలో రాచరికపు వ్యవస్థ నశించిపోయి అక్కడక్కడ చిన్నచిన్న సంస్థానా లేర్పడి, పాలెగాండ్ర జమీందారుల ఆధిపత్యం వెలసింది. విదేశీయుల దురాక్రమణల వల్ల దేశం యావత్తూ దుర్భర దాస్య దురవస్థకు గురైంది. రాచరికపు వ్యవస్థ పూర్తిగా అంతరించిపోయి, ప్రజాపరిపాలనకు సమాయత్తమౌతున్న సంధి సమయంలో మేధావివర్గ ఆలోచనా విధానానికి నిదర్శనంగా నిలుస్తాయి ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయాలు.

భారతదేశ చరిత్రలో స్వాతంత్ర్యోద్యమానికి అతి విశిష్టమైన స్థానం ఉన్నది. భారతజాతి పరదాస్య విమోచనం కోసం ఎందరో మహనీయులు సల్పిన ఉద్యమాల, త్యాగాల, ఆత్మార్పణల ఫలితంగా సాధించుకొన్న స్వాతంత్ర్యం చరిత్రలో సుస్థిరస్థానం సంపాదించుకొన్నది. పందొమ్మిదో శతాబ్ది

ప్రథమ భాగం సాంస్కృతిక పునరుజ్జీవన ఉద్యమాలతో, ద్వితీయ భాగం సాంఘిక సంస్కరణలతో నిండి యున్నది. ఇరవయ్యో శతాబ్ది ప్రథమ భాగం జాతీయోద్యమాలతో (స్వాతంత్ర్యోద్యమాలతో) హోరెత్తిపోయింది. ఈ ఉద్యమాల ప్రభావం కృష్ణారావుగారి సంపాదకీయాల నిండా పరచుకొంది.

"ఈ ఎనబదియొక్క సంవత్సరముల నుండియు జరిగిన సాంఘిక, రాజకీయ, ధార్మిక విషయిక పరివర్తనముల నొక్కసారి పరికించినచో నెట్టి మహానుభావుడు నవీన హిందూదేశమును గదిలించుచున్న మహాశక్తులన్నిటికి మూలపురుషుడుగా నుండెనో స్ఫురించక మానదు" అని 1912 లో శ్రీ రాజా రామమోహనరాయలను గూర్చి వ్రాసిన సంపాదకీయంలో పేర్కొన్నారు. రామమోహనరాయలపై వ్రాసిన సంపాదకీయాలలో ఆయన విశిష్ట వ్యక్తిత్వం, సంఘసంస్కరణ శీలత, బ్రహ్మసమాజం మొదలైన అంశాలను సవివరంగా పరామర్శించారు.

శ్రీ రఘుపతి వేంకటరత్నంనాయుడుగారి షష్టిపూర్తి సందర్భంగా వ్రాసిన సంపాదకీయం ఆంధ్రదేశంలో సంస్కరణోద్యమాలను కూలంకషంగా తరచిచూచే వ్యాసం. సుదీర్ఘమైన ఈ వ్యాసం రఘుపతి వెంకటరత్నం నాయుడు, వీరేశలింగం పంతులుగారల సమగ్ర వ్యక్తిత్వ ప్రదర్శకంగా ఉంది. "ఆంధ్రదేశ పురోభివృద్ధికిని, నవజీవన విలసనమునకును ఈ యుభయులును అగ్రదూతలు, మార్గదర్శకులు, ప్రధానాచార్యులు. ఆంధ్ర యువకులలో పరమార్థ చింతనను, స్వతంత్రతత్త్వాన్వేషణాసక్తిని, సత్కార్యోత్సాహమును, పరిశుద్ధజీవనమును వీరుద్దరింపజేసినట్లుగ నవీనులలో మరియొకరు జేసి యుండలేదు. నేటి ఆంధ్రజాత్యభ్యుదయమునకు వీరిరువురును మూల పురుషులనుట నిశ్చయము"[22] అని పేర్కొంటూ ఆ వ్యాసంలోనే నాటి సామాజిక పరిస్థితులను, పాశ్చాత్యులు కల్పించిన సమస్యలను, ధర్మ సామంజస్యాన్ని, నాయుడుగారి ఆంతరంగిక జీవనాన్ని, సాధనను విశదీకరించారు.

ఇదే విధంగా తిలక్, నౌరోజీ, చిత్తరంజన్ దాసు, అనిబిసెంట్, రామకృష్ణ పరమహంస, వివేకానంద స్వామి, రమణమహర్షి మొదలైన మహా మనీషులపై వ్రాసిన సంపాదకీయాలు నాటి సంస్కరణోద్యమాలు, వారి సాధనా విశేషాలతో ప్రకాశిస్తాయి.

కృష్ణారావుగారి సంపాదకీయాలలో రాజకీయ విషయికమైనవి ముఖ్యంగా మూడు విధాలుగా కనిపిస్తాయి. అవి ఆంగ్లేయుల పరిపాలనకు సంబంధించినవి; దేశభక్తితో, జాతీయ (స్వాతంత్ర్య) ఉద్యమాలతో ప్రభావితమైనవి; కాంగ్రెసు పార్టీని గురించి ప్రత్యేకంగా వ్రాసినవి.

## iV-A. ఆంగ్లేయుల పరిపాలనా విషయకములు

వర్తక నిమిత్తం మన దేశంలో పాదం మోపి దేశీయులలో విభేదాలు రేకెత్తించి పరస్పర విద్వేష కారకులై క్రమశః యావద్దేశ పాలకులైన ఆంగ్లేయుల పరిపాలనను విమర్శిస్తూ, వారి పాలనలోని లోపాలను, అవలక్షణాలను ఎత్తి చూపిస్తూ చట్టాల నిబంధనలకు లొంగని చక్కని వ్యంగ్య స్ఫూర్తిని ప్రదర్శించే వ్యాసాలు ఆయన వ్రాశారు.

"అవును! భరతవర్షమే వారికి బాధాక్రాంతమైన దేశము. ముప్పదికోట్ల ప్రజ గల దేశము. రత్నగర్భ. పంటల బంతి. వారికి సర్వవిధముల భాగ్య భోగ్యముల నొసంగు కామధేనువు. వారీ దేశమును బాలించుచున్నది కేవలము వారి యుద్యోగముల కొరకు గాదు........ఇంగ్లాండు వర్తక దేశము. వాణిజ్యము వారి పురుషార్థము. ప్రపంచములో ఇండియావలె వారి వాణిజ్యము కుపకరించు దేశము మరియొకటి లేదు ఇండియాకు ఇంగ్లాండునకును గల సంబంధము వాణిజ్య సంబంధము. ఇంగ్లాండు పెద్ద మిల్లు. గొప్ప బ్యాంకు. చతురత కలిగిన దుకాణదారు. ఇండియా వారి మార్కెట్టు. మంచి పెట్టుబడి, నమ్మకమైన ఖాతాదారు. ఈ యార్థిక సంబంధమును రక్షించి పోషించుట యందే వారి రాజనీతి యంతయు సార్థకత చెందుతున్నది."[23]

మరోచోట "బ్రిటిషువారు హిందూ దేశము యెడల నవలంబించుచున్న రాజనీతి యందు ముఖ్యముగ మూడు విషయములు కలవు:

1) హిందూ దేశమునకు స్వపరిపాలనార్హత లేదు.

2) ప్రాచ్య దేశీయులకు నిరంకుశ ప్రభుత్వ విధానమే సరియైనది.

3) బ్రిటిషు ప్రభుత్వములో దేశీయు లెక్కువగ జొల్గొనునట్లు చేయవలెను.

ఈ మూడు సూత్రముల మీదను బ్రిటిషు రాజనీతి నిలిచియున్నది .... హిందూ రాజ్యాంగమునకు రెండు దిక్కులు కలవని కర్జను ప్రభువు వెనుకనే చెప్పియుండెను. ఒకటి రాజ్యాంగ పరిపాలనము. రెండవది ధన శోషణము. మొదటిది రాజదండము, రెండవది తులాదండము. ఇవి యన్యోన్యాశ్రయములు. హిందూ దేశమునకు స్వరాజ్య మొసగిన పిమ్మట బ్రిటిషు వర్తకులు పూర్వము వలె నీదేశమును దోచుకొనగలుగుదురనుట వట్టికల్ల'' అంటారు. అదే వ్యాసంలో "..... సత్యమును మరుగు పరచుటలోను, అసత్యమునకు మెరుగు పెట్టుటలోను లాయిడు జార్జిని మించినవాడు నేటి పాశ్చాత్య రాజనీతి కోవిదులలో లేడని సాహసము చేసి చెప్పవచ్చును"[24] అని పేర్కొన్నారు.

".... ప్రపంచములో ఏది మారినను, ఏ రాజ్యములు తలక్రిందులయినను, ప్రళయములు వచ్చినను, ప్రపంచములో మారని వస్తువు, క్షీణించని వస్తువు, స్థిరముగ, నిత్యముగ, నిలిచియుండు వస్తువు 'బ్రిటిషు యధికారము' బ్రిటిషు మెడికలు ఆఫీసర్లు, బ్రిటిషు పోలీసు ఆఫీసర్లు, వారి హెచ్చు జీతములు, హెచ్చు పింఛన్లు. ఇది శిలాక్షరము, బ్రహ్మాస్త్రము. దీనికి తిరుగులేదు. అమోఘము! ఇదివరకే బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞుడును, ఏ ఆంగ్లేయ సచివుడును, ఇంతకంటె స్పష్టముగ, అసందిగ్ధముగ, నిష్కపటముగ బ్రిటిషు రాజనీతిని నిర్వచించి యుండలేదు..... దీనికి ప్రత్యుత్తరమేమి? సహాయమా? అసహాయమా?"[25] అంటూ జాతిని జాగరితం చేస్తున్న ఈ సంపాదకీయం బ్రిటిషు రాజనీతికి దర్పణం పడుతున్నది.

క్వెట్టా అనే ప్రదేశంలో సంభవించిన ఘోరమైన భూకంపం వల్ల 60 వేల మంది మరణించారు ఈ సందర్భంగా సహాయ చర్యలకు పూనుకోవడానికి వచ్చిన స్వచ్ఛంద కార్యకర్తలను, ప్రజలను ప్రభుత్వం అనేక విధాలుగా నిరోధించి నిషేధాజ్ఞలు విధించింది. అందుకు నిరసనగా కృష్ణారావు గారు 'క్వెట్టా అంక్ష!'[26] అనే సంపాదకీయం వ్రాసారు. వెంటనే ప్రభుత్వం పత్రికపై సెక్యూరిటీ ప్రయోగాస్త్రాన్ని సంధించింది. రూ. 2,000 ధరావత్తు కట్టమని శ్రీముఖం అందింది. పత్రిక శ్రేయస్సు దృష్ట్యా ఆ మొత్తాన్ని వెంటనే చెల్లించి యథాప్రకారం నడిపించారు.

కానీ, 1930 లో గాంధీగారి పిలుపునందుకొని నైతిక బాధ్యతగా భావించి కృష్ణారావుగారు శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళారు. ప్రభుత్వం ప్రకటించిన ఆర్డినెన్సుకు లోబడి ధరావత్తు చెల్లించడం ఆత్మవిద్రోహంగా భావించారు. ఆరు నెలలపాటు పత్రిక ఆగిపోయింది.

## iv-B. దేశభక్తి సంబంధములు

శ్వాసించడమెంత సహజమైన విషయమో దేశభక్తిని కలిగిఉండటం కూడా అంతే గొప్ప విషయం. ఏ కొన్ని ప్రత్యేక సందర్భాలలోనో తప్ప మనం ప్రతి క్షణం ఉచ్ఛ్వాసనిశ్వాసాలు జరుపుతున్నప్పుడు గాలిని గురించిన ఆలోచనే చేయం. అలాగే ప్రతి వ్యక్తి అంతర్నిగూఢంగా తన దేశాన్ని ప్రేమిస్తూ, పూజిస్తూ, గౌరవిస్తూనే ఉంటాడు. జననీ జన్మభూములను ఆరాధించడం మనకు అనూచానంగా వస్తున్న సదాచారం. కానీ ఏ వ్యక్తి నిరంతరం తన జన్మభూమిని స్మరిస్తూ, ధ్యానిస్తున్నట్లు ప్రవర్తించడు. తన దేశ శ్రేయస్సుకు భంగం వాటిల్లినప్పుడు, వైదేశిక శక్తులు విజృంభించినప్పుడు, దేశంలో అంతర్విభజనలుగానీ, అల్లకల్లోలాలుగానీ చెలరేగినప్పుడు దేశాభిమాన లేశమున్న ప్రతి వ్యక్తి హృదయంలోనూ దేశభక్తి ప్రస్ఫుటమౌతుంది. మిగతా వేళల్లో అది నివురుగప్పిన నిప్పులా గుప్తంగా హృదయపుటలలో దాక్కుంటుంది.

1905 లో జరిగిన వంగదేశ విభజన దేశీయుల హృదయాల నల్లకల్లోలపరచింది. ఆ ఆవేదన కొందరు యువకులలో తీవ్రరూపందాల్చి ప్రజ్వలితమై దౌర్జన్యకాండలకు దారితీసింది. వంగదేశ ప్రభావం, బెంగాలీ సాహిత్యాధ్యయనం, బిపిన్‌చంద్రపాల్‌గారి సహచర్యం కృష్ణారావుగారిపై బలమైన ముద్ర వేశాయి. ఆ తీవ్రత సంపాదకీయాలలో ప్రతిధ్వనించింది.

దేశభక్తిని గురించి వ్రాసే సంపాదకీయాలలో ధర్మము, సంస్కారము, ఆధ్యాత్మికము మొదలైన భావనల ప్రసక్తి సర్వత్రా కనిపిస్తుంది. భారత దేశాన్ని మాతృమూర్తిగ, సుస్థిరయశో వైభవోపేతగ భావించి సేవించిన ధన్యజీవి కృష్ణారావుగారు. వర్ణనాత్మకమైన ఫణితితో భారత దేశమాత రథోత్సవాన్ని కవితాత్మకంగా, ఆవేశంగా అభివర్ణించారు. "అదుగో! కింకిణీ

సమలంకృతమైన త్రివర్ణ పతాకాంచలములు దవ్వుల గాన్పించుచు చేర బిలుచు చున్నవి. అదిగో! దేవి స్వర్ణరథనేమి ధ్వానము, సమీపించుచున్నది. అదిగో! రథ మధ్యమున శాంతితేజముతో వెలుగుచున్న ఆ తల్లి దివ్యమంగళ స్వరూపము. రమ్మి కృష్ణవేణీ! రమ్మి! రావే పినాకినీ! గౌతమీ! అలసించెదవు సుమా! ఏమే తుంగభద్రా! జాగు సేయకుము. దేవి రథము దాటిపోవు చున్నది. 'ఏదీ! ఆంధ్రప్రభ' యని ఆ విశ్వజనని దరహాస సుందర వదనయై అడుగుచున్నది. రండు. పావన త్రిలింగ రక్షితమై పుణ్యనదీ మాతృకా పాలితమైన మహాంధ్ర జనతా మహీయస్సేవాంజలి సమర్పింపుడు. జయ భారత జననీ! జయ ఉదయాస్తాచల సేతు శీతనగ పరివేష్టిత పుణ్య వసుంధరా! జయ! జయ! ప్రజామయీ! జయ కాంగ్రెసు పీఠవాసినీ! జయ వాత్సల్యమయీ! జయ ప్రసన్నమూర్తీ! జయ అస్మచిత్తాబ్జగేహా!"[27] నిర్మలమైన, నిర్వ్యాజమైన యీ దేశభక్తికి, తాదాత్మ్యస్థితికి పాఠకులు పరవశించిపోయేవారు. కృష్ణారావు గారు మాత్రం స్వాతంత్ర్య రథాసీన జననిని దవ్వుదవ్వుల నుంచే దర్శించి వెళ్ళిపోయినారు. (ఆయన పరమపదించి 1945 లో). మాతృభిక్ష, మాతృ నివేదన, మాతృ సందర్శనం, దేశమాతకు శిక్ష మొదలైన సంపాదకీయాలెన్నో వారి అమేయ దేశభక్తికి నిదర్శనంగా నిలుస్తాయి.

కృష్ణారావుగారు వంగరాష్ట్ర పర్యటన అనంతరం బిపిన్‌చంద్రపాల్ ఆంధ్రదేశాన్ని పర్యటించారు. వారిచ్చిన జాతీయ స్ఫూర్తిని ఆకళింపు చేసికొని, 1906 లో బెంగాల్ జాతీయ కళాశాల ఆవిర్భావాన్ని ఆదర్శంగా గ్రహించి, 1911 లో బందరులో కోపల్లె హనుమంతరావు, పట్టాభి సీతారామయ్య గారల సహకారంతో **ఆంధ్ర జాతీయ కళాశాల**ను వ్యవస్థాపించారు. దీనితో కృష్ణారావుగారు ఆంధ్ర జాతీయోద్యమానికి ఆదర్శపురుషులయ్యారు. ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపనావశ్యకతలను నిరూపిస్తూ పత్రికలో అనేక సంపాదకీయాలు వ్రాసారు. మహాత్ముడీ కళాశాలను సందర్శించి వారి కృషిని ఎంతగానో అభినందించాడు.

కృష్ణాపత్రిక సంపాదకీయాలను ఒక వరుసలో (చారిత్రక క్రమంలో) పరిశీలించినట్లైతే జాతీయోద్యమాన్ని ఘట్టాలవారిగా దర్శించినట్లుంటుంది. ప్రతివారం వెలువడే ఈ పత్రికలో ఆ వారంరోజుల్లో జరిగిన రాజకీయ

ఘటనలు, ముఖ్యంగా స్వాతంత్ర్యోద్యమ విశేషాలు సంపాదకీయంగా రూపు దిద్దుకొనేవి. కృష్ణారావుగారు స్వాతంత్ర్య సంగ్రామాన్ని బహునిష్ఠాతులై ఏమాత్రం ఏమరుపాటు లేకుండా గమనిస్తుండేవారు. పాఠకులకు తమదైన ఆత్మీయ ధోరణితో ఆయా ఘట్టాలను వివరించేవారు.

ప్రచండ శాసకులైన బ్రిటిషు పాలకులు తమ పోలీసుబలంతో ఎదిరించినప్పటికీ బార్డోలీలోని పేదరైతులు మహాత్ముని అండతో వారి కెదురునిల్చి పోరాడారు. ఈ సందర్భాన్ని కృష్ణారావుగారు కళ్ళకు కట్టినట్లు వర్ణించారు— "ఈ రైతులెక్కువ చదువుకొనినవారు కారు. వట్టి పామరులు. సంసార తాపత్రయములో చిక్కుకొనిన నిరుపేదలు. బ్రిటిషు అధికారులు ప్రచండ శాసకులు. వారిది కేవలము పోలీసు రాజ్యము. సామ్రాజ్యము నంతను బిగించి వేయగల బలాఢ్యులు వారు. అట్టి అధికార ధూర్వహుల నీబీదరైతు లెట్లు ఎదుర్కొనగలరు? మహాత్ముడు గంభీర విశ్వాసి....ప్రకృతిలో ప్రతి ఇసుక రేణువు యందును అమూల్యములైన లోహములు దాగియున్నవి....ప్రతి నరుని యందును సర్వశక్తిమంతుడు మెలగుచునే యున్నాడు....మహాత్ముని ప్రబోధముచే నీ సామాన్య బార్డోలీ కర్షకులు మహావీరులుగ వెలసిరి. త్యాగ పథమున అగ్రేసరులైరి. బార్డోలీ తాలూకా యంతయు యజ్ఞభూమి యైనది. స్త్రీ జనము కూడా బద్ధకటియై యీ రణరంగమున దుమికినది. పన్నుల నిరాకరణాస్త్రమును సంధించిరి. అంతటితో అధికారులు వచ్చిపడిరి. బెదిరించిరి, భేదోపాయము నవలంబించిరి. వారి పూరిగుడిసెలతో జొరబడి అన్నము వండుకొనే కుండలను సహితము లాగుకొనిపోయిరి. పిల్లలకు పాలు లేకుండ పశువులను తోడ్కొని పోజొచ్చిరి. స్త్రీబాల వృద్ధముగా అందరి నిండ్లలో నుండి తరిమివేసిరి. కాని రైతులు చలించలేదు. ఏమివచ్చినను రానిమ్మని అట్లే నిలువబడిరి. సత్యాగ్రహమే వారికి కవచము."[28]

విదేశీ వస్త్ర బహిష్కారం, అసహాయోద్యమం, శాసనోల్లంఘనం, సైమన్ కమీషన్ నిరసన, మహాత్ముని నిరసనవ్రతం, క్రిప్స్ రాయబారం, జిన్నాగారి జిత్తులు, క్విట్టిండియా మొదలైన జాతీయోద్యమ ఘట్టాలలో కృష్ణారావుగారు వెలువరించిన సంపాదకీయాలు దేశభక్తి ప్రపూరితాలు.

# iv-c. కాంగ్రెస్ సంబంధములు

**1857** లో జరిగిన ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం విఫలమైన తరువాత భారతదేశం ఆంగ్లప్రభుత్వ ప్రత్యక్షపాలన క్రిందికి వెళ్ళింది. ఆ తరువాత సంస్కరణోద్యమాల ఫలితంగా దేశీయులలో **జాతీయతా భావం** క్రమ క్రమంగా వృద్ధి పొందింది. ఆంగ్ల ప్రభుత్వంపట్ల అసంతృప్తి, నిస్పృహ పెరిగిపోయింది. భారతదేశం సమస్తం ఒకే జాతిగా, ఒకే ధ్యేయంతో ఉద్య మించిన ఘట్టం ఇది. దేశ చరిత్రలోనే అపూర్వం. అందునా ఇది ప్రజల పోరాటం. **1885** లో భారత జాతీయ కాంగ్రెసు స్థాపించ బడింది. తొలి రోజుల్లో కాంగ్రెసు ఉద్యమ పరిధి పరిమితమైనదైనా క్రమక్రమంగా ఉధృత మౌతున్న జాతీయోద్యమ ప్రభావంతో దీని పరిధి విస్తృతం కాసాగింది. "తొలి దశలో స్వాతంత్ర్యం అంటే ఆంగ్ల ప్రభుత్వ సార్వభౌమాధికారాన్ని అంగీక రిస్తూనే అంతరంగిక పరిపాలనాది వ్యవహారాలతో స్వేచ్ఛను సాధించడమన్న మాట. ప్రజా సంక్షేమ కరములైన రాజకీయ సంస్కరణలను సాధించడమే ఆనాటి జాతీయోద్యమ లక్ష్యం. ఆ పరిమిత లక్ష్యసాధన కోసమే జాతీయ కాంగ్రెస్ ఆవిర్భవించింది."[29]

ప్రతి సంవత్సరం దేశంలోని ఏదో ఒకచోట కాంగ్రెసు మహాసభలు జరిగేవి. దాదాపు ఇరవై ఏళ్ళపాటు కాంగ్రెస్ మహాసభలు జరిపిన చోటల్లా సంచలనం సృష్టిస్తూ తీర్మానాలు గైకొని ప్రభుత్వానికి అర్జీలు, వినతి పత్రాలు సమర్పిస్తూ ఎంతో కొంత రాజకీయ సంచలనాన్ని సృష్టించేవారు. ఈ పరిస్థితి ఎంతోకాలం కొనసాగలేదు. కాంగ్రెసులో అతివాద, మితవాద ధోరణు లేర్పడ్డాయి. సంపూర్ణ స్వాతంత్ర్య సాధనమే పరమ లక్ష్యమైంది. గాంధీగారి ప్రవేశంతో కాంగ్రెస్ సత్యాహింసలు ఆయుధాలుగా పోరాటాన్ని సాగించి, చివరకు దేశదాస్యం తొలగేవరకు విశ్రమించలేదు.

కృష్ణారావుగారి సంపాదకీయాలలో కాంగ్రెసును వెన్నుతట్టి ప్రోత్స హిస్తూ ముందుకు నడిపించిన ఘట్టాలు ఎన్నో ఉన్నాయి. కాంగ్రెసు పార్టీలోని అంతఃకలహాలను నిర్భయంగా వెలికితీసి పరిష్కారాన్ని సూచించడం, కాంగ్రెస్‌వాదులైనప్పటికీ ఎంతటివారినైనా అవినీతి, అక్రమం కనిపిస్తే వారిని

నిలదీసి మందలించడం గమనించవచ్చు. జాతీయోద్యమంలో భారత జాతీయ కాంగ్రెసుస్థానాన్ని నిరూపించడానికి ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయాలు ఎంతగానో దోహదపడుతాయి.

"కాంగ్రెసు యొక్క సాధన విధానముల యందే కాంగ్రెసు యొక్క శక్తి యంతయు గర్భీకృతమై యున్నదని కొంచెము పరిశీలించినచో బోధపడ గలదు. కాంగ్రెసు పోరాడుచున్నది రాజ్యాంగ సంస్కరణములకొరకు గాదు. కాంగ్రెసు ఉన్నత పదవుల నాశించదు. బాధ్యతతో కూడిన ప్రభుత్వముతో సంతృప్తి నొందదు. ఇంగ్లాండుతో సంబంధమును విడగొట్టుకొనుట అంత కంటెను గోరదు. కాంగ్రెసు యొక్క లక్ష్యము సంపూర్ణ స్వరాజ్యము. భారత జాతియొక్క సమస్తశక్తులు నిరభ్యంతరముగ స్వధర్మానుగుణముగ, వికాసము నొందుటకు దగిన స్వేచ్ఛను కోరుచున్నదే గాని తక్కుంగల విషయముల నేమియు గోరుటలేదు. ఈ లక్ష్యము సామాన్యమైన జాతీయ భావములతో గూడి నదికాదు. 'నేషనలిజము' అనుటతోడనే జాతీయాహంకారము స్ఫురించును. హిందూదేశ మెప్పుడును అట్టి దురహంకారము నెరుగదు....ఇప్పుడు ప్రపంచం లోని నిజమైన స్వజాతీయ ధర్మమును విశ్వకల్యాణదృష్టితో నన్వయము చేసి చూపగలిగిన సంస్థ యేదైన నున్నయెడల అయ్యది 'ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' మాత్రమే"నని ప్రతిపాదించారు.[30]

"బలి! బలి!"[31] అనే శీర్షికతో వ్రాసిన ఒక సంపాదకీయంలో గౌహతిలో సమావేశంకానున్న కాంగ్రెస్‌ను సంబోధిస్తూ, దేశంలో ముందుగా కుల, మత, వర్గ వైరాలను రూపుమాపేందుకు అది కృషి చేయాలని హెచ్చరించారు. "గౌహతిలో కాంగ్రెసు సమావేశము కాబోవుచున్న తరుణమున ఢిల్లీయందొక మహమ్మదీయ హంతకుడు శ్రద్ధానంద స్వామిని రివాల్వరుతో కాల్చిచంపెనను దారుణవార్త మహాజ్వాల వలె దేశము నంతయు నలముకొనెను.... శ్రద్ధానంద స్వాములు గతించినందు కెక్కువ దుఃఖించ వలసిన పనిలేదు....యావజ్జీవితము దేశముకొరకు ధారపోసిన త్యాగధనులు. అట్టి మహనీయుని నిర్యాణము ఆనందదాయకమే కాని, శ్రద్ధానందస్వామికి నేడు వాటిల్లినది సహజ మృత్యువు కాదు. హిందూ మహమ్మదీయ వైరమునకు శ్రద్ధానందుడు బలియయ్యెను. ఘోరమైన బలి. భయంకరమైన బలి. దేశము నంతయు గగ్గోలు పెట్టుచున్న

బలి. భారత వర్షమున కింకను ఇక్కట్లు తప్పలేదు. ఇట్టి వైరములచేతనే దేశము దాస్యబంధనముల చిక్కినది. ఎప్పటికైన నీ యభాగ్య దేశమునకు మతవైరములనుండి యీ కుల వైషమ్యములనుండి విముక్తి కలదాయని నేడు తల్లి శ్రద్ధానందస్వాముల కళేబరమును తన యంకమున బరుండ బెట్టుకొని యాక్రందించుచున్నది."

రాజకీయ పరమైన అంశాలతో వ్రాసిన సంపాదకీయాలు మళ్ళీ మూడు విధాలు. ప్రాంతీయములు, జాతీయములు, అంతర్జాతీయములు.

ప్రాంతీయ (Local Politics) సమస్యలను గురించి, ప్రాంతీయ సభలు సమావేశాల గురించి, వాటి ఆందోళనోద్యమాలను గురించి వ్రాసినవి మొదటి కోవకు చెందినవి. ఈ విభజనలో గ్రామస్థాయి మొదలు రాష్ట్రస్థాయి రాజకీయాల గూర్చిన పరిశీలన, విమర్శ ఉంటుంది. వారి సమస్యలపై, వివాదాలపై ఉపయుక్త సమాలోచనలు జరిపి వారిలో జాతీయ స్ఫూర్తిని కలిగించడం కృష్ణారావుగారి సంపాదకీయాలలో కనిపిస్తుంది. ప్రాంతీయ మండలులను, కుల సభలను నిర్మొహమాటంగా ఆయన పక్షపాత రహిత ధోరణితో విమర్శించేవారు. 'తెలగ మహాసభ'[32] శీర్షికతో వ్రాసిన ఈ సంపాదకీయంలోని కొన్ని పంక్తులు గమనించదగినవి :

"ఈ నెల 7 వ తేదీన బందరులో సమావేశమైన ప్రథమ తెలగ మహాసభ, నేడు దేశములో అన్నివైపుల వ్యక్తమగుచున్న జాతీయ జాగరణమునకు నిదర్శనముగ నున్నది... తెలగ మహాసభకు సుమారు మూడు వేలమంది కాపు మహాజనులు విచ్చేసిరి.....వీరు ఆంగ్ల భాషా సంపర్కము గలవారు కారు. సామాన్యముగ రాజకీయరంగమందు వేషాభినయ ప్రదర్శనములను గావించు నాయకులు కారు. ఏ కొలది మంది యో అట్టి విద్యాధికులును వచ్చి యుండిరి. కానీ విశేషజనము అచ్చకాపులు, భూస్వాములు, కృషీవలులు కాయకష్టములచే జీవించు సచ్ఛూద్రులు. వీరిలో గొందరు విద్యాధికుల నాగరికుల వేషముల ననుకరించినను, వారి వర్చస్సు మాత్రము విద్యాధికులలో వలె వాడిపోయి యుండలేదు........యాత్రికులారా! మీమీ కులము లొసంగ గల కానుకలతో, మీ కులగీతములను బాడుకొనుచు, మాతృదర్శనము కొరకు అడుగిడుడు తల్లి మిమ్మల నందరను ఒక్క ప్రేమాశ్లేషణమున గౌగిలించుకొని, ఆశీర్వదించి,

ధన్యులుగ జేయగలుగును. భయపడకుడు" అని అభయ మిచ్చారు. వీరేశలింగం పంతులు గారి శిలావిగ్రహాన్ని రాజమహేంద్రవరంలో ప్రతిష్ఠించ దలచిన సందర్భంగా వ్రాసిన సంపాదకీయంలో "ఈ విగ్రహమును బ్రతిష్ఠించుచున్నది మాడర్న్ రివ్యూ పత్రికాధిపతులును, జగద్విఖ్యాతులును అగు రామానంద చటోపాధ్యాయులు. ఈ పవిత్ర కార్యమును మన కెక్కువ సన్నిహితులైన న్యాపతి సుబ్బారావు పంతులు, రఘుపతి వేంకటరత్నం నాయుడు గారల వంటి ఏ ఆంధ్ర భీష్ముల చేతనైనను జరిపించిన ఎక్కువగా నానందించెడివారము" అని నిర్ద్వంద్వంగా విమర్శించారు.

స్థానిక స్వపరిపాలనము, దేశీయ సభ్యుడు, గ్రామోద్యోగములు, ఆంధ్రమహాసభ, కృష్ణా గుంటూరు మండల సభలు మొదలైన వ్యాసాలెన్నిటిలోనో ప్రాంతీయ సమస్యలను చిత్రించారు.

'ఆంధ్రరత్న' బిరుదాంకితులైన దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు 'రామదండు' స్థాపనతో, చీరాల, పేరాల పన్నుల నిరాకరణోద్యమంతో అఖిల భారత స్థాయిలో జాతీయ స్వాతంత్ర్య చరిత్రలో సుస్థిరస్థానం సంపాదించుకున్నారు. 'చీరాల నాయకుడు'33 పేరుతో వ్రాసిన ఒక సంపాదకీయంలో కృష్ణారావుగారి అకుంఠిత దేశభక్తి, ప్రాంతీయ, జాతీయ సమస్యల పట్ల వారికున్న సదవగాహన ప్రకటిత మౌతుంది. ప్రభుత్వం గోపాలకృష్ణయ్యగారిని బంధీచేసి కోర్టుకు హాజరుపరచగా, ఆయన న్యాయవిచారణానంతరం బోను నుండి ఈ విధంగా పలికారు: 'నా నేరము నా దేశముననే కాక మ్యాజిస్ట్రేటు గారి దేశమగు ఐర్లాండునకు తుదకు ఇంగ్లాండు దేశమునకును గూడ మోక్షము నొసంగగలదు' అని గోపాలకృష్ణయ్యగారు గద్గద స్వరముతో బలికిరి. వీరు చేసిన నేరమేమి? ప్రభుత్వముపై ప్రేమాభావమును బురికొల్పిరట.... ఎంత ఘోరమైన నేరము! ప్రభుత్వమనగా ప్రస్తుత ప్రభుత్వ విధానమని నిర్వచింపవలెనేగాని, ఇంకొక విధమున అర్థము చేయుటకు వీలులేదు. ప్రభుత్వమును ప్రస్తుత పరిపాలనా క్రమమునుండి విడదీసినచో మిగులునదేమి? గవర్నమెంటను మానసిక వ్యవస్థ. అట్టి వ్యవస్థకు గోపాలకృష్ణయ్యగారు విరోధులు కారు. వీరరాచకులు కారు. ఏ విధానము క్రింద దేశీయుల స్వభావ ధర్మములకు హానికరములగు జాతీయవిద్య నొసగబడు

చున్నదో, ఏ విధానముచే దేశీయుల శిల్పకళా చాతుర్యము నశించి హిందూదేశము పాశ్చాత్య పారిశ్రామిక సంఘట్టనమున దగుల్కొనుచున్నదో, ఏ విధానమువలన భారత వర్షము నానాటికి దరిద్రవంతమైన క్షామదేవతకు బుట్టినిల్లైనదో, ఏ విధానముచే హిందూదేశీయుల సంఘవికాసము పరంపరాను గతమైన ఐతిహాసికధార ననుసరింపక, వికృత సాంకర్యరూపము దాల్చు చున్నదో, ఏ విధానము భారత వర్షము, ధర్మ సామ్రాజ్యము నందీశ్వరోద్దిష్ట మైన గురుపీఠ మలంకరించుటకు అడ్డుపడుచున్నదో, ఏ విధానము ముప్పది కోట్ల భారతీయులను నిరస్త్రులనుగజేసి నిర్వీర్యులనుగ జేసివైచెనో, అట్టి విధానము యెడల అసంతృప్తిని గలిగించుటయే నేరమైన యెడల ప్రచారకు లెల్లరు ఈ మహా దోషమునకు బాల్పడినవారేయని ఘంటాపథముగ జెప్పు చున్నాము" .... ఈ గంభీర వేదనా భరిత వాక్యాల వెనుక కృష్ణారావుగారి హృదయఘోష ధ్వనిస్తుంది. గాంధీ తత్త్వాన్ని జీర్ణించుకొన్న ఆయన కోరింది భారత వర్షానికి రాజకీయ సంబంధమైన హక్కులు మాత్రమే కాదు. భారత భూమి తన చరిత్రకనుగుణమైన స్వభావపరమైన, స్వధర్మ వికసన కారణ మైన పరిపూర్ణ స్వాతంత్ర్యం. ఆత్మను కోల్పోయిన పిమ్మట రాజ్యం సిద్ధించి నప్పటికీ ఫలితం లేదని ఆయన ప్రగాఢ విశ్వాసం

అంతర్జాతీయ సంఘటనల పట్ల, విభిన్న దేశాల సభ్యతా సంస్కారాల పట్ల కూడా కృష్ణారావు గారి హృదయం ప్రతిస్పందించింది. భారత దేశ పరిపాలనా సంబంధమైన బాధ్యతల నిర్వర్తించేందుకు వచ్చిన ఆంగ్లేయ రాజ్య ప్రతినిధులపైన, ప్రపంచ యుద్ధాల సందర్భంగా వివిధ దేశాలపైన ఆయన కొన్ని సంపాదకీయాలు వ్రాసారు. డాక్టరు సన్-యట్-సేన్, డిలివెరా సభాపతి, ప్రసిడెంట్ విల్సన్. రూజ్‌వెల్ట్ సభాపతి, డాక్టర్ అన్సారి, సైమన్‌దొర, ఫ్రాంకో విద్రోహి, ముసోలిని విజిగీష, హిట్లర్ గర్గోలు, స్టేలిన్ నయకౌశలం మొదలైనవి పాశ్చాత్య వ్యక్తుల, వ్యక్తిత్వాలపై వ్రాసినవి. టర్కీ, జపాన్, కెనడా, ఫ్రాన్సు మొదలైన దేశాలపై యుద్ధ సమయంలో యుద్ధ క్రమాన్ని వివరిస్తూ వ్రాసిన సంపాదకీయాలు కొన్ని ఉన్నాయి.

'డెమాక్రసీ'34 శీర్షికన వ్రాసిన ఒక సంపాదకీయంలో ప్రపంచ దేశాల రాజ్య తంత్రాలను 'డెమాక్రసీ' పట్ల వారి అవగాహనను వివరిస్తూ ఆశియా

ఖండానికి పార్లమెంటరీ వ్యవస్థ సరిపడదన్న వారి వాదనను తీవ్రంగా ప్రతిఘటించారు. "ఫ్రాన్స్, జర్మనీ, ఇంగ్లాండు, అమెరికా, ఆస్ట్రేలియా, కెనడా మొదలగు దేశముల రాజ్యాంగము లన్నియును ఒక మాదిరివి కాకపోయినను, నవి మొత్తము మీద 'డెమొక్రాటికు' పద్ధతిని అనగా ప్రతినిధి సభలకు పార్లమెంటరీ వ్యవస్థలపై నెలకొల్పబడినవి. రాజ్యములోని ప్రతి తెగ యొక్కయు స్వప్రయోజనమును, ప్రతి పౌరుని స్వత్వమును ప్రతిబింబించ గల పార్లమెంటరీ పద్ధతియే ఇంతవరకును పాశ్చాత్య రాజనీతి కనుగొనిన రాజ్యతంత్రము. లాయిడు జార్జి మొదలగు ఆంగ్లేయ మంత్రిపుంగవులు గత యుద్ధమునకు నీ డెమాక్రసీయె "make the world safe for Democracy" పరమ లక్ష్యమని కంఠోక్తిగ బలుకుచుండిరి. ఆశియా ఖండ మనాది నుండియు నిరంకుశ పద్ధతి కభ్యాసపడి యుండుటచే నీ ఖండము నందు పార్లమెంటరీ వ్యవస్థలు వర్ధిల్లనేరవని చెప్పుచుండిరి....తమ దేశములో లేని డెమాక్రసీని హిందూ దేశీయు లర్థము చేసుకొని యాచరించు వరకు విజాతీయాధిపత్యము తప్పదనుటకంటే పరిహాసాస్పదమైన విషయము మరి యొకటి లేదు" అంటారు.

పాశ్చాత్య మనీషులపై వ్రాసిన సంపాదకీయాలలో ఆయా సందర్భాను సారంగా వారి గుణగణాలను, వ్యక్తిత్వాలను సమగ్రంగా చిత్రించడం కనిపిస్తుంది. రష్యను రిపబ్లికు మొదటి అధ్యక్షుడైన లెనినుపై వ్రాసిన వ్యాసంలో అతని శీలాన్ని వ్యక్తిత్వాన్ని సమగ్రంగా వర్ణించారు.[35] "....తా దలపెట్టిన కార్యము విజయవంత మొందువరకును, తదేక దీక్షతో పనిచేయువాడు లెనిను. ఇదియే అతని శీలము నందలి ముఖ్యాంశము.... లెని నొకవిధమైన చిత్రముగ నవ్వుచుండెడివాడు. ఆ హాస్య మొకవంక సామాన్య జనుల బుద్ధిహీనత కసహ్యము చెందుచున్నట్లు, మనః కల్మషమును వెలిబుచ్చుచుండియు మరియొక వంక మనః పూర్వకముగ నున్నటుల గన్పట్టుచుండెను. లెనిను యొక్క మహాహంకారమా నవ్వులో ప్రతిఫలించు చుండెడిది.... అతడు చిన్న పిల్లలను చాల ముద్దు చేసెడివాడు. ఎంతయో సుకుమారులగు శారీరక భంగిమలతో వారిని ముద్దిడుకొనుచుండెడివాడు....... రాజ్యాంగ విషయములో లెనిను తిరుగుబాటు వస్తాదని చెప్పవచ్చును....... ధనవంతులన్నచో నసహ్యము, పొదుపరితనము, వ్యవహారపు మెళకువ యందు

నేర్పరితనము, ధైర్యము రష్యా పౌరునకు సహజములైన యీ గుణములు లెనినుయందు మూర్తీభవించి యున్నవి. దీనితోబాటు లెనిను తన మనో నిశ్చయమును, భావనా వేగమును జోడించి ప్రతిభావంతుడైనాడు" అని కృష్ణారావుగారు అన్ని కోణాల నుంచి లెనిన్ వ్యక్తిత్వాన్ని పరిశీలించి ప్రదర్శింపజేసారు.

## V. వ్యక్తి విషయకములు

"మనిషి, మనీషి ఈ రెండు పదాలు దాదాపు ఒకేమాదిరిగా వినిపిస్తాయి. వినిపించటంలో వీటిరెంటికీ ఉన్న తారతమ్యం అతిస్వల్పం. కానీ అర్థంలో మాత్రం ఈ రెంటికి ఉన్న తారతమ్యం అత్యధికమైంది. మనిషిగా జన్మిస్తాడు ప్రతి మానవుడు. చాలామంది మనిషిగానే నిలిచిపోతారు. కొద్దిమంది మాత్రమే మనీషిగా రూపాంతరం చెందుతారు, మనిషిలో ఉన్న గుణాలన్నీ, మనీషిలో ఉంటాయి. అయితే ఆ గుణాలతోనే ఆగిపోతే మనిషి మనీషి కాజాలడు. అంతకుమించిన గుణాలు ఉంటేనే మనీషి అయేది"36 అంటారు సంజీవదేవ్ గారు.

"పురుషులందు పుణ్యపురుషులు వేరయా" అన్నట్లుగా విభిన్నరంగాలకు చెందిన మనీషులు విశ్వగర్భంలో జనించి విఖ్యాతులయ్యారు. వారి ఆదర్శాలను, వారి వ్యక్తిత్వాలను సదా స్మరించుకోవటం ఉత్తమ సంస్కారం. కృష్ణారావుగారు స్వాతంత్ర్యసంగ్రామ సమయంలోను, అంతకుపూర్వంలోనూ భారతదేశానికి కీర్తి గౌరవాలను కలిగించిన మనీషులను తమ సంపాదకీయాలలో ప్రస్తుతించారు. దేశవిదేశాలకు చెందిన ఎందరో మహానుభావులను గూర్చి ఆయా సందర్భాలలో వివరించారు. వ్యక్తిగతమైన ఈ సంపాదకీయాలను ప్రధానంగా నాలుగు విధాలుగా పేర్కొనవచ్చు:

1) విభిన్న వ్యక్తిత్వం కలిగిన వ్యక్తులను గూర్చి, వారి మనస్తత్వాన్ని గూర్చి వ్రాసినవి. వ్యక్తులు, వారు నిర్వహించిన ఉద్యమాలు కూడా ఈ విభాగంలోకే వస్తాయి.
2) ఆయా సందర్భాలలో వ్యక్తులకు సంప్రాప్తించిన గౌరవాగౌరవాలను పరామర్శిస్తూ వ్రాసినవి.

3) స్మృతిపరమైన వ్యాసాలు.

4) గుణగణాలలోని భేదసాదృశ్యాలను, వ్యక్తిత్వంలోని నిమ్నతౌన్నత్యాలను తులనాత్మకంగా పరిశీలించి వ్రాసినవి.

శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానందుల అపూర్వ సంగమాన్ని వర్ణిస్తూ "ప్రాచీన భారత వర్షమును జూడవలెననిన, గ్రంథములకు బోనక్కర లేదు..... ఇక్కడ దక్షిణేశ్వరమున పరమహంసుల వారియందు ఆ ప్రాక్తన ఆర్యాగ్ని, ఆ సనాతన ధర్మనిరతి, ఆ ప్రాచీన బ్రహ్మనిష్ఠ, ఆ యుదార విశ్వ భావము నిర్ధూమ ధామముతో, అమరతేజస్సుతో, ప్రత్యక్షముగ బ్రకాశించు చున్నది. ఇయ్యది సజీవము, సచేతనము, జ్వాలంతము, ప్రత్యక్షము. వివేకానందు డన్ననో ఆధునిక భారత వర్షము యొక్క మూర్తి. వర్తమాన కాలము యొక్క జిజ్ఞాస, దుఃఖము, ఆవేదనము, ఉద్బోధనము, అస్పష్టత, పరివర్తనము, దురాకాంక్ష, ఉద్దామము, యుక్తివాదము, భౌతిక పరిజ్ఞానము వివేకానందునియందు విశేషపరిణామమున ఆకారము నొందెను. ప్రాచీన నవీనముల సమ్మేళనము పరమహంస, వివేకానందులవారి సంయోగము కంటె నెక్కువగ నెక్కడను కన్పట్టదు"37 అని విశ్లేషించారు.

వ్యక్తిలో పైకి కన్పడే గుణాలకు భిన్నమైన, విలక్షణమైన మానసిక తత్త్వాన్ని విశ్లేషణాత్మకంగా వివరించడంలో కృష్ణారావుగారు ఆరితేరినవారు. స్వాతంత్ర్య రథసారథియైన మహాత్ముని అవతార రహస్యాన్ని వివరిస్తూ ఇలా అంటారు. "బక్క మనిషి, పొట్టివాడు, దుర్బల శరీరుడు - భౌతిక విగ్రహ మెవ్విధమున చర్మ చక్షువులకు ఆకర్షణీయంగా నుండదు. కానీ యా యల్పోపాధి యందేదియో యొక దివ్యజ్యోతి, ఒక అద్భుతశక్తి, ఒక పవిత్ర భావము జాజ్వల్యమానముగ బ్రకాశించి ప్రపంచదృష్టి సంతను ఆకర్షించుచున్నది" అని అంటూనే అతడు అవతారపురుషుడు అన్న మాటను తర్కసహేతుకంగా వివేచిస్తారు. "మహాత్ముడు అవతార పురుషుడని అట్టి లోకోద్ధారకుడని ఎట్లు నమ్మగలము? భక్తుడు కావచ్చును. త్యాగి కావచ్చును. ధైర్యశాలి కావచ్చును. రాజకీయాందోళకుడు కావచ్చును. అంతమాత్రముచేత నీతడు అవతార పురుష డను దివ్యనామము బడయుటకు అధికార మెక్కడిది?" అని ప్రశ్నిస్తూనే చందన తరువు నేపేరుతో పిలిచినను దాని పరిమళము మారనట్లు మహాత్ముని

అవతార పురుషుడన్ననూ కాదన్ననూ ఆతని కేలోటు రాదని వివరిస్తారు. విరాట్పురుషుడు చాతుర్వర్ణ్యాల కాధారభూతుడై వానియందు సామరస్యాన్ని పొందినట్లు ప్రతి వ్యక్తి చాతుర్వర్ణ్యాల ధర్మాలను ఏకోన్ముఖమునకు తెచ్చి విరాట పురుషుని ప్రతిబింబింప జేయుటకు అవకాశము కలదని పేర్కొంటారు. మహాత్మునిలో చాతుర్వర్ణ్యములు, చతురాశ్రమములు సమానంగా మూర్తీభవించి యున్నాయి. బ్రహ్మచర్యము, సాత్వికాహారము, అహింసా పథము, ఉపవాసము, మౌనవ్రతము, జపతపములు, సత్యాగ్రహము, లోక సంగ్రహము, వాని ఆధ్యాత్మిక శక్తిని నిరూపిస్తున్నవని పేర్కొని మహాత్ముడు నిజంగా అవతార పురుషుడేనని నిరూపిస్తారు.38

గాంధిమహాత్ముడు దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహయుద్ధం ద్వారా జరిపిన శాంతిపోరాటంలో విజయం సాధించి భారతదేశానికి తిరిగివచ్చి (1915 ప్రాంతంలో), భారత రాజకీయాలలో చురుకుగా పాల్గొనడంతో జాతీయోద్యమానికి కొత్త ఊపు, ఊపిరి వచ్చింది. సత్యాహింసలు, రాట్నం వ్యాప్తి, స్వదేశీయ వేష భాషా వ్యాప్తి, దేశీయోత్పత్తుల వినియోగం, విదేశీ వస్తువస్త్రాల బహిష్కారం, సహాయ నిరాకరణం, అస్పృశ్యత, మద్య పాన నిషేధం, హిందూ మహమ్మదీయ సఖ్యత మొదలైన ఉద్యమాలతో సత్యాగ్రహాలు నిర్వహించి సత్యం, శాంతి, దయ, ఉపవాసం, ఆత్మ సంయమనం వంటి ఉత్తాల హిమవన్నగ సన్నిభమైన ఆదర్శాలతో, అన్నది ఆచరించి చూపి రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్యానికి సింహస్వప్నంగా మారాడు. భారతీయుల ఆశాజ్యోతిగా వెలిగాడు. ఆయన ఆదర్శాలకు, సిద్ధాంతాలకు బహుళ ప్రచారమిస్తూ కృష్ణారావుగారు శరపరంపరగా వ్యాసాలు వెలువరించారు. గాంధీగారు యంగ్ ఇండియా,హరిజన్ పత్రికలలో ఇతరత్రా వ్రాసిన వ్యాసాలు,చేసిన ఉపన్యాసాలు కృష్ణా పత్రికలో ప్రచురించేవారు. కృష్ణారావుగారు గాంధీ తత్త్వానికి కొత్త భాష్యాలు చెప్పారు. కృష్ణా పత్రికలో గాంధీ గారిపై వ్రాసినన్ని సంపాదకీయాలు మరెవరిపైనా వ్రాయలేదు."ఖద్దరు,మద్యపాన నిషేధము, అస్పృశ్యతా నివారణము, సేవాదళ సమావేశము, వ్యాయామ ప్రచారము మున్నగునవి అసహాయ యోగములు....సాధనలు రెండు విధములు శమము, దమము. ఒకటి బహిరింద్రియ నిగ్రహము రెండవది యంతరింద్రియ నిగ్రహము. భారత జాతి యందు ఖద్దరుసు తెలిసి కట్టిన వారికి శమదమములు అలవడుననుట నిస్సంశ

యము. ఇక వానికి సత్యము, నహింసయు దోడైనచో జెప్పవలయునా? మద్య పాన నిషేధము కూడ నట్టిదే. ప్రజా స్వరూపమే విష్ణువు. కనుకనే మహాత్ముడు దరిద్ర నారాయణుని ఆరాధించు చున్నాడు"[39] అని వ్యాఖ్యానించారు గాంధీ గారి ఆమరణ నిరాహార దీక్ష సందర్భంగా వ్రాసిన సంపాదకీయాలలో ఆయ నను ఋషికల్పునిగ, శ్రీరామ, శ్రీకృష్ణ, గౌతమ బుద్ధులతో సరిపోల్చటం గమనించవచ్చు.

విశ్వకవి రవీంద్రునిపై వ్రాసిన సంపాదకీయాలలో రవి కవి సాధించిన కవితా దిగ్విజయాన్ని సవిమర్శకంగా చర్చించారు. అందులో ఒకచోట "కవి రసగ్రాహి, విశ్వజనుడు, భోగి, సృష్టికర్త" అని పేర్కొంటూ "రవీంద్రుని కవిత్వము పరిణతావస్థ నొందినది. కావుననే రవీంద్రుడు ఋషి"[40] అని నిరూపించారు.

వ్యక్తి విషయకంగా వ్రాసిన సంపాదకీయాలలో ఆయా వ్యక్తుల మానసిక సంఘర్షణలను వారి చిత్ర విచిత్ర ప్రవృత్తులను ప్రదర్శింప జేసే వారు. శ్రీనివాస శాస్త్రిగారిపై వ్రాసిన ఒక సంపాదకీయంలో[41] "బడిపంతులుగ నుండవలసిన శ్రీనివాస శాస్త్రి లండనులోని సామ్రాజ్య పరిషత్తు నలంకరించు అదృష్టము పట్టినది. అదృష్ట మేమని ప్రశ్నింపకుడు! వారందుకు తగరని కాదు" అంటూనే "విద్యుద్దీపములు ఆకాశము నందలి నక్షత్ర గణములను చూచి, అవి తమవలె ప్రకాశించుట లేదని మురియుచున్నట్లు ఒక జపాను కవి వర్ణించియున్నాడు. మన శాస్త్రి గారి ఆత్మవిశ్వాసము కూడ నీ విద్యుద్దీపము లను బోలియున్నది. తమ గౌరవాధిక్యతల యందే భారత వర్షము యొక్క గౌరవము కలదని వీరి యభిప్రాయము. అంతియ కాని, భారత వర్షముయొక్క గౌరవము నందే తమ గౌరవము కలదను భావము వీరికి గలుగలేదు" అని అధిక్షేపిస్తారు.

"కల్యాణానంద భారతీమంతాచార్యులవారు"[42] అన్న శీర్షికతో వ్రాసిన సంపాదకీయంలోని ఈ విమర్శ గమనించదగినది:

"కలియుగములో నిషిద్ధమైన సన్యాసధర్మమే నేడు తారుమారైనదని కొంచె మాత్మ పరీక్ష జేసికొనిన హృద్గతము కాగలదు. నేడు పీఠాధిపతులెల్లరు

రాజ్య భ్రష్టులైన పెన్షనుదారుల వలె నిర్వీర్యులై, నిస్తేజులై హిందూ సమాజ మును ధర్మపథమున నడిపింపలేని దుర్గతి నొందుచున్నప్పుడు తా మొక్కరే జగద్గురు బిరుదమునకు అర్హులైనట్లు ప్రకటించుకొనుట కేవలము పరిహాసా స్పదము. సర్కారు వారి కొలువులో జేరిన బొబ్బిలి జమీందారుగారు 'చతు రంబోధి పరీత భూవలయ సామ్రాజ్యాధీశుల' మని వర్ణించుకొనిన ఎంత నగుబాటుగ నుండునో, వీరును జగద్గురువు లని బిలుచుకొనుట అంతకంటెను ఎక్కువగ వింతగ నుండును" అని అన్నారు.

ప్రత్యేక సందర్భాలలో వ్యక్తులపై వ్రాసిన సంపాదకీయాలలో రవీంద్ర కవీంద్రుని కవిత్వ దిగ్విజయము (I, II, III), మాంటెగ్యూ గారి ఉపన్యాస ములు, హోమ్ రూల్ సందర్భంగా అనిబిసెంటమ్మ గారిపై వ్రాసిన సంపాద కీయాలు, కొప్పరపు - తిరుపతి కవుల మధ్య చెలరేగిన వివాదాలపై వ్రాసిన వ్యాసాలు, సైమన్ కమీషన్‌కు నిరసనగా వ్రాసిన వ్యాసాలు, సుభాషుని రాజకీయ జీవితాన్ని, ఒడుదుడుకులను ప్రదర్శించెవి, చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి గారి షష్టిపూర్తి సందర్భంగా వ్రాసిన "సరస్వతీ పూజ" వ్యాసం, వాగ్గేయకారుడు హరి నాగభూషణం గారి సన్మాన సందర్భంగా వ్రాసిన వ్యాసం, జిన్నాజీ! ఇదిగో నా అర్జీ, జిన్నాగారి జిత్తులు, జిన్నా తమ్ములు మొదలైన వ్యాసాల నెన్నిటినో ఎత్తి చూపించవచ్చు.

వ్యక్తులవలెనే ఆయా ప్రదేశాలకు వివిధ సందర్భాలలో కలిగిన కీర్తి గౌర వాలను పురస్కరించుకొని వ్రాసిన సంపాదకీయాలు కొన్ని ఉన్నాయి. బంద రులో నవ్యసాహిత్య పరిషత్తు వార్షికోత్సవాల సందర్భంగా వ్రాసిన "పేరంటము" వ్యాసం, ప్రపంచ యుద్ధానికి పూర్వం ఎప్పుడూ వినబడని 'జయిటో-వైకాము' గ్రామాల గురించి వ్రాసిన వ్యాసం, కాంగ్రెసు సభలు జరిగిన సందర్భంగా గౌహతి, అలహాబాదు, కలకత్తా మొదలైన ప్రాంతాలపై వ్రాసిన వ్యాసాలు సంపాదకీయాల రూపం సంతరించుకొన్నాయి.

స్మృతి పరములైన సంపాదకీయాలు వ్యక్తులు మరణించినప్పుడు వ్రాసినవి కొన్ని, వర్ధంతుల సందర్భంగా వ్రాసినవి కొన్ని ఉన్నాయి. ఈ విధ మైన వాటిలో కొన్ని మొక్కుబడికి వ్రాసినవిగా కనిపిస్తాయి. కొంతమంది

పరమపదించినప్పుడు వ్రాసిన సంపాదకీయాలు కరుణరసాత్మకాలై హృదయాన్ని కదలించివేసేవిగా ఉన్నాయి. మరికొందరి నిర్యాణంపై వ్రాసిన వ్యాసాలు విచారాన్ని కలిగించే బదులు, వారి ఆదర్శాలపట్ల ఉత్తేజితులమై, ఉద్వేగులమై జాగరితులమయ్యే విధంగా వ్రాసినవిగా ఉన్నాయి.

దేశబంధు చిత్తరంజన్ దాసుగారి మృతికి శ్రద్ధాంజలి ఘటిస్తూ వారి అంతిమ సంస్కారాన్ని హృదయ విదారకంగా వర్ణించారు: "ఆ పవిత్ర కళేబరము చితిపై బరుండ బెట్టినప్పుడు ఆ ప్రజావళి నుండి బయల్వెడలిన దుఃఖరోదన మసదృశము. దేశబంధు వన్నదేమో నాడు సకల జనులకు హృద్గతమైనది. రక్త బంధువుని మరణము కంటే నీ వియోగము ఎల్లరను శోకవహ్ని యందు బేల్చి వేసినది. ఏడు లక్షల గ్రామములలోని సానుతాపమును వెల్లడింపని గ్రామమొకటియు లేదు. సకల పక్షములు సమస్త ప్రాంతము లీ విపత్సమయమున నొక్కటి యయ్యెను."[43]

"ఇంటిపెద్ద చావు పెండ్లి పండుగతో సమాన"మని లోకోక్తి. మరణము శరీరానికే గాని ఆత్మకు లేదన్నది సాధువాదం. మృత్యువు భయంకర స్వరూపిణి కాదు. ప్రేమతో లాలించే మాతృమూర్తి అంటారు కృష్ణారావుగారు. ఒక సంపాదకీయంలో "దయామయి అంటే ఆమెనే అనాలి. ఆ తల్లి స్పర్శ మృదులం; .... ఎంత శీతలం; రోగగ్రస్తములై, జరా జీర్ణములై, శిథిలములై పోయిన శరీరాలతో బాధపడుతున్న బిడ్డలకు, ఆ బాధ తప్పించి మళ్ళీ సరికొత్త శరీరం కల్పించి ఇవ్వాలని తొందరపడే ఆ తల్లి వాత్సల్యమయి కదూ?"[44] అని ప్రశ్నించారు. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు గారి నిర్యాణాన్ని వర్ణిస్తూ "ఒక మహాజ్యోతి అస్తమించి, దేశమున చీకట్లు క్రమ్మినట్లు దుఃఖించుచున్నాము. కానీ పరమపదించినది నాగేశ్వరరావు పంతులు కాని దేశోద్ధారకుడు కాదు, విశ్వదాత కాదు, కళాప్రపూర్ణుడు కాదు. దేశోద్ధారకుడు దేశములోపల శాశ్వతమైన గుడిని నిర్మించుకొని లోకారాధ్యుడైనాడు. ఇక వానికి చావు ఎక్కడ?"[45] అంటారు.

విశ్వకవి రవీంద్రుని నిర్గమనాన్ని భావనాస్ఫూర్తితో అభివర్ణిస్తూ, అనంతాకాశం నుండి హఠాత్తుగా ఒక తార జారిపోవడాన్ని కవితాత్మకంగా

పేర్కొంటారు. "ఏ అదృశ్య హస్తమో ఆ వెన్నెల మొగ్గలను పుణికి తీసుకొని పోయిందనిపిస్తుంది మనకు. కానీ ఆ తార లోకవేళ జారినా, మరొకచోట పొటమరించి చీకటి కోనల్లో చిరువెలుగు లందిస్తూనే ఉంటాయి. దారి తప్పిన పాంథులకు దర్శనమిచ్చి పూలబాటను చూపించుతూ ఉంటాయి"[46] అని ఆత్మకు మరణం లేదని ఒక మహనీయుని మరణం వేరొక మహనీయుని జననానికి నిదర్శనమని ధ్వనిగా వ్యక్తీకరించారు. ఆ వ్యాసంలో రవీంద్రుని సంపూర్ణ సాహిత్య స్వరూపాన్ని, వ్యక్తిత్వాన్ని రమణీయంగా చిత్రించారు.

తమ ఆత్మీయ మిత్రుడు, కోపల్లె హనుమంతరావుగారి అకాల మరణానికి వ్యధితులై "స్వర్గారోహణ"[47] మనే సంపాదకీయం వ్రాశారు. "కడచిన గురువారం మధ్యాహ్నం గం. 1.20 ని॥లకు (కోపల్లె హనుమంతరావుగారు) స్వర్గారోహణం గాంచెను. ఈశ్వరేచ్ఛను శాంతముతో గై కొనవలసియున్నను, మా హృదయ దౌర్బల్యముచే మనమున దుఃఖజ్వాల లెగసిపోవుచున్నవి. ఈ క్రూర వార్తను దెలుపుటకంటె ప్రస్తుత మెక్కువ వ్రాయజాలము" అని విలపించారు.

తిలక్ మహాశయుని నిర్యాణానికి ఖిన్నులై "లోకమాన్యుడు"[48] అనే సంపాదకీయం వ్రాసారు. స్మృతిపరమైన వ్యాసాలలో ఈ వ్యాసం పరమ గంభీరమైనది. "సూర్యమండలమును వట్టికండ్లతో జూడజాలము. కాని ఒక మసీ యద్దము అడ్డము పెట్టుకొనవలెను. అప్పుడే సూర్యభగవానుని జ్వాలాకృతి ఒకించుక గోచరమగును. అటులే మహనీయుల దివ్య మహిమలను సన్నిధాన వర్తులును, సమకాలికులును ప్రత్యక్షముగ జూడజాలరు.... సమకాలికులకు మహాత్ముల నిజతేజోబింబము దృగ్గోచరము కాదనుట నిస్సంశయము. మృత్యుచ్ఛాయలు దిగవలెను. కొంతకాలము గడువవలెను. దురభిమానములు, చిత్త వికారములు, దురహంకారములు మొదలగునవి ప్రేక్షకుల మనములనుండి తొలగిపోవలెను. మహనీయుని సమాధి సమ్ముఖమున నుపవిష్టులమై ప్రశాంత చిత్తముతో ధ్యానము చేయవలెను. అప్పుడు జీవితము యొక్క యథార్థ స్వరూప మొకించుక గోచరము కావచ్చును" అని ఆ సమాధి స్థితిని తామే అనుభవించి లోకమాన్యుని దివ్యరూపాన్ని దర్శించారు. "ఆ దేహము నా తల్లి

యొక్క శరీరమునుండియే కదా ఉత్పన్నమైనది. నా దేశ జనని శరీరము భౌతికమని పరిహసించెదనా? ఈ మృత్తిక, ఈ జలము, ఈ వాయువు, ఈ యగ్ని, ఈ ఆకాశము నా తల్లియొక్క అంగములు. ఆ మహనీయుని శరీరము తిరిగి నా తల్లి యంకముననే విలీనమైనది. ఏది జన్మహేతువో, అదియే చరమ పదము. లోకమాన్యుని భౌతిక విగ్రహమున దేశమాతను జూడజాలని కన్నులు కన్నులు కావు. అందలి ప్రతి బిందువు, ప్రత్యణువు, ప్రతి శ్వాస నిశ్వాసయును తల్లియొక్క గాంభీర్యమును, తల్లియొక్క ప్రేమను, తల్లియొక్క పవిత్రతను చాటినవి. మాతృ రూపమును ప్రత్యక్షము చేయగల దివ్య శరీరుల చరితము లెంత ధన్యములు" అని తన్మయులై కీర్తించారు.

తులనాత్మకంగా వ్రాసిన సంపాదకీయాలలో మాంటెగ్యూ, సైమన్‌లపై వ్రాసిన "అప్పుడు-ఇప్పుడు" వ్యాసం, సైమన్, నెహ్రూలపై వ్రాసిన ఇంకొక వ్యాసం, "భారత శక్తి" పేరిట గాంధి, రవీంద్రుడు, అండ్రూస్‌లపై వ్రాసిన వ్యాసం, "త్రిమూర్తులు" శీర్షికన అనిబిసెంట్, గాంధి, తిలక్‌లపై వ్రాసిన వ్యాసం (హోమ్‌రూల్ సందర్భంగా), ద్వితీయ ప్రపంచ సంగ్రామం సందర్భంగా మరొకమారు "త్రిమూర్తులు" పేరిట రూజ్‌వెల్టు, స్టాలిన్, చర్చిల్‌లపై వ్రాసిన వ్యాసం, ముసలోని, హిట్లర్‌లపై వ్రాసిన వ్యాసం పేర్కొనదగినవి. ప్రతి వ్యాసంలోనూ వైయక్తిక విషయాలలోని వైవిధ్యాలను చక్కగా చిత్రిక పట్టడం గమనించవచ్చు. కృష్ణారావుగారి ప్రతిభకు, విమర్శనా శక్తికి ఈ వ్యాసాలన్నీ గీటురాళ్ళే.

## vi. ఆర్థిక విషయకములు

ఒక దేశం లేదా రాజ్యంయొక్క సమగ్రస్వరూపాన్ని వివరించవలెనంటే వాటి ఆర్థిక విషయాలను ప్రస్తావించక తప్పదు. ఆర్థికస్థితిగతులపైనే ఆ దేశ భవితవ్యం, కీర్తిగౌరవాలు ఆధారపడి ఉండటం స్వాభావికం. ఆర్థిక ప్రగతి పైనే సమాజ ప్రగతి ఆధారపడి ఉంటుందని ఆధునిక రాజనీతిజ్ఞులూ ఒప్పుకొంటారు. వినియోగము, వినిమయము ఆర్థిక ప్రగతికి రెండు ముఖాలు. కేవలం ధనమే కాకుండా ప్రాకృతిక సంపదల వినియోగంవల్ల కూడా దేశం సుసంపన్నమౌతుంది. "రత్నగర్భ"గా పేరుగాంచిన భారతభూమి, విదేశీయుల దండయాత్రలతో, దోపిడీలతో కొల్లగొట్టబడి నామమాత్రావశిష్టమైంది.

"అంగళ్ళ రతనాలు అమ్మినారట ఇచట" అని చెప్పుకొని సంతృప్తిపడేస్థితికి చేరుకుంది.

వాణిజ్యం మిషతో మనదేశానికి విచ్చేసిన ఆంగ్లేయులు కోట్లాది రూపాయల ధనాన్ని, బంగారాన్ని, ఇతర వస్తుజాలాన్ని తమ దేశాలకు తరలించుకొనిపోయారు. వారి పాలనలో, ప్రపంచ యుద్ధాల సందర్భంగా దోపిడీకి గురైన మన దేశం గురించి, భరింపశక్యంగాని ఆంగ్లేయాధికారుల వేతనాలు, పింఛనుల గురించి, ప్రకృతి చూసిన చిన్నచూపువల్ల ఏర్పడ్డ దుర్భర క్షామాలను గురించి, ఈతిబాధలను గురించి కృష్ణారావుగారు తమ సంపాదకీయాలలో పేర్కొన్నారు.

ఇంగ్లాండు, భారతదేశాల ఆర్థిక సంబంధాన్ని వివరణాత్మకంగా విశ్లేషిస్తూ "మొత్తముమీద ఈ దేశములో నున్న బ్రిటిషు ఉద్యోగుల సంఖ్య బహుస్వల్పము. సివిలు, మిలిటరీ ఉద్యోగులును, తెల్లని సైనికులును గలిసి ఒక లక్షకులోపు. కేవలము వీరిని, వీరి సంసారములను పోషించుటకే కాదు వారీ దేశమును భుక్తపరచుకొనినది. ఇంగ్లాండు వర్తకుల దేశము. వాణిజ్యము వారి పురుషార్థము. ప్రపంచములో ఇండియావలె వారి వాణిజ్యమున కుపకరించు దేశము మరొకటి లేదు. వారి పరిశ్రమలకు ముడివస్తువులు గావలయునా? హిందూ దేశము వారికి దూది, నార, వేరుశనగ, చర్మములు మొదలగు ముడి వస్తువుల నెన్నిటినో ఇయ్యగలదు. బ్రిటిషు షాహుకారుల వడ్డీవ్యాపారమునకు తగిన దేశము గావలయునా? ఇండియా గవర్నమెంటు హామీమీద నీ దేశములో రైళ్ళమీద, గనుల మీద, ప్లాంటేషనుల మీద, ఋణముల మీద, స్టీమర్ల మీద నెంత పెట్టుబడి యైనను పెట్టుట కాస్కారము గలదు. వారి కర్మాగారములలో తయారైన యంత్రపరికరములు, వస్త్రములు నాజూకు సామాగ్రి అమ్ముదగుటకు తగిన అంగడి కావలయునా? యంత్ర పరిశ్రమలెరుగని ముప్పది కోట్ల ప్రజలు వారి నాజూకు వస్తువులను కొని వారిని సంతోషపెట్టగలరు. ఇంగ్లాండునకును, ఇండియాకును గల సంబంధము వాణిజ్య సంబంధము"[52] అంటారు.

"ఏది నిజము"[53] శీర్షికతో వ్రాసిన సంపాదకీయంలో భారతదేశాన్ని పీల్చి పిప్పిచేసిన ఆంగ్లేయ ప్రభుత్వ విధానాన్ని నిరసించడం కనిపిస్తుంది.

ఈ దోపిడీని గణాంక వివరాలతో సహా ఈ వ్యాసం నిరూపిస్తుంది. "....నేత్రములకు రంగు సులోచనములు ధరించినవారికి లోకమంతయు నదే రంగులో కన్పించుట సహజము. ఇండియాలోని సివిలు సర్వీసు ఉద్యోగు లందరును ఆంగ్లేయ వర్తక మహా వట వృక్షమునకు రాజాకీయాధికారము గల ఊడలని చెప్పవచ్చును. రాజకీయముగా ఇంగ్లీషు వారీ దేశమునకు గలిగించు నష్టము లొక లెక్కలోనివి కావు. విదేశీయమైన బ్యాంకులద్వారా, రైళ్ళద్వారా, స్టీమర్ల ద్వారా, వర్తక సంఘముల ద్వారా, ఇన్స్యూరు కంపెనీల ద్వారా, భారత జాతియొక్క ప్రాణరక్తము పీల్చివేయబడుచున్నదనుట యతిశయోక్తి కాదు."

ఇంకా, ఇండియా దొరతనము వారి ఆయవ్యయ వివరములు; ఇండియా దేశపు 66 కోట్ల రూపాయలను లండనులో నిలువచేయుట; కక్కూరితి బంగారము; రు. 1,00,00,000 భారతీయుల పెట్టుబడి ధనము; 150 కోట్ల దానము మొదలైనవి ఆనాటి భారతదేశ ఆర్థిక స్థితిగతులపై కృష్ణారావుగారు వ్రాసిన వ్యాసాలు. వర్తకులకు మంచి తరుణము, యుద్ధం, బ్యాంకులు, అధికలాభాలు, కష్టదినాలు (దుర్భిక్షస్థితి), హాహాకారాలు (ఆహారసమస్య), కట్టెల కాటకం మొదలైనవి యుద్ధ సమయంలో ఆర్థిక పరిస్థితిని సమీక్షిస్తూ వ్రాసినవి.

## vii. యుద్ధ - ఉద్యమ పరములు

మానవ ప్రవృత్తిలో దాగి ఉన్న అతి విచిత్రమైన విషయం ఏమిటంటే తమలోతాము ఎంతగా సహకరించుకొని అభివృద్ధిని సాధించగలరో అలాగే తమలోతాము సంఘర్షించుకొని అంత వినాశాన్ని పొందగలరు. కాలం కలిసి రాకపోతే రాజ్యం, రమణి, ధన, కనక, వస్తు, వాహనాది సమస్త విషయాలు మానవుల మధ్య స్పర్థలకు హేతుభూతాలౌతాయి. మానవజాతి పరస్పర సంఘర్షణలోంచే చరిత్ర ఉద్భవిస్తుందన్నది నగ్నసత్యం. ప్రకృతి పైకి ఎంత సత్య శివ సుందరాత్మకంగా భాసిస్తుందో, అంతర్గతంగా అంత అంతస్సంఘర్షణలను పెంపొందిస్తుంది. ప్రళయ విలయహేల పరమశివుని నిత్యకేళీ విలాసంగా ప్రాచీనులు భావించడంలోని ఆంతర్యమిదే కాబోలు. పరదేశీయుల దాడులతో, దండయాత్రలతో, సామ్రాజ్యాధీశుల స్వార్థకాంక్షలతో భారత

భూమి రుధిర ధారలతో తడిసిపోయింది (కాకుంటే కన్నీళ్ళతో). ఆంగ్లేయుల దుష్ట పాలనతో భారతీయులలో పెల్లుబికిన జాతీయాభిమానం వెల్లువలా ఉప్పొంగి పోయింది. జాతీయోద్యమంలో భారతీయులకు మహాత్ముడు ప్రసాదించిన అపూర్వమైన కానుక 'సత్యాగ్రహం.' ఈ శాంతి సమరం, ఈ అసహాయోద్యమం తెల్లవారిని తల్లడిల్ల జేసింది. కృష్ణాపత్రికకు కృష్ణారావుగారు సంపాదకత్వం వహిస్తున్న సమయంలోనే ప్రథమ, ద్వితీయ ప్రపంచ సంగ్రామాలు చెలరేగాయి. మరోవంక దేశీయులు స్వరాజ్య సాధనలో భాగంగా స్వరాష్ట్రోద్యమాలు నిర్వహించారు. వీసకితోడుగా భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం కోసం ఉద్యమాలు విజృంభించాయి.

ప్రపంచ యుద్ధాల సమయంలో కృష్ణా పత్రికలో యుద్ధ వార్తగానీ, సంపాదకీయంగానీ లేని సంచిక లేదంటే ఆశ్చర్యం లేదు. సామ్రాజ్యవాద శక్తులు విజృంభించి సలిపిన యుద్ధాలలో ప్రపంచం హోరెత్తి పోతుంటే వరాయి పాలనలో క్రుగ్గుతున్న భారతదేశంవంటి బానిస దేశాలు విధిలేక తాముసైతం సమిధలుకాక తప్పలేదు.

1914లో జర్మనీ దేశం మీద గ్రేట్ బ్రిటన్ యుద్ధం ప్రకటించడంతో భారతదేశాన్ని యుద్ధ రంగం లోనికి దించినట్లయింది. యుద్ధ ప్రకటనకు ముందుగాని, యుద్ధంలో తమ స్వార్థ ప్రయోజనాలకోసం భారత సేనలను, సాధన సంపత్తిని వినియోగించుకున్నప్పుడు గాని భారతీయులతో నాటి ప్రభుత్వం సంప్రదించ లేదు. యుద్ధంలో భారత వీరయోధు లెందరో మరణించారు. కోట్లాది రూపాయల ధనం యుద్ధం పాలైంది. భారత దేశం మరింత ఋణగ్రస్తమై ప్రజల మీద పన్నుల భారం అధికతరమైంది. కృష్ణారావు గారి సంపాదకీయాలలో ఈ విషయాలన్నీ సమగ్రంగా చర్చించారు.

యుద్ధ విషయాలపై వ్రాసిన సంపాదకీయాలలో కేవలం యుద్ధ వార్తలే కాక ఆయా దేశాలు యుద్ధంలో పాల్గొన్న వైనాన్ని, యుద్ధ క్రమంలో జరుగుతున్న ధన, ప్రాణ నష్టాన్ని విశ్లేషణాత్మకంగా పరిశీలిస్తూ ప్రజల కర్థమయ్యే రీతిలో తెలియజేప్పేవారు. క్షామదేవత తాండవం, కాలపురుషుని విలయం, హెచ్చు ధరలు, ముద్రణా శాసనం, బజారు ధరల పెరుగుదల, ఒక వంక

శాంతి సన్నాహాలు, మరొక వంక తలవని తలంపుగా యుద్ధోన్మాదాలు కృష్ణారావుగారి సంపాదకీయాలలో చోటు చేసుకున్నాయి. 'పరాశ్రయం' 'పునస్సృష్టి' అనే సంపాదకీయాలలో యుద్ధాంతర పరిణామాన్ని వర్ణించారు. యుద్ధాల పైన వ్రాసిన సంపాదకీయాలలో కృష్ణారావుగారి తాత్త్వికఆధ్యాత్మిక దృక్పథం కూడా చాలాచోట్ల బహిర్గతమైంది. 'మాభైషీః', ఈ యుద్ధందేనికి? క్షామదేవత, సచలం, అచలం (బ్రిటిషు-జర్మనీ), జగత్తులో యుద్ధపరిణామం మొదలైన వ్యాసాలు ఇందు కుదాహరణలు.

1936 లో వ్రాసిన 'జగత్తులో యుద్ధ పరిణామం'49 అన్న సంపాదకీయంలో కృష్ణారావుగారు యుద్ధాన్ని ఆపడం ఎవరితరమూ కాదని, జగతిలో నిరంతరం యుద్ధం ప్రజ్వరిల్లుతూనే ఉంటుందని, భౌతికంగా కానీ, అధిభౌతికంగా కాని సమరం, సంహారం లేకపోతే జగమే అంతరించి పోతుందని, ఇది కాలపురుషుని లీల అని పేర్కొని, వైరివర్గాన్ని సంహరించుకుంటూ ధైర్యవంతుడవై మరో ప్రపంచంలోనికి పురోగమిస్తుండడమే నీ పని అంటూ జాగృత శంఖారావాన్ని వినిపించారు. నవీనుల గతితార్కిక భౌతికవాదాన్ని ఆధ్యాత్మిక దృక్పథంతో నిరూపించి, భౌతిక శక్తికంటే బౌద్ధిక శక్తి ఉన్నతమైనదని ప్రతిపాదిస్తూ నిసలైన యుద్ధ స్వరూపాన్ని సమగ్రంగా నివేదించారు. ఆ వ్యాసంలోని కొన్ని పంక్తులు "యుద్ధం, యుద్ధం అని ప్రపంచమంతా దద్దరిల్లిపోతున్నది. ఏ వైపున నిప్పంటుకుంటుందో అని, అందరూ బెదురు చూపులు చూస్తున్నారు .... రాజ్యతంత్రజ్ఞులు ఒకవైపున ఒడంబడికలు రాసుకుంటూనే ఉన్నారు. ఇంకో పక్కనుండి యుద్ధాల తంత్రులు పాశాలలాగే పెనవేసుకుంటున్నాయి. ఇంత ఆయుధ సామగ్రి ఉత్పత్తి అవుతుంటే అది ఎప్పుడో ప్రేలకుండా ఎలా ఉంటుంది? ఒక అగ్నికణం ఎప్పుడో రగిల్తే చాలు లోకమంతా ఒక్కసారిగా భగ్గుమనేట్టుంది. ఈ రాయబారాలు, ఈ ఒడంబడికలు, ఈ కవినెంటులు ఈ ప్రళయం ముందర నిలిచేటట్టు లేవు. యుద్ధం ఫెళఫెళమని విరుచుకపడిందా, ఇక దాని నాపగలిగే దెవరు?.... ఈ రాజ్య తంత్రజ్ఞులను మించిన మహాశక్తి ఏదో అట్లా ఆడించి యుద్ధాల్లోకి దింపుతుంది వద్దన్నకొద్దీ. మానవుడు మాత్రం స్వతంత్రుడా? ఇదంతా ప్రకృతి చేస్తున్న పని. ప్రకృతికి సంహారమంటే ఒక ఆట. సంహారం ద్వారా గానీ సృష్టి జరగడం లేదు. ప్రకృతిని చూడండి సలీసుగ జరిగిపోతున్నదేమో? ఒక

వైపున లంకలను వేస్తున్నది. ఇంకొక ప్రక్కన సముద్రాలను పొంగిస్తున్నది. లంకలను వేయడ మెందుకో, ఈ ప్రళయాలను పుట్టించడ మెందుకో? అంటే ఏమి లాభం? ప్రకృతి ప్రత్యక్షంగా చేసే పని ఇది.... స్పర్ధ, సంఘర్షణ, ప్రళయం లేకుండా ప్రకృతి ఏ యుగంలోనైనా ముందుకు నడిచిందా? భౌతిక రాజ్యంలో కంటే కూడా, ప్రాణికోటిలో నీ సంకులము మరింత తీవ్రము కాలేదా? మత్స్య న్యాయం ప్రాణికోటి అంతా ఆవరించి వున్నది.... దుర్బల జంతువు లంటే బలమైన జంతువులకు ఆహారమన్న మాట. వాటి జీవిత మంతా ఒక పెద్ద వేట. ఆ వేటలో, రక్షించుకోలేని ప్రాణులు అంతరించక తప్పదు. ....పెద్ద చేప చిన్న చేపను మింగటంలేదే? బలవంతుడు బలహీనుని చంపితే ఏమి? బలం లేనివాడు కుంగవలసిందే! బలాఢ్యుడు పైకెక్కవలసిందే! అది ప్రకృతి చూపుతున్న త్రోవ. చరిత్ర ప్రత్యక్షం చేస్తున్న మార్గం. నీవు బ్రతక వలెనంటే బలం సంపాదించుకో, బలం సంపాదించుకోలేవూ? నీ కర్మం. బలవంతునికి బానిసకా అని ప్రకృతి ఘోషిస్తుంటే కాదంటే ఎట్లా? యుద్ధాలను ఆపివేయడానికి ప్రయత్నిస్తావా? ప్రకృతి నిన్ను సహించి ఊరుకోదు. నీ సంధిప్రతాల నొక్కపెట్టున చింపివేస్తుంది. శాంతి లీగులను స్థాపిస్తావా? నీ లీగులలోనే ప్రవేశించి నీ లీగుల చేతనే యుద్ధం చేయిస్తుంది....దౌర్బల్యాన్ని క్షమించకు. శక్తిని సాధించి, బ్రతకడం నేర్చుకో .... బలంలేని జాతికి ఈ లోకంలో జీవించడానికి అర్హత లేదు. ప్రకృతి బోధిస్తున్న పాఠమిది.... భౌతిక శక్తి కంటే ప్రాణశక్తి బలవంతమైనదని ప్రతి వృక్షబీజము చాటుతున్నది .... బలమే జయము. బలమే సౌఖ్యము. బలమే ఐశ్వర్యము. 'నాయమాత్మా బలహీనేన లభ్యః' అన్నారు ఋషులు కూడా. ప్రకృతి అంటేనే శక్తి అన్నారు .... నిరంతరం వ్యయ ప్రయాసలతో, ఆదాన ప్రదానాలతో, స్పర్ధా ప్రతి స్పర్ధలతో మునుగుతూ, తేలుతూ, ఈదుతూ ముందుకు సాగడమే నీ జీవితం. కన్ను మూసినావా, తిరిగి అధోలోకంలో పడిపోతావు. విశ్రాంతిని కోరెదవా తిరిగి నిన్ను నిద్రావహించి తమోరాసులు నిన్ను ముట్టడిస్తాయి. నీ జీవితం ఎడతెగని పోరాటమనుకో. నీ దేహానికి, ఈ భూమికి పోరాటం; నీ ప్రాణానికి, ఇతర ప్రాణులకు వైరం; నీ బుద్ధికి, ఇతర బుద్ధులకు పరస్పర సంఘర్షణం; నీ సంఘానికి, ఇతర సంఘాలకు స్పర్ధ, పోటీ. ఇట్లా ప్రకృతి నిన్ను కాలిబంతివలె నెట్టుకుంటూ, గోల్‌వైపుకు తన్నుకుపోతుంది .... నీ దేహాన్ని, నీ ప్రాణాన్ని, నీ ఇంద్రియాలను, నీ మనస్సును,

నీ అహంకారాన్ని, నీ సంఘాన్ని, నీ దేశాన్ని, నీ జ్ఞానాన్ని ముందుకు నడవనీ, సాగనీ, ఆలోచించనీ. నీ చూపును మందగించ నీయకు; నీ కత్తిని తుప్పుపట్ట నీయకు; నీ విజయాభిలాషను చల్లారనీయకు; మరొక ప్రపంచం - మళ్ళీ మళ్ళీ మరొక ప్రపంచం అంటూ - వైరి వర్గాన్ని సంహరించుకుంటూ బురుజులపై బురుజుల నెక్కుతూ, నీ సామ్రాజ్యాన్ని ప్రతిష్ఠించుకో- 'శత్రూన్ హత్వా భుంక్ష్వ రాజ్యం సంవృద్ధం' — "

స్వాతంత్ర్యం సిద్ధించినా, శాంతి సంఘాలు స్థాపించుకున్నా బహిరంతర సమరం నుంచి తప్పించుకోలేని మానవజాతికి ఇప్పటికీ, ఎప్పటికీ వర్తించే నిష్ఠుర సత్యాన్ని ద్రష్టయై ప్రపంచించారీ సంపాదకీయంలో ముట్నూరి కృష్ణారావుగారు.

ఉద్యమ పరమైన విషయాలలో ఆంధ్రోద్యమాన్ని గురించి వ్రాసిన సంపాదకీయాలు పేర్కొనదగి ఉన్నాయి. దేశంలో స్వాతంత్ర్య సమర జ్వాలలు ఒక వైపునించి విజృంభిస్తున్న సమయంలోనే ఆయా ప్రాంతాలు తమ తమ స్వయం ప్రతిపత్తిని నిలుపుకోవడానికి, తమ స్థానాన్ని పదిలపరచుకోవడానికి భాషాప్రయుక్త రాష్ట్ర విభజనను వాంఛించాయి. 'భిన్నత్వంలో ఏకత్వం' ధ్యేయంగా సాగిన ఈ ఉద్యమాలలో యావదాంధ్ర జాతి ప్రత్యేక ఆంధ్రరాష్ట్రానికై తీవ్రపోరాటం సల్పింది.

కృష్ణారావు గారు కృష్ణా పత్రిక ద్వారా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడానికి, ఆంధ్ర భాషా ప్రాశస్త్యాన్ని లోకానికి ఎరుకపరచడానికి విరివిగా సంపాదకీయాలు వ్రాసారు. వంగదేశంలోని వందేమాతరం ఉద్యమ తీవ్రత ఆంధ్రదేశంపై విస్తృతమైన ప్రభావాన్ని కలిగించింది. ఆంధ్ర ప్రజలలో స్వదేశీయోద్యమంతోబాటు స్వభాషాభిమానం, స్వరాష్ట్రాభిమానం కూడా తీవ్రతరం కాసాగింది. కృష్ణా పత్రిక 1912 వ సంవత్సరం నుంచి ఆంధ్రరాష్ట్రోద్యమంపై ప్రత్యేక వ్యాసాలు, సంపాదకీయాలు ప్రచురించ సాగింది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతను పదేపదే గుర్తుచేస్తూ కృష్ణారావు గారు ఎన్నో సంపాదకీయాలు వ్రాసారు. ఆంధ్రరాష్ట్ర తీర్మానాలతోబాటుగా ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపనకై కూడా కృష్ణారావుగారు కృషి చేశారు.

దేశ భాషల పట్ల కృష్ణారావుగారికున్న అభిమానాన్ని ఈ వాక్యాలు బహిర్గతం చేస్తున్నాయి :

"భాష కేవలము మానవ కల్పితము కాదు. అచ్చటి వాయువుల సంచలనము, అచ్చటి కేదారముల రామణీయకము, అచ్చటి ఆకసముయొక్క దీప్తి, అచ్చటి శుక సారికల ధ్వన్యనుకరణము అచ్చటి భాషయందు ప్రతిబింబించి యుండును. అప్పుడే అది దేశభాషయగును."50 ఈ వాక్యాలలో ప్రాంతీయాభిమానం దురభిమానంగా పరిణమించకూడదని ప్రబోధిస్తూ అందలి పరమార్థాన్ని రమ్యంగా, సహేతుకంగా తెలియజెప్పడం గమనించవచ్చు. అదే వ్యాసంలో ఇంకా ఇలా అంటారు :

"ఆ దేశములోని జనులెట్లు ఆ దేశగర్భమునుండి పుట్టి పెరిగెదరో, అటులనే ఆదేశభాషకూడా ఆదేశగర్భమునుండి పుట్టి పెరుగు భాషయైయుండును. శీతోష్ణ స్థితిగతులనుబట్టి జాతుల వర్ణము కలుగునటులే, ప్రకృతియొక్క వైచిత్ర్యమునుబట్టి దేశభాషలును ప్రత్యేకరూపములను దాల్చును. తెలుగునకు త్రిలింగ దేశము జన్మస్థానము. త్రైలింగ్యుల మధురవచనములకు ఈ త్రిలింగ భూమి యెంతయు రాగోద్దీపనము నొందుచుండును. ఇచ్చటి చెట్లు, చేమలు, పొలములు, కాలువలు సర్వము తెలుగు భాషకు శృతిగలిపి తమ కంఠ స్వరమునుగూడ తమ సోదర మానవుల తెలుగుబాసతో మేళవింప జేయును. ఆంధ్ర మండలమున పరబాస మాట్లాడుడు. అప్పుడీ ప్రకృతి యంతయు మూకీభావము వహించి స్తంభించును. పరభాషావలంబనము కేవలము ప్రకృతి విరుద్ధమనుట నిర్వివాదాంశము. ఏ మతస్థుడైనను, ఏ జాతి వాడైనను ఆంధ్ర మండలమును తన మాతృభూమిగ నెంచుకొనిన యెడల, ఆ మాతృ గర్భము నుండి బయల్వెడలిన తెలుగు భాషను స్వభాషగ నెంచుకొన వలెను. కాని యెడల నయ్యది మాతృతిరస్కారము. సోదరద్రోహము. ఈ వాయువును బీల్చుచున్నంతకాలము అందుండి వెలువడు భాషామృతమును గ్రోలుటయే జన్మసాఫల్యము. మానవుడు ప్రకృతికి దూరమై కృత్రిమ మార్గములను బట్టుటచేతనే, అస్వభావికములైన, కల్పితములైన, భేదములయందును, వైషమ్యములయందును జిక్కుకొని ఆత్మోన్నతిని గోల్పోవుచున్నాడు."

కృష్ణారావుగారికి ఆంధ్రభాష అన్నా, ఆంధ్ర ప్రజానీకమన్నా ఎంతటి అభిమానమో, ఎంతటి ఆప్యాయతో ఈ మాటలలో గమనించవచ్చు. గాంధీగారు సబర్మతీ తీరంనుంచి వినిపించిన వేణునాదం విని స్త్రీ బాల వృద్ధ తెలుగు ప్రజలంతా సత్యసంగరంలోకి దూకారు. అప్పుడు "తెలుగుతల్లి ఆనాడు చూచుకొన్నది కన్నులార తన బిడ్డల సాహసం. తొల్లింటి తెలుగువీరుల చరిత్రలు ఒక్కమారు కన్నులకు గట్టినట్లు కనిపించినవి. లాభనష్ట పరిగణనం, సుఖదుఃఖ విచారణం లేకుండా, వెనుక ముందులు చూడకుండా, శాంతవిక్రములై, సత్యస్థిరులై జైళ్ళు నింపిన ఆ పడుచువాండ్రు, ఆ వృద్ధులు ఆంధ్రపౌరుష క్షీరవారాశిలో మరల నొక దీవి వెలియించి చూపిరి. పూర్ణగర్భిణులనక, పిల్లల తల్లులనక, క్రొత్త కాపుర మనక తమ భర్తల వెన్నంటి కారాగారములకు బరువులెత్తిన మా తెలుగు పేరంటాండ్రు మాతృభూమిని చరితార్థం గావించిరి....లవణాధ్యాయం (ఉప్పు సత్యాగ్రహం) లోని ఆ సమయోధ్యత, లాఠీల పర్వంలోని ఆ యహమహమిక గాంచి తెలుగుధాత్రి తాను వీర ప్రసూతననుకొన్నది. తరియైనప్పుడు తన బిడ్డలు వెనుక బడరనే ధైర్యంతో ఆంధ్రదేశము సాటి దేశములలో తలయెత్తి తిరుగ నేర్చినది. ఆంధ్రుల ఉత్సాహ క్రియా శక్తులు తెప్పయై భారత భూమిని తరింపజేయగలవన్న వన్నెయు, వాసియు గడించుకొన్నారు"51 అని కీర్తిస్తూ ఆంధ్రోద్యమానికి వారిని వెన్ను తట్టారు.

## viii. ఆధ్యాత్మిక - తాత్త్విక విషయకములు

కృష్ణారావుగారు ఆధ్యాత్మిక తేజస్వి. ఆయన ప్రతి రచనలో తాత్త్వికత గోచరిస్తుంది. అంతర్ముఖత్వం ఆయన విశిష్టలక్షణం. సామాన్యంగానే లోక వృత్తాన్ని ఆలోకనం చేస్తూ అసామాన్యంగా భావించడం, ప్రతి విషయాన్నీ సాక్షీభూతంగా తిలకించడం కృష్ణారావుగారి ఆధ్యాత్మికతలోని ప్రధాన తత్త్వాలు. వ్యక్తిగా మౌని, రచయితగా ప్రాగల్భ్యుడాయన. ఆ ప్రాగల్భ్యం ఉదాత్తమై, సభ్యమై, సనాతన భారతీయ తత్త్వ ప్రదర్శకమై, మేధా విలసితమై ఉంటుంది ఆయన ఎన్నుకున్న విషయం రాజకీయమైనా, సాంఘికమైనా, ఆర్థికమైనా లేక మరేదైనా ఆధ్యాత్మికతతో పరిపుష్ట మౌతుంది. కొన్నిసార్లు లోకమంతా సామాన్య మనుకునే విషయాలు ఆయన రచనలో అద్భుత సత్యాలుగా

రూపొందుతాయి. అదేవిధంగా అద్భుతమైన విషయాలు మామూలు విషయాలుగా మారిపోతాయి. చిన్నతనం నుంచి ఒంటరితనంలో పెరగడం, ఉదాత్తమైన గ్రంథాల అధ్యయనం, సదాచార్య సేవనం, సత్సాన్నిహిత్యం కృష్ణారావుగారి లోని తాత్త్వికతను పెంచి ప్రోదిచేసాయి. గాంధీ మహాత్ముని లోకమంతా అవతారపురుషునిగా కీర్తించింది. కృష్ణారావుగారు గాంధీగారి అవతార రహస్యాన్ని విపులంగా వర్ణించారు. ఆ వ్యాసంలో గాంధీగారి తత్త్వాన్ని విశ్లేషిస్తూ ఒకచోట సందర్భవశంగా విరాట్పురుషుని స్వరూపాన్ని వివరించారు:

"పురుషులకెల్ల మూలపురుషుడగు విరాట్పురుషుడు సమస్త జీవులకు, సమస్త గుణకర్మలకు ఆధారభూతుడుగ చిత్రింపబడియున్నాడు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, గుణకర్మలన్నియు విరాట్పురుషుని యందైక్యము చెందియున్నవి. ఈ గుణ కర్మలలో నేయుకటి లేకపోయినను వాని సంపూర్ణతకే లోపము వాటిల్లును. విరాట్పురుషుడు ఒక్క బ్రాహ్మణుడు కాడు. ఒక్క క్షత్రియుడు కాడు. ఒక్క వైశ్యుడు కాడు. ఒక్క శూద్రుడు కాడు. వీని కన్నిటికి అతీతుడై అన్నిటిని తన యందంతర్భుక్తము చేసికొనిన మహాప్రభువు. అందుకనియే విరాట్పురుషుడు. వాని యవయవములలో నొకటి పవిత్రమై ఇంకొకటి అపవిత్రము కాజాలదు. ఏ ఒక అవయవము లోపించి నను విరాట్పురుషుడు కురూపి యగును. అతడు సర్వాంగ సుందరుడు. ముఖము, బాహువులు, ఊరువులు పాదములు అన్నియు పూర్ణముగ వికాసము చెంది చరమసిద్ధి నొందియున్నవి. హిందూధర్మ శాస్త్రకారులీ విరాట్పురుషుని ప్రమాణముగ నంగీకరించి లక్ష్యముగ నిడుకొని హిందూ సంఘమును నిర్మించిరి" అని ప్రాచీనుల చాతుర్వర్ణ్య గుణకర్మ విభాగ క్రియను సాధికారికంగా వివరించారు.

ఆ వ్యాసంలోనే "ఎప్పుడు మహాభారత కాలమున క్షత్రియ వర్ణము నాశనమైనదో, అప్పటినుండియే హిందూ సంఘము యొక్క క్షీణదశ యారంభమయ్యెను ధర్మ నిర్వహణకు ఆధారభూతమైన క్షత్రియ వర్ణము లోపించుట తోడనే బ్రాహ్మణ వర్ణము యొక్క జ్ఞానజ్యోతియు నారిపోయెను. వైశ్యులు దేశైశ్వర్యమును అభివృద్ధి పరచుట మాని విదేశపు దోపిడీ గాండ్రకు సహకారులై దేశలక్ష్మిని బర భూములకు సాగనంపిరి. నాల్గవ వర్ణము మాత్రము

ఇంకను భూదేవి నాశ్రయించుకొని ధాన్యలక్ష్మిని గొలుచుచుండుటచే భరత ఖండము భూతలమునుండి పూర్తిగ పరిమార్జితము గాక పేరుకైనను నిలిచి యున్నది. ఎక్కడి విరాట్పురుషుడు? ఎక్కడి హిందూ సంఘము? శిరస్సు ఖండింపబడినది. బాహువులు భగ్నమైనవి. ఊరువులు తెగగొట్టబడినవి. పాదములు మాత్రము మిగిలియున్నవి. ఎట్టి చిత్రవధ?" అని వివరిస్తూ "భయమక్కరలేదు. భారత సభ్యత మృత్యువును జయించిన ఆత్మపదార్థ" మని ఉద్ఘోషించారు. ఆ సాంప్రదాయిక సంస్కారమే భారతదేశ అస్థిరత్వానికి మూలకారణమని దృఢంగా విశ్వసించారు.[54]

కృష్ణారావుగారు శుష్కవేదాంతికారు. ఆయన సాధకుడు, భక్తుడు, పరమ వివేకి. "మురికివస్త్రములనే ధరించువానికి శుచి, అశుచి అను వివేకము మందగించియుండును. మల్లెపూవు వంటి తెల్లని దుకూలములను ధరించువా డెప్పుడును ఏ మలినము సోకునో యని భయపడుచుండును. వాని దృష్టిలో నొక ఇసుకరేణువు బట్టపై బడినట్లు అనుమానమున్నను దానిని దులుపుకొను నంతవరకు వానికి చిత్తశాంతి చిక్కదు. భక్తుల చూపు దుర్బిణీయంత్రము వంటిది. వాని చూపునకు అదృశ్యమైన అతి సూక్ష్మమైన ధర్మ విపర్యాసములు కూడ ఏనుగులవలె, పర్వతములవలె బృహద్రూపమును దాల్చును. ఇట్టి తీక్ష్ణదృష్టి వికసించినప్పుడే ఆత్మియోన్నతి సాధ్యము"[55] అని అంటారు. మరో చోట "సాధకుల హృదయమర్మమును దెలుసుకొనుటకు గొంత చిత్త సంస్కార మవసరము. మనము సామాన్యముగ బాహ్యచేష్టలనైనను విమర్శింతుము, లేదా అభిప్రాయములను, సిద్ధాంతములను, మతములను తర్కింతుము. ఇవి వాని యాంతరంగిక జీవితము యొక్క రహస్యమును దెలుపగల సాధనములు కావు" అని వ్రాసారు. కృష్ణారావుగారు నిజంగా అట్టి కోవకు చెందిన భక్తుడు, జ్ఞాని, సాధకుడే.

సత్యాగ్రహం ఈ యుగ ధర్మమని నొక్కి వక్కాణిస్తూ ఒక సంపాదకీయంలో భారతభూమిలో సత్యానికి గల స్థానాన్ని ఈ విధంగా వివరించారు: "మన భారత వర్షమున సత్యమును సాధించు నిమిత్తము అవలంబించిన పద్ధతులు అగణితములు. ఒక వేదమునుండియే ఎన్ని మతములు, ఎన్ని దర్శనములు, ఎన్ని నిర్వచనములు, ఎన్ని పూజావిధానములు, ఎన్ని విచార

ములు బయల్వెడలి యుండలేదు? భారత వర్షములోని మత సాధనములను జూచిన ఒక మహారణ్యమువలె గన్పట్టును. స్థూలముగ పరిశీలించిన వీనిలో పరస్పర వైరుధ్య మెంతయో గోచరించవచ్చును. కానీ ధర్మతత్వము మాత్రము ఏక సూత్రముగ వాని యన్నిటియందును వ్యాపించియున్నది. ఋషులు ఏ ఒక్క మతమునకును గట్టుబడినవారు కారు. వారతీతులు. సర్వ మతముల నంతర్భుక్తము చేసుకొనిన జ్ఞానధనులు. 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి' అని సత్య స్వరూపమును హృద్గతము చేసుకొనిన మహానుభావులు. వా రనుభవించి ప్రకటించినది అన్యమత సహనము గాదు. సర్వమత సమానత్వము. వారి సర్వస్వము భారత సంస్కృతియొక్క ప్రాభవములందే గలవు."[56]

మానవుని అంతరంగ సామర్థ్యాన్ని అభివర్ణిస్తూ చింతాశక్తి (Thought Power) ఔన్నత్యాన్ని తెలియజెప్పారు: "ఈ చింతాశక్తి సామాన్యమైనది కాదు. ఫిరంగి మందుకంటె నెక్కుడు విదారణమైనది. ఈ చింతాశక్తి రాజ్యములను కూలద్రోయగలదు. సభ్యతలను తారుమారు జేయగలదు. మానవోన్నతిని నిరోధించు అవరోధము లన్నిటిని భస్మీపటలము జేయగలదు. సకల దాస్య శృంఖలములను చూర్ణము చేయగలదు. భవిష్యత్తునకు కొత్త బాటలు వేయగలదు"[57] అని భారత శక్తిని నిరూపించారు.

'పరాధీనత' వల్ల నిర్వీర్యమై, నిద్రాణమైపోయిన సోదర భారతీయుల నుద్రేకపరుస్తూ, జడీభవించిన వారి వివేకాన్ని, చల్లబడిన హృదయాలను తమ అక్షర తేజస్సుతో సంచలింపజేసారు. ఈ వాక్యాల మాటున కృష్ణారావు గారి హృదయావేదన, ఆత్మీయత, నిర్వ్యాజ దేశభక్తి ద్యోతకమౌతుంది.

"పరాధీనత యొక్క ప్రతిఫలము శీతలము. భారతీయుల బుద్ధి ఘనీభవించిపోయినది. హృదయము చల్లబడినది. దృష్టి మందగించినది. ప్రాచీన చరిత్ర వైభవము కూడ స్మృతి నుండి జారిపోయినది. తమస్సునందుండి స్వత్వ మను భ్రమయందు చిక్కుకొనిరి. క్రియా శూన్యతనే నివృత్తి యని తలంచుచుండిరి. మరణము నందలి చైతన్య విహీనతనే శాంతి యనుకొనిరి. ఇట్టి యలసులు వేడిమి నెట్లు భరింపగలరు? చింతనలు, ఊహలు, ఆదర్శ

ములు, వాక్కులు, ప్రయత్నములు పృథ్విపై ప్రాకుచుండవలసినదే కాని, పైకి పోవుటకు సాహసింపరు. సర్వము విధికి లోబడి యున్నది. మన మేమి చేయగలము? కష్టములు వచ్చినను భరించెదము. గౌరవ భంగము కలిగినను సహించెదము. ప్రభువు నాశ్రయించి బ్రతికెదము. విద్య లంతరించినను, ఐశ్వర్యము నష్టమైనను, మతములు విలుప్తమైనను నెమ్మదిగ కాలము గడిపెదము. ఆసేతు హిమాచల పర్యంతము శాంతి రాజ్యము సేయుచున్నది. కలవరము వలదు. సంఘర్షణ గిట్టదు. ప్రతిరోధము నిషేధము. సంతృప్తి, విస్మృతి, ఆశ్రయము, ఉపేక్ష మానవు నలంకరిపదగిన గుణగణములు. కట్టా! మృత్యుంజయులను, కర్మసిద్ధులను, శూరాగ్రేసరులను గనిన భారత భూమి యెంత అధఃపతితమైనది! స్వధర్మ, పరధర్మ విచక్షణము లేదు. వ్యామోహ వల్లరు ల్లలుకొనినవి. భయభ్రాంతు లావరించినవి. సమస్త భూమండలమునకు గురుపీఠము నధిష్ఠించిన భారత వర్షమునకిక మోక్షము లేదని విధి లిఖించెనా? ఇంకను నా మాతృభూమి పతనము నుండి పతనమునకు, తమస్సు నుండి తమస్సునకు బడుచుండవలసినదేనా? లేదా....ఇక ఆశ! ఛీ!....నిరాశయందు దగుల్కొని మానవాత్మను అగౌరవ పరుపకుము. భారత వర్షము జరామృత్యువులను జయించిన దేశము! అట్టి కర్మభూమి కలకాలము దాస్యకూపమున బడి యుండజాలదు. ఆర్యవిజ్ఞానమున నింకను ప్రతిభ గలదు. ఆర్యుని రక్తము నందింకను వేడిమి చల్లార లేదు. 'ఆత్మవశం సుఖం పరవశం దుఃఖమ్' 'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' ఆదుగో! పాంచజన్యము మ్రోగినది"[58] అని సమర శంఖారావం వినిపించారు. కృష్ణారావు గారి ఈ ప్రబోధంలో భారతీయాత్మ ధ్వనిస్తుంది. కర్మభూమిలో జన్మించిన ఆర్య మనీషుల స్వేచ్ఛాకాంక్ష, ప్రతిభ, ఆర్జవము, వేడిమి కృష్ణారావు గారిలో దండిగా ఉన్నాయని ఈ వాక్యాలు ఋజువు చేస్తున్నాయి. అందుకే ప్రతిపదంలోను అన్యమతాసహిష్ణుతను, అధర్మాన్ని, అహంకారాన్ని 'ప్రకృతి' సహించబోదని హెచ్చరించారు. అందుకనుగుణంగా జీవితాంతం నడుచుకున్నారు.

## IX. కళాత్మకములు

కళలు, విద్యలు మానవ జీవన వికాసానికి సోపానాలు, చైతన్య సంకేతాలు. అనాగరక స్థితినుండి నాగరక స్థితికి నడిపించినవి. మానవునిలో ఆధ్యాత్మిక, మేధా వికాసానికి కారణభూతమైనవి కళలే. "ఆదికాలమున

మృగప్రాయుడైయున్న మానవుడు యుగముల వెంబడి నానావిధ విజ్ఞాన సముపార్జనముచేసి, తన మానవత్వమును సార్థకపరచుకొనుటయేకాక దానినుండి దివ్యత్వమునకు ప్రాకి, అపైని ఆత్మానుసంధానమున తానే బ్రహ్మముగా, బ్రహ్మమే తానుగ వెలుగొందెను. ఈ ద్వివిధ సాధనముల వలన మానవుని జీవితము సుఖమయమును, సౌందర్య యుతమును అగుటయేకాక విజ్ఞాన మయమును, తాత్త్వికతా సంపన్నమును ఆయెను. ఇందు అతని సరస జీవిత మునకు కళలును, ఆత్మిక జీవితమునకు విద్యలును సాధనభూతములైనవి" అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు పేర్కొన్నారు.[59]

స్వతహాగా కృష్ణారావుగారు సౌందర్యాభిలాషులు. కళామర్మ మెరిగిన వారు. భారతీయ కళలపట్ల, విద్యలపట్ల సదవగాహన కలవారు. కృష్ణా పత్రికను కళావేదికగా, కళా స్రోతస్వినిగా మలచుకొన్నారు. తమ పత్రికా కార్యాలయాన్ని ఒక దర్బారుగా, కళానిలయంగా నిలుపుకోవటంలో ఆయన జిజ్ఞాస అభివ్యక్తమౌతుంది. తమ కళారాధనను, అనుభూతులను, హృదయ మార్దవాన్ని సంపాదకీయాలలో ప్రతిఫలింపజేశారు. కృష్ణారావుగారు భారతీయ శిల్పకళను గురించి, చిత్రలేఖనాన్ని గురించి, కవిత్వాన్ని గురించి అత్యంత రమణీయంగా అభివర్ణించారు. పాశ్చాత్య సభ్యతా దుర్వ్యామోహితులై దేశీయ కళలపట్ల నిరసన భావాన్ని వ్యక్తపరచే ఆంగ్ల విద్యాధికులైన భారతీయులను నిశితంగా విమర్శించారు. అలాగే మొగలు శిల్పము, పాశ్చాత్య శిల్పము, బౌద్ధ శిల్పము మొదలైన వ్యాసాలు వ్రాసి వాటి ఔన్నత్యాన్ని తెలియజెప్పారు. ఆంధ్ర నాట్యకళలోని అపరిపక్వతను, చిత్త సంస్కార రాహిత్యాన్ని తీవ్రంగా అభిశంసించారు.

రాజకీయ దాస్య ఫలితంగా హిందూ దేశము తన చూపు కోల్పోయి సౌందర్య వివేచనలో పాశ్చాత్య లక్షణాలనే ప్రమాణంగా గ్రహించడాన్ని అధి క్షేపిస్తూ సంపాదకీయాలు వ్రాసారు. "తుదకు సహజ సిద్ధముగ రసజ్ఞతయందు అశిక్షిత పటుత్వముగల స్త్రీ జనములలో గూడ దేశీయ శిల్ప నిరసన మేర్పడి నది. ఒక కాలమున హిందూ దేశము నంతను సౌందర్యవంతముగ జేయు చుండిన రసస్రోతము ఫల్గుణీ నది వలె నంతర్థానమైనది. దేశమున కిట్టి శిల్ప దారిద్ర్యము సిద్ధించినదను చింతయైనను విద్యాధికులలో నుదయించ లేదు.

వెనుక మహమ్మదీయ యుగారంభమున మహమ్మదు గజనీ హిందూ దేశముపై బడి ........ అందలి ధన కనక వస్తు వాహనములను దోచుకొని పోయెనని చరిత్రలో జదివి రోషము చెందితిమి. మహమ్మదీయ యుగాంతమున ఔరంగ జేబు పాదుషా అనేక దేవాలయములను దోచుకొని నాశనము చేసెనని తెలిసి కొని దుఃఖించితిమి .... మహమ్మదీయులు విగ్రహభంజకులైన నగుదురుగాక! కాని నేడు మనము చేయుచున్న పని యేమి? నేడు మనము చేతులార మన కళా లక్ష్మిని నాశనము చేసుకొనిన స్వధర్మ భంజకులము, ఆత్మవిధ్వంస కులము"[60] అని తమ ఆవేదనను వెల్లడించారు. జాతీయ విద్యాలయముల స్థాపన వల్లనే తిరిగి జాతికి నవ్య చైతన్యము కలుగ గలదని పేర్కొంటూ "దేశము నేడెంత వ్యాధిగ్రస్తమైన వికార రూపము దాల్చినను, ప్రకృతి లోలోన తిరిగి కొత్తశక్తిని పూరించి, నూతన సృష్టికి యుపాధులను సంసిద్ధ పరచు చున్నది.... దేశమునందు నలువైపుల జూచిన యెడల, జాతీయ జీవనము నాలుగు విధముల ప్రకటితమగు చున్నదని తెలిసికొనగలము. ఒకటి - భారత శిల్పముయొక్క పునరుద్ధరణ; రెండవది - దేశ సాహిత్య విలసనము; మూడవది దేశ చరిత్ర సమాలోచనము; నాల్గవది - దేశీయ కర్మవిద్యల పునరభ్యుదయము. మన దృష్టిని చిత్త విక్షేపకరములగు రాజకీయ కక్షలనుండి మరలించి దేశము యొక్క అంతస్సంకల్పములపై బరపిన యెడల నీ నాలుగు ప్రకరణముల ద్వారమున భారతవర్షము తిరిగి తన 'స్వభావ నియత కర్మ'ను సంస్థాపించు కొనుటకు ప్రయత్నించుచున్నదని ద్యోతకమగు"[61]నని ఆకాంక్షించారు. ఈనాటికీ ఆయన ఆకాంక్ష పరిపూర్తి కాకపోవటం విచారకరం.

ఆంధ్ర శిల్ప లక్షణ సమాలోచన చేస్తూ ఒకచోట[62] "నేడు ఆంధ్ర మండలములో శిల్పులు బయలుదేరుచున్నంత మాత్రమున, వారి రచన యందింకను ఆంధ్ర సంప్రదాయసిద్ధమైన విలక్షణములు నవ్య రూపమున గోచరించుచున్నవని చెప్పజాలము" అన్నారు.

సంప్రదాయ సిద్ధమైన సంక్రమణ పర్వదిన వేడుకలలో ప్రజల ఇండ్లలో అలంకరించుకునే 'బొమ్మల కొలువుకూటం'పై ఒక సంపాదకీయం వ్రాసారు. ఆ వ్యాసంలో భారత ప్రజల కళాభిజ్ఞతను, రస హృదయాన్ని కొని యాడారు. "సామాన్యముగ నిత్యజీవితమున కళావిలసనమును ప్రస్ఫుటింప

జేయునది ప్రజాపోషణము. కళాదేవతను నిత్యము నర్చించి, నిత్యమును నైవేద్యము పెట్టునది ప్రజలు. ప్రజల రసగ్రహణ శక్తియు, శిల్పుల సృజన శక్తియు నొండొంటిపై నాధారపడి యున్నవి" అని 'బొమ్మల పండుగ' ప్రాశస్త్యాన్ని విశదీకరించి, "నేడే ఇంట జూచినను జపాను బొమ్మలు, సెల్యులాయిడు బొమ్మలే అత్యధికముగ పెరిగిపోవుచున్నవి. కేవలము యంత్ర నిర్మితములై కళాకౌశలము నేమాత్రము వ్యక్తీకరింపలేని ఈ బొమ్మలలో నేమున్నదో యూహింపజాలము........ రసజ్ఞత కుద్దీపనము గల్గింపని ప్రదర్శనము నిష్ప్రయోజనము" అంటారు అంతేకాక "దేశము రాజకీయముగ పౌరుష విహీనమై నిర్వీర్యమగుచున్నదని మనము కుందవచ్చును. ఆర్థికముగ పరిశ్రమల పోషములేక దారిద్ర్యభారమున గ్రుంగిపోవుచున్నదని వేదన పడవచ్చును. కానీ ఈ యార్థిక సాంఘిక రాజకీయ దారిద్ర్యముతోబాటు రసగ్రహణశక్తి యందు గూడ మనకు దారిద్ర్యమే సంభవించిన యెడల మనమెందులకు బనికి రాకుండ పోవుదుము"[63] అని హెచ్చరించారు. సంక్రాంతి ప్రత్యేక సంచికలు కళాసంబంధములైన అనేక వ్యాసాలతో చిత్రాలతో వెలువడేవి. వాటిలో భారతీయ, పాశ్చాత్య శిల్పాలపై కృష్ణారావుగారు విలువైన వ్యాసాలు వెలువరించారు. కృష్ణారావుగారి కళాభిజ్ఞతకు ఈ వ్యాసాలు నిదర్శనంగా నిలుస్తాయి.

కృష్ణారావుగారి హృదయం లోతులు అందనిది. ఆయన అంతర్యాన్ని అత్యంత ఆత్మీయ స్నేహితులు సైతం సంపూర్ణంగా అవగాహన చేసుకోలేక పోయారని వారి వ్రాతల వల్ల తెలుస్తుంది. 1944 వ సంవత్సరంలో బందరులోని మినర్వా మందిరంలో 'ఆంధ్ర నాటక పరిషత్' సమావేశాలు జరిగాయి. మూడు రోజుల పాటు ఘనంగా జరిగిన ఈ ఉత్సవాలను కృష్ణారావుగారు దర్శించారు. ఈ ఉత్సవ నిర్వాహకులలో ఒకరిద్దరు కృష్ణాపత్రిక కార్యాలయ సిబ్బంది కూడా ఉన్నారు. ఈ ఉత్సవాలను గురించి ఎంతో గొప్పగా ఆయన వ్రాస్తారని ఎదురుచూసిన వారికి, 'జీవంలేని నాట్యకళ'[64] శీర్షికతో మరుసటి వారమే వెలువడిన సంపాదకీయం చూసి దిగ్భ్రమ కలిగింది. ఆంధ్ర నాట్య కళపై వ్రాసిన ఆ సంపాదకీయంలో నిర్మొహమాటంగా నాటి ఆంధ్రనాటక స్థితిగతుల్ని చీల్చి చెండాడారు. ఒకవైపు యుద్ధజ్వాలలు, మరోవైపు క్షుద్బాధ, వీటిని మించి దుస్సహ దాస్య బాధ ప్రజలను పీల్చి పిప్పిచేస్తుంటే "శిష్టుల

మనుకొనువారు ఆస్తికలకు బట్టు గుడ్డలను జుట్టి తమ శ్రోత్రియత్వమును గాపాడుకొనుచున్నారు. వేదమాత ఏనాడో పురోహిత వర్గమువారి మ్యూజియములలో ఒక 'మమ్మీ'గా తయారైనది. శాస్త్రములు, కళలు నిర్జీవములై సంఘము వెలుపల ప్రవాస మొనర్చుచున్నవి. మృతప్రాయమైన ఈ జనావళిలో జీవకళ ఎట్లు ఉట్టిపడగలదు?" అని వ్రాస్తూ "నాట్యరంగము మరణశయ్యపై నిలువబడి వికటాట్టహాసం చేయుటలో నాశ్చర్యమేమి? హిందుత్వంలేని హిందూ మహాసభలు, జీవకళలేని కళాప్రదర్శనములు, సంఘ బాధ్యతను నిర్వర్తింపలేని సంస్కరణ సభలు జేగీయమానంగా జరుగు తున్నవి. అన్నీ ఉన్నవి దేశానికి - ఒక్క ఐదోతనం తప్ప. ఏరీ కవులలో, నాటక రచయితలలో, కళాకోవిదులలో దేశకాల లక్షణములను గుర్తెరిగి ఉషః కీర్తనములను బాడగల వైతాళికులు? ప్రళయగీతాలు పాడవలసిన ఈ సంకట సమయంలోనా వలపులొలికించే ప్రణయగీతాలు? రెక్కలలో సత్తువలేని పక్షి ఆకాశపథమున కెగిరి పాడమంటే ఎట్లా పాడగలదు? అందుకనే పంజరంలో ఇరికిన చిలుక చిట్టి పలుకులను పలుకుచున్నది. దానికే మనము చప్పట్లు చరచి-ముద్దులిడుచున్నాము" అని విమర్శిస్తూ తమ ఆర్తిని వ్యక్తపరిచారు.

అదేవ్యాసంలో "సనాతన అధునాతన విభాగములు అల్పబుద్ధులకు, భూతకాలమున వర్తమానమును, వర్తమానమున భవిష్యత్తును జూడగల త్రికాలజ్ఞుడే నిజమైన కవీశ్వరుడు. దేశాన్ని, ప్రజను, కాంతా సమ్మితముగ శాసించగల నిరంకుశ ప్రభువు కవి. అట్టి కవి నాట్యరంగమున అవతరించ నంతవరకు, ఆంధ్ర నాట్యరంగము చిత్త సంస్కార మొసగని కాలక్షేపముల, వినోదముల- సుక్కి- మగ్గుచునే యుండును" - ఈ వాక్యాలు ఒక్క నాట్య రంగానికే కాక యావత్కళారంగానికి అనువర్తిస్తాయి.

కృష్ణాపత్రిక మొదటినుంచీ స్వదేశీయోద్యమాన్ని, స్త్రీ స్వాతంత్ర్యాన్ని అభిలషించి ప్రోత్సహించేది. ప్రత్యక్షంగా ఎందరో మహిళలు స్వచ్ఛందంగా ముందుకు వచ్చి ఉద్యమాలలో పాల్గొనేలా చేసింది. వారిలో కృష్ణారావుగారి సహధర్మచారిణి శ్రీమతి రుక్మిణమ్మ గారు కూడా ఉన్నారు. బందరులోని పూర్వాచార పరాయణులు కొందరు వీరి కార్యకలాపాలను అధిక్షేపించారు. నాదెళ్ళ పురుషోత్తమ కవిగారు స్త్రీల కార్యకలాపాలను అవహేళన చేస్తూ

'స్త్రీల మీటింగు నాటి హరికథా నాటకము'ల పేరిట ఒక గ్రంథము వెలువరించారు. ఇది పెద్ద సంచలనం సృష్టించింది. కృష్ణారావుగారు తమ పత్రికలో 'దుష్టగ్రంథము కల్లోలమునకు కారణము'65 అనే సంపాదకీయం వ్రాసారు. ఈ వ్యాసంపై కోర్టులో కేసు కూడా నడిచింది.

ఆంధ్ర భాషాభివృద్ధికి, ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపనకు కృష్ణారావు గారు ఎంతగానో కృషి చేసారు. పదేపదే తమ పత్రికలో వ్యాసాలు, సంపాదకీయాలు ప్రచురిస్తూ నాటి భాషోద్యమాలకు, విద్యా వ్యాప్తికి దోహదం చేసారు. గ్రాంథిక, వ్యావహారిక భాషా వివాదాలను కూడా శ్రద్ధగా గమనించినట్లు వారి వ్యాసాల వల్ల అవగతమౌతుంది. "ఆంధ్ర భాష పూర్వము వలె కేవలము విద్వాంసుల వశము నందే యుండజాలదు....గ్రాంథిక భాష కూడా కాలానుగుణ్యములైన మార్పుల నొందుచు, సాధ్యమైనంత వరకు వాడుక భాషను సమీపించ వలసిన అవసరం గమనింపబడుచున్నది."66 సరళ గ్రాంథికం నుండి శిష్ట వ్యావహారికం వరకు సాగిన కృష్ణారావుగారి రచనా పరిణామం ఇందుకు సాక్ష్యం.

సాహిత్యాన్ని సమాజానికి సన్నిహితం చేయవలెననే ఆధునికుల ఆరాటం కృష్ణారావుగారి మాటల్లో గమనించవచ్చు. "ప్రజాతంత్రమునకు పట్టము కట్టుచున్న ఈ రోజులలో సాహితీ పరులు ప్రజారాధనము చేయుట న్యాయమేగాని అది నెపముగా సాహిత్య సౌధము ఎత్తు తగ్గించి క్రమముగ నేలమట్టము చేయవలసి వచ్చునేమో ఆలోచింపవలయును. కవులు క్రిందికి దిగుటకంటే ప్రజలను పైకెత్తుటలోనే విశేషమున్నది. కవులు ఏ గాలికి ఆ తెర పట్టరు. ప్రజలకు చేయి అందించి, వారి హృదయాన్ని సంస్కరించి ఆనంద పర్యాయమైన రసమును సాధించుటయే వారి కర్తవ్యము"67 ప్రతి సాహితీవేత్త ఆలోచించదగిన వాక్యాలివి.

భారత దేశంలో ప్రవేశపెట్టిన ఆంగ్లేయవిద్య దేశీయులలో ఒకవిధమైన నైరాశ్యాన్ని, నిర్వ్యాపారతను కల్పించిందేతప్ప ప్రయోజనకరంగా లేదని విమర్శిస్తూ, సమకాలిక సమాజంలో పేరుకొన్న అసంతృప్తిని, నిరుద్యోగ సమస్యను ఈ 'సెకండరీ విద్య'68 అనే సంపాదకీయంలో సవివరంగా

వర్ణించారు: "ఈ ఆధునిక విద్య దేశములో నిర్వ్యాపారతను అభివృద్ధి పర్చు చున్నది. చదువురానివాడు చదువుకొనినవానికంటె మేలనిపించుకొనుచున్నాడు. చదువుకొననివాడు తన కులవృత్తి నవలంబించి సమర్థుడై ఉండును.......కానీ యీ కాలపు స్కూళ్ళలో చేరి పట్టబిరుదములను సంపాదించుకొను విద్యార్థికులు ఇతరుల ధనమును బీల్చగల వారగుదురే కాని దేశ భాగ్యము నుత్పత్తి చేయగలవారు కాజాలకున్నారు.........ఆధునిక విద్యావిధాన మట్టి పరాన్న భుక్కులనే తయారు చేయుచున్నది.... నేడు పట్ట పరీక్ష నిచ్చిన వారెందరో యుద్యోగములు లేక యల్లలాడుచున్నారు. విఫల మనోరథులైన డాక్టర్లు, లాయర్లు, ఇంజనీర్లు, ఓవర్సీర్లు, బి.యేలు ఎందరో కలరు. వీరు రెంటికి చెడిన రేవడు లగుచున్నారు. వారు వారి పూర్వుల కులవృత్తినే స్వీకరింప జాలరు వారికి తగిన ఉద్యోగ పదవులా సిద్ధించుట లేదు." ఈ సమస్య ఈనాటికీ సంపూర్ణంగా తొలగిపోలేదు.అదే సంపాదకీయంలో కృష్ణారావుగారు ఈ సమస్యా పరిష్కారానికి సూచించిన మార్గాలు రెండు: "దేశములో చేతి పనులకు ప్రోత్సాహము కల్పించుట ప్రథమ కర్తవ్యము. స్కూళ్ళలో కర్మ విద్యలను బోధించుటకు తగిన ధన సహాయము చేయుట రెండవ కర్తవ్యము" అని ఉద్బోధించారు. "స్వతంత్ర వృత్తులను కల్పించలేని ఇప్పటి స్కూళ్ళు గులాంఖానాల"ని ఆనాడే విమర్శించారు.

1929 వ సంవత్సరంలో (సెప్టెంబరు 7, 8 తేదీల్లో) బెజవాడలోని దుర్గాకళామందిరంలో ఆంధ్రప్రజానీకం పక్షాన కృష్ణా, ఆంధ్ర పత్రికలకు సన్మానం జరిగింది. ఆ సభలో తమకు జరిపిన సన్మానానికి ప్రత్యుత్తరమిస్తూ కృష్ణారావుగారు, ఆనాటి తెలుగు పత్రికల గురించి, పత్రికా నిర్వహణ గురించి విమర్శనాత్మకంగా ఉపన్యసించారు. ఈ వాక్యాలు సార్వకాలికాలై ఇప్పటికీ ఆలోచింపజేసేవిగా ఉన్నాయి. విద్యావంతులు సంస్కారులు పత్రికా నిర్వహణకు పూనుకోకపోవడం చేతనే పత్రికలకు దేశంలో తగిన గౌరవాదరణలు కరువైనాయని విమర్శిస్తూ, వ్యంగ్యంగా—"ఒక అచ్చు కూటము, ఒక బేలు కాగితములు, ఒక వూట కలము సమకూడిన చాలును, పత్రికాధిపత్యము సిద్ధించును. పత్రికా నిర్వహణము చాలా బాధ్యతతో కూడిన కార్యము. భాషా ప్రభుత్వము రచనా కౌశలము భావోద్రేకముపున్న చాలవు. క్రమానుగతమైన సంప్రదాయములను, ధారావాహికములైన మర్యాదలను గుర్తింపగల చరిత్ర

జ్ఞానము, ప్రజల నిజ మనోరథము, నిగూఢ చిత్తవృత్తులను పరీక్షించగల విశాలదృష్టి, దేశ భవితవ్యము నుపలక్షించగల గంభీర విశ్వాసము పత్రికాధిపతులు అలవరచుకొనదగిన లక్షణములు. వీటి అన్నిటికంటెను గావలసినది నిర్మలమైన సత్యనిరతి ... స్వాతంత్ర్యమే పత్రికలకు ప్రాణం. (స్వాతంత్ర్య స్థాపనమే పత్రికల లక్ష్యం). ఈ లక్షణములు పత్రికా నిర్వాహకులలో జాల వరకు గౌరవడి యుండుటచేతచే తెలుగు పత్రికలు పొందగలిగినంత గౌరవము పొందలే"దని తెలియజేసారు.[69] ఉత్తమ సంపాదకుని లక్షణాలుగా పేర్కొన్న అంశాలన్నీ కృష్ణారావుగారిలో సమగ్రంగా రూపుదాల్చి ఉన్నాయి. అందుకే తెలుగు పత్రికా రంగంలో ఆయనది భద్రమైన స్థానం.

## అధోజ్ఞాపికలు

1. సాహితీ సుధాలహరి (1971) పరిచయం : ఆచార్య జి. ఎన్. రెడ్డి, పుట 1.
2. ఆధునికాంధ్ర కవిత్వము – సంప్రదాయములు – ప్రయోగములు. డా॥ సి. నారాయణరెడ్డి (1977) పుటలు 124-125.
3. ఈ విషయాలను – తెలుగు జర్నలిజం (డా॥ వి. లక్ష్మణరెడ్డి), నూరేళ్ళ తెలుగునాడు – 'పత్రికలు' వ్యాసం (యం. సుధ), వ్యాస నవమి – 'తొలి తెలుగు పత్రికలు రేఖామాత్ర పరిశీలన' వ్యాసం (డా॥ ఎన్. గోపి) గారల పుస్తకాలనుండి గ్రహించాను.
4. 'కస్తూరి రంగయ్యంగారు' (కృష్ణారావుగారి సంపా. కృష్ణాపత్రిక 15-12-1923)
5. పత్రికా సంపాదకత్వంలో 'ప్రతిభా గరీయసీ' – డా॥ రాపూరు గారి ముందుమాట, 'ముట్నూరి కృష్ణారావు వ్యాసాలు' ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ 1979.
6. నవ్యాంధ్ర సాహిత్య వీధులు – కురుగంటి సీతారామ భట్టాచార్యులు (1949) హైదరాబాదు.

7. ఉదా: ఖద్దరు సప్తాహము (31-3-1934) విజయగోపాల్ పేరుతో బెజవాడ గోపాలరెడ్డిగారు జైలునుంచి వ్రాసిన వ్యాసం, ఢిల్లీ తీర్మానములు (13-7 1940) డా॥ పట్టాభి వ్యాసం, ఢిల్లీ అనంతరము (20-7-1940) చి. సుం. గారి వ్యాసం, సంపాదకీయాలుగా ప్రకటితములు. ఇంకా ఇటువంటివెన్నో లభిస్తున్నాయి.
8. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి – ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం, బాలసరస్వతి బుక్ డిపో 1985 పేజి 2.
9. 'వివాహ సంస్కారము' కృష్ణాపత్రిక సంపా. (16-9-1922)
10. 'జాతీయ విద్య' II ,, (2-10-1926)
11. 'జేబున్నీసా నాటకము' II ,, (21-7-1923)
12. 'జేబున్నీసా నాటకము' III ,, (28-7-1923)
13. 'తెలగమహాసభ' (13-10-1923)
14. 'ఐదవతనమే లోపం' (21-1-1944)
15. 'వివాహ సంస్కారము' (16-9-1922)
16. 'సంస్కర్తల దౌర్బల్యము' (28-9-1929)
17. 'శ్రీ రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు' (7-10-1922)
18. 'సంస్కరణాల ఓడలు దిగుతున్నాయి' (10-11-1934)
19. 'హిందూ ధర్మముపై తిరుగుబాటు' (19-10-1935)
20. 'మతస్వాతంత్ర్యము' (29-2-1936)
21. 'వర్ణద్వేషము' (3-8-1935)
22. 'శ్రీ రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు' (7-10-1922)
23. 'ఇంగ్లాండులో ఇండియా బియ్యము' (21-9-1929)
24. 'బ్రిటిషు సందేశము' (12-8-1922)
25. అదేవ్యాసం
26. 'క్వెట్టా ఆంక్ష!' (22-6-1935)
27. 'రథోత్సవము' (13-2-1937)
28. 'బార్డోలీ కథ' (5-11-1938)
29. ము. సాహిత్యావలోకనం - ఆచార్య పేర్వారం జగన్నాథం 'తెలుగు నవల - జాతీయోద్యమం' వ్యాసం.

30. 'పండిత జవహరులాల్' (8.2.1936)
31. 'బలి! బలి!' (25.12.1926)
32. 'తెలగమహాసభ' (13 10.1923)
33. 'చీరాల నాయకుడు' (9.11.1921)
34. 'డెమాక్రసీ' (5.12.1925)
35. 'లెనిను' (13.6.1925)
36. రసతపస్వి కృష్ణారావు - 'దృక్కోణం' సంజీవదేవ్ పీఠిక
37. 'శ్రీ వివేకానందస్వామి' (27.1.1917)
38. 'మహాత్మా గాంధీ' (6.4.1929)
39. 'మహావీరపూజ' (23.3.1929)
40. 'రవీంద్రుని దిగ్విజయము' (9.8.1913)
41. 'శ్రీనివాస శాస్త్రి' (2.7.1921)
42. 'కళ్యాణానంద భారతీమంతాచార్యులవారు (17.8.1935)
43. 'దాసు అనంతరము?' (27.6.1925)
44. 'మృత్యుదేవత' రసతపస్వి కృష్ణారావు 294 వ పేజీనుండి
45. 'నిర్యాణము' (16.4.1938)
46. 'విశ్వమోహనుడు' (9.8.1941)
47. 'స్వర్గారోహణము' (4.2.1922)
48. 'లోకమాన్యుడు' (7.8.1920)
49. 'జగత్తులో యుద్ధపరిణామం' (.6.1936)
50. 'దేశభాషలు - మతభేదములు' (19.6.1920)
51. 'తల్లిపిలుపు' (6.2.1937)
52. 'ఇంగ్లాండులో ఇండియా బియ్యము' (21.9.1929)
53. 'ఏది నిజము?' (8.12.1923)
54. 'మహాత్ముని అవతార రహస్యము' (6.4.1929)
55. 'శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు' (7.10.1922)
56. 'సర్ రాధాకృష్ణన్' (4.4.1936)
57. 'భారత శక్తి' (14.10.1922)
58. 'లోకమాన్యుడు' (7.8.1920)

59. సాహిత్య శిల్ప సమీక్ష - 'కళలు - విద్యలు' వ్యాసం పేజి. 14. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు. గంగాధర పబ్లికేషన్ - 1983 పం. ము.

60, 61. 'జాతీయవిద్య II & III' (2 10-1926, 18-10-1926).

62. 'ఆంధ్రశిల్ప లక్షణములు' (22 2-1936).

63. 'బొమ్మల పండుగ' (12-1-1935).

64. 'జీవంలేని నాట్యకళ' (4-3-1944).

65. 'దుష్ట గ్రంథము కల్లోలమునకు కారణము' (3-5-1908).

66. 'జాతీయవిద్య' II (2-10-1926).

67. 'పేరంటము' (12-2-1938).

68. 'సెకండరీ విద్య' (13-6-1925).

69. 'పత్రికా సన్మానము' (7-9-1929)

# అధ్యాయం ఆరు

# ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయాల భాష–శైలి–స్వభావం

ఏదైన రచన చదివినా, ఎవరిదైనా ఉపన్యాసం విన్నా ఆ రచన వెనుక, వారి మాటల మాటున ఏదో ఒక ప్రత్యేకతను మనకు తెలియకుండానే గుర్తిస్తాము. వ్యక్తికీ, వ్యక్తికి మధ్య రచనలో, భాషణలో, భావ వ్యక్తీకరణ పద్ధతిలో తప్పనిసరిగా ఏదో ఒక విశిష్టత గానీ, ఎంతోకొంత వైరుధ్యం గానీ, కొంచెం శ్రద్ధగా పరిశీలిస్తే గమనించ గలుగుతాము. లోకంలోని మనుషులంతా ఒక్కటే అయినప్పటికీ ప్రతి వ్యక్తి ఇంకొక వ్యక్తితో అనేక విషయాలలో విభేదించక మానడు. ఒకే తల్లి గర్భంలో ఒకే సమయంలో జన్మించిన కవలల్లో సైతం, శారీరకంగానో, మానసికంగానో ఏదో రీతిగా భిన్నత్వం ఉండితీరుతుంది. అలాంటిది. మానవ మేధా విలసితాలైన సాహిత్య ప్రక్రియలలో అనంతమైన వైవిధ్యా లుండటం అత్యంత సహజం. అందుకే ఎప్పుడైనా ఎక్కడైనా ఒకరిద్దరి భావాలలో సారూప్యత గోచరిస్తే అది విశేషంగా చెప్పుకుంటాము.

రచనలు మానవ మేధా విలసితాలైనప్పుడు తద్రచనలలో రచయితల వ్యక్తిత్వాంశ ప్రతిఫలించడం తరచుగా జరుగుతుంది. ఆయా వ్యక్తుల జన్మ సంస్కారాన్ని బట్టి, ప్రతిభా విశేషాలను బట్టి, జీవన విధానాన్ని బట్టి, పరిసరాలను బట్టి రచనలో వ్యక్తిత్వ ముద్ర ఒకటి ప్రత్యేకంగా కనబడుతుంది. అందుకే ఒక రచన చదవగానే ఆ రచయిత గానీ, అతని హృదయం గానీ నిరపేక్షితంగానే పఠితలకు పదే పదే గుర్తుకు వస్తుంది.

రచనలో భాషను వాడుకునే శక్తి, నేర్పు లేదా ప్రత్యేకతను శైలిగా భావిస్తే ఆ శైలి రచయిత వ్యక్తిత్వ ముద్రతో విలసిల్లుతుందనేది స్పష్టం.

ఆంగ్లంలోని Style అన్న పదానికి సమానార్థకంగా తెలుగులో శైలి అన్న పదాన్ని వాడుతున్నాం. సంస్కృత సాహిత్యంలోను, ఇటీవలివరకు ఆంధ్ర సాహిత్యంలోనూ శైలిని గూర్చిన పరిశీలన జరుగవలసినంత జరుగలేదనే చెప్ప వచ్చు. ఆంగ్లభాషలో శైలిని గురించి ప్రత్యేక పరిశీలనలు జరిగాయి. కవిత్వం లోను, వచనంలోనూ శైలిని గూర్చి ఆంగికంగా, భాషాపరంగా, ఆత్మీయంగా, భావపరంగా పరిశీలించవచ్చు. రచయిత భాషాప్రయోగ నైపుణ్యం, భావ నివేదనలపై ఆధారపడి అతని శైలిని నిరూపించవచ్చు.

"భాష ధ్వనిగా, పదంగా, పదాల కూడికగా, వాక్యంగా వాక్య సము దాయంగా, వ్యాసంగా ఇత్యాదిగా రూపం దిద్దుకోవచ్చును గానీ తద్రూపాలన్నీ శైలికాక, ఆ రూపాంతర్గతంగా శైలి విలసిల్లుతుంది. రూపం శైలికాదు. రూపాంతర తేజస్సు శైలి. శైలి పైకి కనిపించదు. లోతుల్లో ఉంటుంది. అది బాహిరం కాక అంతరంగా ఉంటుంది. అయితే బాహిర పద, వాక్యాది సంకేత సహాయంతో అంతరంగా శైలి విలసిల్లుతూ ఉంటుంది. పదాది మేఘాల మరుగునుంచి తళుక్కుమనే తటిల్లత శైలి.

శైలి సారస్వతాంతర ధర్మం ప్రతి వ్యక్తికీ ప్రాణమున్నట్లే ప్రతి రచనకు శైలి ఉంటుంది. అయితే ప్రాణమున్న అందరూ ఎలా చైతన్య వంతులుగా, కళగా, వెలిగే దివిటీలుగా వుండలేరో, మహోత్తములు కాలేరో, అలాగే అన్ని రచనలు శైలీచైతన్యం ప్రదర్శించలేవు. అందువల్ల ఏ వ్యాసం ఉత్తమ శైలీ సముచితమో అది ఉత్తమం. శైలి రచయిత రూపొందించే భాషా సంబంధియై, సారస్వతాంతర్వాహినియై, సారస్వతానికి ప్రాణచైతన్యమై ప్రకాశిస్తుంది."[1] తనదైన ఒక విశిష్టత నిలుపుకోలేని రచన కలకాలం నిలబడ జాలదని ఈ వాక్యాల వల్ల విదితమౌతుంది. భాషలో, భావనలో, అభివ్యక్తిలో వైశిష్ట్యం సంతరించుకొన్న కొంద రాంధ్ర రచయితలలో కృష్ణారావుగారు ఒకరు. కృష్ణారావుగారి సంపాదకీయాల శైలీతత్త్వ నిర్దేశానికి ఆయన రచనలో అనుసరించిన పద్ధతులను పరిశీలించి వాని ప్రత్యేకతలను నిరూపించ వలసి ఉంటుంది.

## శబ్ద సంయోజనం

సమర్థమైన స్థలాలలో సమర్థమైన పదాలు వాడటం ఉత్తమ శైలిని పెంపొందించుకోవడంలో ఒక భాగం. గుండెలోతుల్లోంచి ఉబికివస్తున్న భావనలకు దీటైన శబ్దజాలాన్ని వాడటం ఒక కళ. భాషలో ప్రధానాంశం పదం. పదం, పదాల కలయిక వల్ల ఏర్పడే అర్థవంతమైన వాక్యం రచయిత శబ్ద సంయోజనా నైపుణ్యానికి నిదర్శన మౌతుంది. పదాల ఎంపిక, పదాల కూర్పు, జాతీయాలు, నానుడులు, పర్యాయ పదాలు, ఇతర భాషా పదాల వాడకం వంటివి రచయిత శైలిని వ్యక్తపరచడంలో సహకరిస్తాయి.

ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయాలలో సంస్కృతాంధ్ర పదాల పోహళింపు విరివిగా కనిపిస్తుంది. విషయానుసారంగా తార్కికమైన వివేచన కనిపిస్తుంది. అందుకోసం పదాలను, పదబంధాలను యథేచ్ఛగా గుప్పించడం గమనించవచ్చు.

"ఏ భావోద్వేగము, ఏ యాత్మ సమర్పణ బుద్ధి, ఏ ఘటనా ఘటన సమర్థత, ఏ సంహార శక్తి, ఏ యాత్మ విస్మృతి వంగ దేశమునందలి తరుణ వయస్కులలో గలదో అవియన్నియు చిత్తరంజనుని యందు ప్రతిబింబించు చున్నవి. లాభనష్టముల లెక్కలేదు. ఆపద ఘటించునను వెఱపులేదు. ఆపదలను దెచ్చిపెట్టుకొనును. లోకమేమి యనునోయను జంకులేదు లోకమును ధిక్కరించును. నిర్లిప్తతతో, తన్మయత్వముతో, వీరావేశముతో మహాభారత యోధుని వగిది ముందుకు దుముకుట, భగ్నమొనర్చుట, ఆహుతియగుట విప్లవకారుని స్వరూపము. విప్లవకారుడు పూర్వపు బాటను చూచుకొనడు. తాను వేయు ముందడుగే వాని బాట. జయాపజయాలను తూనిక వేచి చూడడు. తాను ఆహుతియగుటయే విజయము. విప్లవకారుడు ఝంఝామారుతముపై స్వారి చేయును. భూకంపములలో జిందులు త్రొక్కును. అగ్నిపర్వత విజృంభణమున విహరించును. లోకములచే కట్టుబడడు. నీతులు వానిని బంధింపవు. శాసనములు వానికి తృణప్రాయములు. విప్లవకారుడు ఏకాకి, శాసనాతీతుడు, నిరంకుశ ప్రభువు. యోధాగ్రేసరుడు."[2]

ఈ వాక్యాలలోని పదాలు, పదబంధాలు కృష్ణారావుగారిలోని భావ తీవ్రతను ప్రతిబింబిస్తాయి. ఆయన రచనలో కేవల నిఘంటువుల నాశ్రయిం

చిన పదాలు, భ్రష్టమై, వ్యవహార దూరమైన పదాలు కనిపించకపోవడం గమనించవచ్చు.

మామూలు సంఘటనలను లేదా సన్నివేశాలను శబ్దశక్తితో అద్భుత విషయాలుగా మార్చి పఠితల నుత్సాహపరచడం, అదేవిధంగా గహనమైన భావాన్ని వివరించేందుకు తేలికైన భాషను ప్రయోగించడం కృష్ణారావుగారి రచనలో కనిపించే సాధారణ లక్షణాలు. 'జగత్తులో యుద్ధ పరిణామం' అన్న సంపాదకీయంలో "మనిషి చెట్లను చంపితే చంపాడు, గొర్రెలను చంపితే చంపాడు. ఇక తోటి మనుష్యులను చంపుకోవడం అనా? బాగుందే! పెద్ద చేప చిన్న చేపను మింగటంలే? బలవంతుడు బలహీనుని చంపితే ఏమి?" అని ప్రశ్నించి "ఏ శక్తి భూకంపాలలో తాండవమాడుతున్నదో, అగ్ని పర్వతాలలో నిప్పులు చెరుగుతూ ఉన్నదో, అడవి మృగాలలో రక్తం చిందిస్తున్నదో ఆ శక్తే మానవునిలో అహంకారాన్ని పెంచి, క్రోధం పూరించి, సైన్యాలను వెలిపుచ్చి ఆయుధాలను కల్పించి యుద్ధాలకు పురికొల్పుతున్నది. ఆ జగద్ధాత్రే ఈ సంహారాన్నంతా ప్రకృతి పరిణామంకోసం ప్రదర్శిస్తున్నది. మానవుడు ఆ శక్తికి లోబడే యుద్ధాలు చేస్తున్నాడు."[3] కఠోరమైన ఈ సత్యాన్ని తేలికైన పలుకుల్లో తెలియజెప్పడం గమనించవచ్చు.

## వాక్య నిర్మాణం

భావ ప్రకటనలో సమగ్రమైన, శక్తిమంతమైన పద సముదాయం వాక్యం. పదాల పరస్పర సమ్మేళనంతో అర్థవంతమైన ఒక అంశాన్ని అందించగలిగేది వాక్యం. ప్రాచీనాలంకారికులు వాక్య దోషాలను గురించిన అనేకాంశాలను పేర్కొన్నారు. విసంధి పాటించడం, ప్రక్రమ భంగం, పునరుక్తి, క్రియారాహిత్యం, వాక్య సంకీర్ణం, వాక్య గర్భితం వంటి దోషాల నెన్నిటినో వారు సహేతుకంగా, సోదాహరణంగా వివరించారు. ఈ దోషాలేవీ లేని నిర్దుష్ట రచన సాగించడం శక్తిమంతుడైన రచయిత లక్షణం. కృష్ణారావుగారి రచనలో సుదీర్ఘమైన వాక్యాలున్నా, పదబాహుళ్యం కనిపించినా విషయ నివేదనలో సమగ్రతకు, రసపుష్టికి, దీప్తికి అవి దోహదపడ్డాయి. సుదీర్ఘమైన వాక్యనిర్మాణం ఆ కాలపు పలువురు గద్య రచయితలలో కనిపించే సామాన్య లక్షణం.

వాక్య నిర్మాణంలో పదాల తూగు (balance) ఎంతో ముఖ్యమైనది. భావానుగుణంగా రచయిత కొన్నిమార్లు చిన్న వాక్యంతోనే సరిపెట్టుకోవచ్చు లేదా ఒక పెద్ద వాక్యం వ్రాయవచ్చు. రచయిత అప్పటి మనఃస్థితిని బట్టి గాని, విషయ వైపుల్య సంక్షిప్తతలను బట్టిగానీ వాక్యం కుదించడమో సాగ దీయడమో జరుగుతుంది. ఏ వాక్యాన్ని ఎంతమేరకు పొడిగిస్తే లేదా కుదిస్తే ఆ వాక్యం పాఠకుడిని ఆకట్టుకుంటుందో రచయిత రచన సాగిస్తున్నప్పుడే నిర్ణయించుకొంటాడు. ఈ క్రింది వాక్యాలు గమనించదగినవి:

"మహమ్మదీయ సంఘములో కఠిన కుల విభాగములు లేకపోవుటచే చెడిపోయిన స్త్రీలు తమ శిశువులనైనను తిరిగి సంఘములో చేర్చుటకు ప్రయత్నించగలుగు చున్నారు.

ఇట్లే క్రైస్తవులు గూడ నీ కులటల బిడ్డలను తమ 'ఆస్సయిలము' లలోనికి దీసుకొని క్రైస్తవ మతమిప్పించ గలుగుచున్నారు.

కానీ పాములకు గూడ పాలుపోయు హిందూ సంఘము ఈ బిడ్డలను కులముపేరిట నధోగతిపాలుచేసి తన కృత్రిమ గౌరవమును బోషించుకొను చున్నది.

హిందూ సంఘము నిర్దోషులైన శిశువుల యెడల కొంతకాలమింత నిర్దయతో, ఇట్టి నిర్దాక్షిణ్యముతో బ్రవర్తించుచుండిన యెడల అంత్యదినములు సమీపించుచున్నవని చెప్పుటకు సాహసింపబనిలేదు.

హిందూ సంఘము పాశ్చాత్య సంఘమువలె విషయ భోగముల కాశించునది కాదని సభావేదిక నెక్కి మహోపన్యాసముల నిచ్చుచుందుమేకాని, హిందూ సంఘము బయటికెంత మందిని గెంటివేయు చున్నదియు దెలిసికొన లేకున్నాము.

స్త్రీలను, శిశువులను సంస్కరించి పోషించలేని సంఘము భూతలమున జీవించుట కెట్టి హక్కును లేదు."[4]

ఒకే పేరాలోంచి తీసుకొన్న ఈ వాక్యాలలో మొదటి వాక్యాలు విషయ పరంగా సమప్రాధాన్యత గల్గినవి. తరువాతి రెండు వాక్యాలు హిందూ సంఘములోని లోపాలను విమర్శించేవి. అందుకే వాటికి దైర్ఘ్యము అవసరమైంది. చివరి వాక్యం హెచ్చరిక వంటిది. కొన్ని విషయాలను నొక్కి చెప్పుతూ కొన్నిటిని తేలికగా (చెప్పీ చెప్పక) వదలివేసే సందర్భా లేర్పడుతుంటాయి. అలాంటి సందర్భాలలో రచయిత సంకల్పానికనుగుణంగా అతని ప్రమేయం లేకుండానే కొన్ని మాటలపై భారం పడుతుంది. ఈ భారం లేదా ఊనిక వ్రాతలో కనబడక పోయినప్పటికీ మాటలలో కంఠమాధ్యంలో (Modulation) వినబడే ఒకానొక శబ్దవిశేషంగా పాఠకునికి గ్రాహ్యమౌతుంది.

అదేవిధంగా వాక్యానికీ,వాక్యానికీమధ్య పాఠకుని భావనకు అనుకూలంగానో ప్రతికూలంగానో తరువాతి భావాన్ని అందించడ మనేది రచయిత ప్రతిభపైన ఆధారపడి ఉంటుంది. కృష్ణారావు గారి సంపాదకీయాలు కొన్నిసార్లు సాధారణ పాఠకునిఆలోచన కేమాత్రం అందకుండా భావనా ప్రపంచంలోతలమునకలయ్యే విధంగా పాండితీ ప్రకర్షా ప్రదర్శకాలై కనిపిస్తాయి. మరి కొన్నిసార్లు భావాన్ని అధిగమించిన భాష, భాష నధిగమించిన భావం ఒకదానితో ఒకటి పోటీ పడి నట్లుంటాయి. కృష్ణారావు గారు సమర్థుడైన రచయిత. ఎంతటి తలబిరుసైన గుర్రాన్నైనా సరే సమర్థుడైన రౌతు దాన్ని స్వాధీన పరచుకొని స్వారీ చేసినట్లు ఆయన రచలలో సముజ్జీలైన భాష, భావం అణగిమణగి సాగిపోతుంటాయి.

"కాంగ్రెసు యొక్క ప్రజాను రంజకత్వమును, భారతజాతి యొక్క ఐకమత్యమును, స్వాతంత్ర్య సంపాదనా దీక్షను మూడున్నర కోట్లమంది ఏకవాక్కుతో ఘోషించుట కిదియే తఱి. దేశారాధకుల అపూర్వ సేవా నిరతికి భారతజాతి కృతజ్ఞత చూపదగిన యీ అవకాశమును జాఱి పోనిచ్చునా? దీనికొకరి పేరంటమక్కరలేదు. ఒకరి ప్రేష్యముతో బనిలేదు. ఈమాత్రపు బనికి వంది మాగధుల కైవారములు, వైతాళికుల మేలుకొలుపులు గావలయునా? ఇచ్చట పిలుచునదెవరు? పలికెడి దెవరు? ఇది ఏమి వీరవ్రత ధారణమా? దాన కంకణబంధనమా? తల్లి యాజ్ఞాపించు చున్నది. బిడ్డలు అనువర్తించు చున్నారు. వాత్సల్యము పిలుచుచున్నది. భక్తి పలుకు చున్నది. అవమానము చేతులు సాచుచున్నది. అభిమానము ఆదుకొను

చున్నది. దేశహితము వేడుచున్నది ఆత్మశ్రేయము పెట్టుచున్నది. ధాతవు నీవే, భోక్తవు నీవే. ఓహో! ఎంత చక్కని దానమిది!"[5]

వాక్యాల్లో సుశబ్ద సంయోజన మెంత అవసరమో భావానికి తగిన వాక్య సంయోజనమూ అంతే అవసరం. వాక్య నిర్మాణ విషయంలో రచయిత ప్రతిభ ద్యోతక మౌతుందనేది స్పష్టం. కొందరు సాధారణమైన వచనం వ్రాసినా అది కవిత్వం లాగా హృద్యంగా ఉంటుంది. కృష్ణారావుగారి శైలి ఆలంకారిక శైలి కవితాత్మకమైన శైలి ఆయన సంపాదకీయాలలో ప్రతి పదంలో గోచరిస్తుంది. కృష్ణారావు గారిలోని కనిపించని కవి రచనలో వినిపిస్తాడు.

"కాళ్ళగజ్జెలు, అందియలు ఘల్లు ఘల్లున మ్రోయ, పరికిణీ అంచులు నేలజీరాడ ముద్దులొల్కు మోముతో తీయదనాలు వెదజల్లు పాటలతో పరుగు పరుగున వచ్చిన ఈ చిన్ని కన్నె ఎవరు? తొక్కు పల్కులు, తప్పటడుగులు ఇప్పుడిప్పుడే చాలించి, పేరంటానికి బయలుదేరే యీడువచ్చిన ఈ కన్నె ముత్తైదువ మా బందరు పౌరుల పిలుపుకు సంబరపడి దీవెనల నందుకొన ఏతెంచినది" అని నవ్యసాహిత్యపరిషత్తు షష్ఠమ వార్షికోత్సవాల సందర్భంగా ఒక సంపాదకీయంలో వ్రాసారు.[6] కృష్ణారావుగారి సంపాదకీయాలలో అర్థాలంకారాలకు, శబ్దాలంకారాలకు సముచితమైన స్థానం ఉన్నది.

కృష్ణారావుగారి శైలి ప్రకరణాన్ని బట్టి అనేక వన్నెలు పోతుంది. సంపాదకీయాల స్వరూపాన్నిబట్టి సాంఘిక రాజకీయాది విభాగాలను పరిశీలించినట్లే స్వభావాన్ని బట్టి మరికొన్ని విధాలుగా వర్గీకరించుకోవచ్చు. వాటిలో ముఖ్యమైనవి.

## వివరణ - వర్ణనాత్మకం

వాస్తవ స్థితిని స్వభావోక్తిగా వ్యాఖ్యానం చేస్తే అది వివరణాత్మక మౌతుంది. వాస్తవ స్థితిని ఆలంకారికంగా వర్ణిస్తే అది వర్ణనాత్మకమౌతుంది.

ఆంధ్రజనుల ఉత్సాహాన్ని, కార్యదక్షతను వివరిస్తూ కృష్ణారావుగారు సహజరీతిని వర్ణించారు. "మన ఆంధ్రులు సహజముగ నుదారాశయులు,

ఉత్సాహపరులు, సంస్కరణాభిలాషులు. హిందూ దేశములో నే క్రొత్త యుద్యమము ఏ మూలనుండి బయలుదేరినను దాని నాదరించుటకు ముందుగ త్వరపడునది ఆంధ్రులు. మతవిషయము కానిమ్ము, కళాభినివేశము కానిమ్ము, ఆర్థిక పరివర్తనమ్ము కానిమ్ము ఏదియైనను దానినేదో విధముగ స్వీకరించి అనుసరించుటకు ఆంధ్రులు అగ్రేసరులు కాగలరు ....ఆంధ్రులు సహజ భాష్యకారులు. ఎట్టి వాదములందలి సారమునైనను వెలికితీసి చూపగల ప్రజ్ఞాతిశయము ఆంధ్రులది. .... శ్రీ రాజా రామమోహన రాయలవారి బ్రహ్మ విద్యా గోష్ఠియొక్క ఆంతర్యమును సవివరముగ బ్రదర్శింపగలిగినది సర్ రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు. రవీంద్రనాథ ఠాకూరుగారి కవితా తత్వమును ప్రప్రథమమున లోకమున చాటగలిగినది సర్ రాధాకృష్ణన్‌గారు. దివ్యజ్ఞాన సాధనా సంపత్తియొక్క పరిష్కృత రూపమును జగత్తుకు వెల్లడించుచున్నది జిడ్డు కృష్ణమూర్తిగారు.

.... ఆంధ్రుల పరిశీలనా పటిమకు దగిన నిదర్శనముల నింకను ఎన్నియో చూపవచ్చును. కాని ఈ చింతనా పటిమ ఈనాటిదికాదు. ఇది యనుశ్రుతముగ వచ్చుచున్నదనుట నిస్సంశయము.

ఇయ్యది విద్యారణ్య, మల్లినాథార్య ప్రభృతుల నాటి నుండి ధారావాహికముగ వచ్చుచున్న సంప్రదాయమే కాని క్రొత్తది కాదు."7 అంతర్గతంగా ఈ వాక్యాల వెనుక విమర్శ దాగి ఉన్నప్పటికీ ఇందులో స్వాభావికమైన సహజ వర్ణన కనిపిస్తుంది.

కృష్ణారావుగారి వర్ణనాత్మక ఫణితికి ఈ క్రింది వాక్యాలు నిదర్శనాలు. శ్రీహరి నాగభూషణంగారి సన్మానసందర్భంగా వ్రాసిన వ్యాసంలోనిదీ వాక్యం.

"సంధ్యా నటనా సంభ్రమమున వీడిన జటాజూటమున చొరవడు మిను వాక కండ్లలో పూవ జాబిల్లి రేక యుయ్యేల లూగ, బ్రహ్మాండములు పొదవదిగి వెండియు గరువుగట్ట శబ్దబ్రహ్మ ప్రథమావతారమగు డమరుక ధ్వానము గావించు నాగభూషణుని పాణిపంకజము జయించు గాక!"8

రవీంద్రుని నిర్యాణాన్ని పురస్కరించుకొని "విశ్వమోహనుడు" అనే సంపాదకీయం వ్రాసారు. ఆ వ్యాసంలో "రవీంద్రుడు సౌందర్యమూర్తి. వాని రూపులో, చూపులో, పలుకులో, పాటలో అంతా సౌందర్యం. అతని జీవితమే సౌందర్యమయం, రసవిహారం....అతడు క్రీగంట చూచెనా, అది కనకాభిషేకం! అతడొకసారి హస్తమును మెల్లగా కదిలించెనా, అది అభినయ కళా విన్యాసం. అతడు లేచి నిలువబడెనా, అది ధ్వజారోహణమే. ఒక అడుగు ముందుకు వైచెనా, బాలకృష్ణుని పూలరథ మూగినట్లే! అతని పెదవు లొకసారి కదపెనా, మాధుర్య వృష్టియే! రవీంద్రుడు త్రిలోక సుందరుడే!" అని తిలాంజలులకు బదులు కృష్ణారావుగారు కరుణ రసమయ భక్త్యంజలులు సమర్పించుకొన్నారు.

## విశ్లేషణాత్మకం

స్థూలంగా ఏక విషయంగా కనపడుతున్నటువంటి ఒక అంశంలోని వైవిధ్యాన్ని ఇదమిద్ధంగా ప్రదర్శిస్తూ పోవడం విశ్లేషణాత్మకమని భావించవచ్చు. ఒక సంఘటనను వివరించి దాని పూర్వాపరాలు, నేపథ్యాన్ని, ఫలితాన్ని సమీక్షించడం కూడా విశ్లేషణగా పేర్కొనవచ్చు.

"వివాహ సంస్కారం" అనే సంపాదకీయంలో వివాహ వ్యవస్థలోని లోపాలను, మతాంతరుల వైవాహిక పరిస్థితులను విశ్లేషించారు. "ఒక క్రైస్తవుడు ఒక హిందూ స్త్రీని వివాహము చేసుకొనజూచిన యెడల అటు క్రైస్తవ సంఘమును, ఇటు హిందూ సంఘమును ఆ వివాహము నశాస్త్రీయ మని ఘోషిల్లును. వారికి సంఘములో గౌరవము లేకపోవుటయే కాక, వారి సంతతికి వారసత్వము మొదలగు న్యాయ సంబంధమైన హక్కులు లేకుండ బోవుచున్నవి. ఇట్టి యన్యాయమును తొలగించుటకై 1873లో ఒక చట్టము చేయబడినది. సివిలు మ్యారేజి ఆక్టు అను పేరుతో జరుగుచున్నది. ఈ యాక్టు ప్రకారము వివాహము చేసికొనదలచిన వారు తాము హిందువులము కాము, క్రైస్తవులము కాము, మహమ్మదీయులము కాము, బౌద్ధులము కాము అని ప్రకటన చేయ వలసియుండును. ఈ యాక్టు ప్రకారము వివాహము చేసుకొనువారే పూర్వమత సంప్రదాయమునకు చెందకూడదని దీని యర్థము .... ఒక క్రైస్తవ కన్యను

వివాహము చేసుకొన దలచిన హిందూ యువకుడు తానైనను క్రైస్తవ మతమును పుచ్చుకొనవలెను. లేదా కన్యయైనను ఏ ఆర్య సమాజ పద్ధతి ప్రకారమో హిందూవైనను గావలయును. వెనుక యొక పార్శీ కన్య ఒక మహమ్మదీయుని వివాహ మాడదలచి, తన విశ్వాసమునకు విరుద్ధముగ పార్శీ మతమును విడనాడి, మహమ్మదీయ మతమును స్వీకరింపవలసి వచ్చెను. మరికొందరు తమ మతమును విడనాడుట కిష్టము లేనివారు, వివాహమునైనను వదలుకొనవలసి వచ్చుచున్నది. లేదా వివాహముగ నెంచని సంబంధమును కలిగి యుండవలసి వచ్చుచున్నది. ఈపై మూడు పద్ధతులుకూడ వ్యక్తి స్వాతంత్ర్యమునకు, మత గౌరవమునకు, సంఘ పారిశుద్ధ్యమునకు భంగకరములని ఒప్పుకొనక తప్పదు. ప్రకృతిని మన కృత్రిమ నియమములచే బంధింపజాలము. ప్రకృతి యొక్క సంకల్ప మమోఘము. తన పనిని తానెవ్విధముననో నెరవేర్చుకొని తీరును. తుదకు మానవుడు ప్రకృతిని శాసించబోయి, ఆత్మవంచకుడగుట తప్ప మరి యొక ఫలము సిద్ధింపజాలదు."[10]

ఈ సంపాదకీయ భాగంలో మొదట పరిస్థితిని వివరించి, పిదప చట్టాన్ని తెలియపరచి, చివరకు ఫలితాన్ని విశ్లేషించడం గమనించవచ్చు.

## విమర్శనాత్మకం

సదసద్వివేచన విమర్శ. సంఘటన లేదా సన్నివేశంలోని నిజానిజాలను ప్రదర్శించడం, న్యాయ పక్షపాతం వహించి తీర్పు నివ్వడం ఇందులోని ప్రధాన లక్షణాలు. కేవలం రంధ్రాన్వేషణ, దోష నిరూపణ మాత్రమే సద్విమర్శ కాజాలదు. అపూర్వ లోకజ్ఞత, తాత్త్విక చింతన, సమయస్ఫూర్తి వంటి లక్షణాలు విమర్శనలో వ్యక్తమయ్యే గుణాలు. తమకు నచ్చని అంశాలను నిర్భయంగా విమర్శించడం కృష్ణారావుగారి రచనలలో గమనించదగిన ముఖ్య లక్షణం. ఆయన కలం శత్రు మిత్ర విభేదాన్ని పాటించలేదు. ఆయన వ్రాసిన ప్రతి వాక్యం ఇందు కుదాహరణంగా ఉంటుంది. "అనైక్యము మన దేశమునకు దాపురించిన పిశాచము. ఇందుమూలముననే భరతవర్షము రాజ్య భ్రష్టమయ్యెను. నేటికీ ఈ పిశాచము పట్టుకొని వదలుటలేదు. కార్యము పల్లో స్ముఖమునకు వచ్చునప్పుడెల్ల నది దాపురించి బోర్లించి పోవును"[11] అని భారత దేశ దాస్యానికి మూల కారణాన్ని వివేచించి చూపారు. మరోచోట "కళాకోవిదుల

సేవను గోలుపోయిన పిమ్మటనే భారతవర్షము అధఃపతితమై, ప్రపంచములో తలయెత్తుటకు నాస్కారము లేకుండ పోయినది"[12] అని అంటారు. ఆంగ్ల ప్రభువుల కళాపోషణను, హైందవుల కళాభిమానరాహిత్యాన్ని నిశితంగా విమర్శించారు. "ఈస్టు ఇండియా కాలము నుండియు, ప్రభువులు కేవలము వర్తకులయ్యు భారత శిల్పము యొక్క ప్రాశస్త్యమును గ్రహించకపోలేదు. వారీ దేశమునుండి అసంఖ్యాకములైన శిల్పద్రవ్యములెన్నియో గ్రహించి తమ మ్యూజియములను నింపిన సంగతి పాఠకులకు దెలియనిది కాదు. తాము జయించిన దేశము ఆఫ్రికా, ఆస్ట్రేలియాల వంటి అనాగరిక దేశము కాక, మహోన్నతమైన సభ్యత కలది యని లోకమునకు జాటు నిమిత్తమే యీ సంగ్రహణమునకు బూనుకొనిరి .... వారికి నిజమైన భారత కళాభిమానమే యుండిన యెడల, నూతన ఢిల్లీ నిర్మాణమును ఇంజనీర్లకు అప్పగించి యుండరు..... అజంతా, ఎల్లోరాలలోని దివ్యనిర్మాణములను దర్శించి ఆనందించుటకు ఏటేటా వందలకొలది ఖండాంతరవాసులు వచ్చి పోవుచున్నారు. కాని మన విద్యాధికులలో నూటికొక్కరైనను వాని జూచుటకు కోరిక గలవారు కూడ కాకపోవుట కంటె విచారకరమైన విషయమేమి కలదు."[13] అని విమర్శించారు. అదే వ్యాసంలో "మన దేశీయులలో కేవలము పాశ్చాత్య ఫోటోగ్రఫిక్కు పద్ధతుల ననుకరించువారు కొందరింకను కలరు. వీరి మూలముననే దేశమునకు కొంత చేటు మూడుచున్నది. వీరి రచనలు దేశీయ సంప్రదాయ విరుద్ధములేకాక, ఆంగ్లో - ఇండియను మాదిరి హైబ్రిడ్డు అర్థు ఒకటి బయలుదేరి విద్యాధికుల నాకర్షించు టెంతయు విచారకరము" అని తమ విచారాన్ని వ్యక్తపరిచారు.

ఇంకా కృష్ణారావుగారి సంపాదకీయాలలో సంవాదాత్మక శైలిని, కథనాత్మక శైలిని గుర్తించవచ్చు. కొన్ని సంపాదకీయాలు ఏదో ఒక సమస్యను ఎత్తుకొని దాని పరిష్కారాన్ని పాఠకులకే వదలివేసేవిగా కని పిస్తాయి. మరికొన్ని సమస్యను సమస్యలాగే ఉందనే భ్రమను కలిగిస్తూ సూక్ష్మేక్షికకు మాత్రమే పరిష్కారాన్ని ధ్వనింపజేసేవిగా ఉన్నాయి. వీటిని 'సమస్యాత్మకాలు' లేదా 'పరిష్కార గర్భిత సమస్యాత్మకాలు'గా భావించవచ్చు.

"ప్రపంచంలో ఏది మారినను, ఏ రాజ్యములు తల్లక్రిందయినను, ప్రళయములు వచ్చినను, ప్రపంచములో మారని వస్తువు, క్షీణించని వస్తువు,

స్థిరముగ నిత్యముగ నిలిచియుండు వస్తువు బ్రిటిషు అధికార వర్గము....ఇది వరకే బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞుడు, ఏ ఆంగ్లేయ సచివుడును ఇంతకంటె స్పష్టముగ, అసందిగ్ధముగ, నిష్కపటముగ బ్రిటిషు రాజనీతిని నిర్వచించి యుండలేదు. దీనికి ప్రత్యుత్తరమేమి? సహాయమా? అసహాయమా?"[14] అని అసహాయోద్యమానికి ప్రజల నుద్యుక్తులను చేస్తూ పరిష్కార గర్భిత సమస్యతో (ప్రశ్నతో) సంపాదకీయాన్ని ముగించడం దీని ప్రత్యేకత.

సారస్వతానికి ప్రధాన ప్రయోజనం ప్రబోధం. సమాజానికి నాయకత్వ స్థానంలో నిలబడి వారిని ముందుకు నడిపించే పత్రికలు మార్గదర్శకాలనడంలో సందేహం లేదు. సంపాదకుని కీవిషయంలో గురుతరమైన బాధ్యత ఉంటుంది. కృష్ణారావుగారి సంపాదకీయాలు చాలావరకు ప్రబోధాత్మకాలే. ఈ ప్రబోధం ప్రజల శ్రేయస్సు నాకాంక్షించి కొన్నిసార్లు వారి వెన్నుతట్టి లేదా వెన్ను చరచినట్లు గావించడం గమనించవచ్చు. కృష్ణారావు గారి సంపాదకీయాలలో ప్రబోధం హెచ్చరికల రూపంలో, వినయ పూర్వక విజ్ఞాపనల రూపంలో కూడా కనిపిస్తుంది.

ఆయన సంపాదకీయాలలో అధిక్షేపానికి కూడా స్థానం లేకపోలేదు. ఈ అధిక్షేపం సభ్యంగా ఉంటుంది. తిరస్కార పూర్వకంగా ఉంటుంది. వ్యంగ్యత్వాన్ని ఆశ్రయిస్తుంది. శ్రీనివాస శాస్త్రిగారనే దేశభక్తునిపై వ్రాసిన సంపాదకీయం ఇందుకుదాహరణం. తమ గౌరవాధిక్యతల మీదనే దేశగౌరవాధిక్యతలు ఆధారపడి ఉన్నాయనే తత్వం కలిగిన శాస్త్రిగారిని అధిక్షేపిస్తూ "స్వదేశములో నిరువది అయిదు వేలమంది తరుణ వయస్కులు జయిలు ఖానాల్లో గుందుచున్నను, దాసు, లజపత్రాయి, నెహ్రూల వంటి నాయకులు బంధింపబడినను, మాలవ్యవంటి పావన చరితునకు వాగ్బంధము గల్పింపబడు చున్నను, మహాత్ముని వంటి లోకోత్తముడు కారాగృహముల పాలైనను దేశమునకు గొదువ ఏమి? వీని యన్నిటిని ఒక దోమకాటుగ నెంచి శ్రీనివాసశాస్త్రి గారు రాజమందిరములలో గడుచుచున్న విందులకు పొందుచున్న గౌరవములకు భారత వర్షము గర్వించ వలదా?" అని విమర్శిస్తూ ఇంకా "శాస్త్రిగారు.... 'హిందూ దేశీయులకు బ్రిటిషు ప్రభుత్వము యెడలను, బ్రిటిషు రాజ్య తంత్రజ్ఞుల యెడలనువిశ్వాసము పూర్తిగా బోయినది. నాకు మాత్రము బ్రిటిషు వారి యెడల

అధిక విశ్వాసము గలదు.... అస్మద్దేశీయులు నన్ను గౌరవించుటలేదు. నేను మాత్రము మిమ్ములను గౌరవించుచున్నాను. సత్యవ్రతమే ముక్తిదాయకమని భారతీయుల విశ్వాసము. బ్రిటిషు సామ్రాజ్యనీతియే సకల కామ ప్రదమని నా మతము. భారతీయులు గాంధీని బూజించుచున్నారు. మీరు నన్ను గౌరవింపుడు. ఇదియే నా సందేశము' అని శాస్త్రిగారుఅపరోక్షముగ నైనను పరోక్షముగ నైనను, ప్రకటించిధన్యులయ్యెదరు గాక"[15] అని కృష్ణారావుగారు అధిక్షేపించారు.

కృష్ణారావు గారి సంపాదకీయాల భాష కాలక్రమానుగతంగా గ్రాంథికం నుండి శిష్టవ్యావహారికానికి పరిణామం జరిగినట్లు స్పష్టమౌతుంది. కృష్ణారావు గారు వ్యావహారిక భాషోద్యమానికి వ్యతిరేకులు కారు. భాషా ప్రయోగాన్ని సామాజిక ప్రబోధానికి చక్కని ఉపకరణంగా మలచడానికి వీలైనంత సరళ తరం చేసారు. మొదట్లో గ్రాంథిక శైలిలోనే వ్రాసేవారు. ప్రథమ ప్రపంచ యుద్ధ సమయంలో వ్రాసిన సంపాదకీయాలు సరళ గ్రాంథికంలో ఉన్నాయి. చరమదశలో సరళమైన వ్యావహారిక శైలి నవలంబించారు. కృష్ణారావుగారు గిడుగు, గురజాడల భాషోద్యమాలను బహు జాగరూకులై పరిశీలించారని వారి మాటలనుబట్టే గ్రహించవచ్చు.

"సర్వజన సేవ్యమై సులభ దర్శనయైన భాషాదేవికి అప్పరాయకవి ముత్యాల సరములు గ్రుచ్చి కాన్కలు పెట్టినాడు.... గ్రంథాల చెర తప్పించి కవిత్వానికి ఆబాలగోపాలము నోళ్ళే యిల్లు చేసినాడు. హృదయాన్ని రంజింప జేసి చమత్కారము గలిగింప జేయుటయే ప్రయోజనముగా నుండెడి కవిత్వాన్ని జాతి ప్రబోధానికి, వికాసానికి సాధనము చేసినాడు.

అప్పరాయ కవితో పాటు ఉత్తరాంధ్రమున ఇంకొక మహాశక్తి నవ్య సాహిత్య లతకు అనుకూలవాతమై పుట్టి వీచనారంభించినది. భాషాదేవి గుడి చుట్టును పండితులు ఎత్తుగా పెట్టిన గోడలు దాని ధాకాకు కూల నారంభించినవి. భాషాదేవి గుడి గడియలు వీడిపోయి తలుపులు తెరచికొన్నవి. అంకెలు తొలగి పోయినవి. వాత్సల్య పూర్ణమగు ఆ తల్లి అంకమున పామరులకు గూడ చోటు దొరికినది. తన ఉత్తర వయస్సంతయు ధారపోసి యీ మహాకార్యమును సాధించిన 'భాషాగాంధి' రామమూర్తి పంతులు తన కనుల యెదుట నవనవ

లాడుచు క్షణక్షణమున ఏపుగ ఎదిగి వచ్చుచు కొనలు సాచుచున్న భాషాలతను చూచుచు మురిసిపోవుటను నేడు మనము కనుల పండువుగ చూచుచున్నాము.

ఈ మహామహుల కృషివల్ల కవిత్వానికి రాజాశ్రయము గూడ పోయి ప్రజలే ఏడుగడలైనారు. కవులకింక ప్రజారాధనమే పని."16

గురజాడ వారు వ్రాసిన ఒక ఉత్తరానికి సమాధానంగా కృష్ణారావుగారు వాడుక భాషలో వ్రాసిన రచనలను తమ పత్రికలో ప్రకటించుటకు అభ్యంతరం లేదని తెలియజేసారు.17 గురజాడవారికే కాక ఎంతోమంది అభ్యుదయ కవుల రచనలను కృష్ణాపత్రికలో ప్రచురించారు. వంగాంగ్ల ప్రభావంతో తొలి దశలో కృష్ణారావుగారు శుద్ధ గ్రాంథికాన్ని వ్రాసినా కాలానుగుణంగా సారళ్యాన్ని సంతరించుకొని వ్యావహారిక రీతి నవలంబించారు.

## ప్రథమదశ : గ్రాంథిక శైలి

"భారత వర్ష సభ్యత నానాత్వమునకును, స్పర్థకును, పరిణామమునకును అతీతమైన జీవప్రకృతిపై ప్రతిష్ఠింపబడుటకు ప్రయత్నింపబడినది. కాని యిది సులభసాధ్యము కాదు. పాశ్చాత్య సభ్యత ప్రాచీనము గాకపోయినను, భారత వర్షము నొందని బాహ్యైక్యతయు, నాగరకతయు నెక్కువ పొందగల్గినది."18

## ద్వితీయ దశ : సరళగ్రాంథిక శైలి

"ఒక మహమ్మదీయ రాజకన్య ఒక హిందూ ధర్మవీరుని ప్రేమించినట్లుగ వ్రాయుటయే ధర్మవిరుద్ధమైనచో, ఇక మానవ హృదయమునకు శరణ్యమెక్కడ? పంచాంగములు తప్పయిన, నక్షత్రగతులు తప్పునా? స్వమతావేశముచేతను, అన్యమతా సహిష్ణుతచేతను, మానవ హృదయమును బంధించుటకు ప్రయత్నించవచ్చును. కాని ప్రకృతి తన యమోఘ సంకల్పముచే తన యకుంఠిత గతిచే తన శాసనాధిక్యమును నిలుపుకొనగలదు. పూర్వాచారపరాయణులు ఆంక్ష చేయనిండు; రాజ్యాధికారులు దండింపనిండు; ప్రకృతి తన బలముచే జాతి మత శృంఖలములను దెంచుకొని విశుద్ధ మానవత్వమునకై నిలువబడు నాయికానాయకుల ప్రణయ మహిమ ఆచంద్రార్కముగ వెలగగలదు. కవులు, కళావిదులు, ఆ ప్రణయరసము నాస్వాదించి

తమ యనూన రచనలచే భారతీదేవికి నూతన అలంకారములను సమర్పింప గలుగుదురు."[19].

## తృతీయదశ : వ్యావహారిక శైలి

1. "హిట్లరుది రాక్షస బలం. అది ఎంతవరకు విజృంభింపగలదో అంత వరకూ విజృంభించనీయండి. విజృంభించడమంటే యుద్ధాగ్నిలో ఆహుతి కావడమే నన్నమాట. పెరుగుట విరుగుటకే అనలేదూ మన వేమనయోగి."[20]

2. "ఈ పోరు ఎట్లా తీరినా, పౌండుకు ఆధిపత్యం వచ్చినా డాలర్ పట్టం కట్టుకున్నా 'ఉద్దతుల మధ్య పేదల కుండదగునె' అనే ఆర్యోక్తి ప్రకారం ఇండియా వంటి బీదదేశాలకు పుట్టగతులుండవు."[21]

3. "మహాత్ముని హృదయం ఎంత కుమిలి పోతున్నదో ఎవరు చెప్ప గలరు? బ్రతికి ఇంక సాధించలేనప్పుడు చచ్చియైన సాధించాలనే ఆవేశం ఆయనలో బయలుదేరడం సహజం. మహాత్ముని రక్తంతోకానీ భారత జాతీయై క్యతకు జిగురు పుట్టదా? ఎంత ఘోరం చేసుకున్నదీ భరతజాతి! లంకలోని స్వాతంత్ర్య సీతను తేబోతున్న మహాత్మునికి నేడు 40 కోట్ల భారత జాతియే వారిధియై అడ్డుతగులు తున్నది".[22]

## నిర్మితి

సినిమా నిర్మాణంలో దర్శకుడు ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్న కొన్ని ఘట్టాలను, నటీనటుల ఆంగిక చాలనాలను, హావభావాలను ప్రేక్షకులకు సన్నిహితం చేయడానికి. వారిలో సంపూర్ణ రసానందం కలగడానికి Close up లో చూపెడతాడు. Long shot లో చూపే దృశ్యాలకన్నా Close up లో చూపే దృశ్యాలు ప్రేక్షకుల మనస్సుకు హత్తుకు పోవడమేకాక సన్నివేశ ఆవశ్యకతను, విశిష్టతను ఎత్తి చూపించి దర్శకుడు ప్రయోజనం సాధిస్తాడు. అదేవిధంగా రచనా విషయకంగా రచయితలు పాఠకులకు తాము చెప్పదలచు కొన్న అంశాలను నొక్కి చెప్పుతూ, అముఖ్యాంశాలను స్పృశించి వదలి వేస్తుంటారు. ఆ అంశం పట్ల రచయితల అంతర్యం చెప్పే విధానాన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. కృష్ణారావుగారి రచనలో సజాతీయ భావనలకు, సనాతన

సిద్ధాంతాలకు అధిక ప్రాధాన్య మివ్వటం, పాశ్చాత్య భావనలను, కేవల భౌతిక దృక్పథాలను తిరస్కరించడం గమనించవచ్చు.

## రచనాశిల్పం

సందర్భవశాత్తు వచ్చిన అవాంతర విషయాలను గానీ ప్రధాన విషయాలకు సంబంధించిన ఇతరాంశాలను గానీ ఎంతవరకు చెప్పి వదలివేస్తే ప్రధాన విషయానికి పోషకంగా ఉంటుందో అంతవరకే వివరించడం అవసరం. విషయంలోని అల్పతాధిక్యతల నిర్ణయంలో రచయిత ప్రతిభ వ్యక్తమౌతుంది.

'గాంధి - రవీంద్రులు', అనే పేరుతో వ్రాసిన సంపాదకీయంలో కృష్ణారావుగారు వారిరువురిని సూర్యచంద్రులతో, వారి ప్రవృత్తులను నరనారీ ప్రవృత్తులతో పోల్చి తులనాత్మక పరిశీలన గావించారు. విషయ చాలనలో రవీంద్రుని కాళిదాసు వంటి కవిగా నిరూపిస్తూ సందర్భవశాత్తు వాల్మీకి, వ్యాసుల ప్రసక్తిని తెచ్చి కాళిదాసు వారికంటే ఏ విధంగా భిన్నుడో వివరించారు. అలాగే గాంధి రసికుడు కాడు, కేవలం ధర్మ ప్రవర్తకుడు అని నిరూపించి అతని ధర్మ తత్పరతను ప్రశంసించారు. ఈ వ్యాసంలో ప్రసక్తానుప్రసక్తంగా వచ్చిన ఇతరాంశాలను తగు మాత్రంగా వివరించి వ్యాసంలోని ఆద్యంతాలలో గాంధి రవీంద్రులను పేర్కొనడం గమనించ దగినది.[23] నిష్ణాతుడైన శిల్పి శిలను శిల్పంగా మార్చడంలో జాగ్రత్త వహించినట్లే సమర్థుడైన రచయిత రచనా విషయకంగా శ్రద్ధాళువై నిమగ్నత కలిగి ఉంటాడు.

## భావ క్రమీకరణ

భావ క్రమీకరణ కూడా రచయిత శైలీ నిర్ణాయకంలో ప్రధాన పాత్ర వహిస్తుంది. ఏ భావం తర్వాత ఏ భావం వివరించవలెనో నిర్ణయించుకొని క్రమానుగతంగా వ్యక్తీకరించడం ఒక పద్ధతి. కృష్ణారావుగారు చాలావరకు సంపాదకీయాలలో ఉపోద్ఘాత పూర్వకమైన వివరణలనే ఇచ్చారు. కథానాత్మకంగా భావాన్ని వివరించడం కొన్నిచోట్ల కనిపిస్తుంది. అలాగే పరిష్కారాన్ని ముందు చెప్పి దాని కాధారాలను పిదప తెలియజెప్పడం కూడా కనిపిస్తుంది. ఏ విధానాన్ని అవలంబించినా తాము చెప్పదలచుకున్న భావాన్ని ధారాళంగా

వివరించడం, భావానికీ, భావానికీ మధ్య సారూప్యత చెడకుండా కాపాడు కోవడంలో కృష్ణారావుగారు కృతకృత్యులయ్యారని చెప్పక తప్పదు. ఏది అనుసరణీయమార్గమో అప్పటికప్పుడే నిర్ణయించుకొని ఆత్మస్థైర్యంతో ఎంచు కొన్న మార్గంలో కడదాకా పయనించగలగడం ఆయన రచనలోని ప్రత్యేకత. రచనలో భావ విస్తృతి జరిగినా భావానికీ, భావానికీ మధ్య సంఘర్షణగానీ, రాకుండా జాగరూకులై భావితరాలకు ఆదర్శప్రాయులయ్యారు.

## కృష్ణారావుగారి సంపాదకీయ శీర్షికలు

**Blaise Pascal** అనే ఒక ఆంగ్ల రచయిత ఒక సందర్భంలో "The last thing that we find in making a book is to know what we must put first" అంటారు. 'కృత్యాద్యవస్థ' అంటే ఇదే. 'Face is the index of the personlity' అన్నట్లు ఇంటివాకిలి చూచి ఇల్లాలి సంగతి తెలుసుకోవచ్చు. శీర్షిక అంటే ముఖమే. 'ఆశీర్నమస్క్రియాయాం వస్తునిర్దేశోవాపి తన్ముఖం' అన్నది మన పూర్వుల అభిమతం.

కావ్యానికే కాక సంపాదకీయానికీ దీన్ని అనువర్తింప జేసుకోవచ్చు. పఠితల నాకర్షించే విధంగా సూక్ష్మంగా, సూటిగా, అందంగా, ఆకర్షణీయంగా శీర్షిక నిర్ణయించుకోవడం ఒక కళ. శీర్షికా ప్రకటనలో కూడా సంపాదకుని ప్రతిభ వ్యక్తమౌతుంది. ముట్నూరి కృష్ణారావుగారు శీర్షికా నిర్వహణలో చూపిన విన్నాణాన్ని పరిశీలిద్దాము.

ఆయన సంపాదకీయాల శీర్షికలు విషయ సారాంశాన్ని క్లుప్తంగా, నిరాడంబరంగా వ్యక్తపరిచేవి కొన్ని కాగా, ఆలంకారికంగా, అందంగా అలరారేవి మరికొన్ని ఉన్నాయి. బందరులో పట్టాభిషేక వేడుకలు, హిందూ మహమ్మదీయుల సమ్మేళనము, రయితుల దుస్థితి, దేశీయ మహాజన సభ వంటివి మొదటి కోవకు చెందినవి. మొదటి ప్రపంచయుద్ధ సందర్భంగా వ్రాసిన 'మహాలయం' అనే సంపాదకీయం మహాలయ అమావాస్యను పురస్కరించుకొని వ్రాసింది. భారతదేశ దుస్థితిని వర్ణిస్తూ 'ఐదవతనమే లోపం' అనే శీర్షికతో సంపాదకీయం వ్రాసారు. 'జిన్నాజీ ఇదిగో నా అర్జీ' 'చిక్కుల చక్కి' 'జిన్నాగారి జిత్తులు' మొదలైన శీర్షికలు శ్రుతి సుభగత్వాన్ని కల్గి ఉన్నాయి.

కృష్ణారావుగారి సంపాదకీయాల శీర్షికలు మొదట్లో గ్రాంథికంలో ఉన్నా పిదప చాలావరకు వ్యావహారికంలో కనిపిస్తున్నాయి. 'గంధి మహాశయుని ధీర ప్రవృత్తి' (1917), 'మాంటెగ్యూగారి యుపన్యాసము' (1913), 'ఆగాఖాను గారి కొత్తపుత్తము' (1918), ఇండియా దొరతనము వారి ఆయవ్యయ వివరములు, (1912) మొదలైనవి గ్రాంథిక శైలి నవలంబిస్తే, 'జనసామాన్యం అంటే వట్టి కాకిమూకేనా?' (1939), 'వోట్లవేలమండోయ్' (1940), 'హిట్లరు గగ్గోలు' (1944), 'అరెరే! వైరి కాచుకో!' (1944) 'చీరాలా? చెరసాలా?' (1921), 'బ్రిటన్ని నమ్ముకోవడమా?' (1938) మొదలైనవెన్నో వ్యావహారిక శైలికి నిదర్శనంగా ఉన్నాయి.

సంస్కృత పదాలను, వాక్యాలను సంపాదకీయాలకు శీర్షికలుగా ఏర్పరచినవి కనిపిస్తాయి. 'మాభైషీః', 'విజ్ఞాతుమిచ్ఛామి భవంత మాద్యమ్' 'త్యక్తేనభుంజీథాః'మొదలైనవి ఇందుకుదాహరణలు.కొందరు వ్యక్తులు స్వర్గస్థులైనప్పుడు వ్రాసిన సంపాదకీయాల శీర్షికలు ఆ వ్యక్తుల వ్యక్తిత్వాలను ప్రదర్శించేవిగా ఉన్నాయి. రవీంద్రునిపై వ్రాసిన 'విశ్వమోహనుడు', చిత్తరంజన్ దాసుగారిపై వ్రాసిన 'దేశబంధువు', కోపల్లె హనుమంతరావుగారిపై వ్రాసిన 'స్వర్గారోహణము', 'హార్డింగ్ ప్రభ్వి', 'పత్రికా సామ్రాజ్య చక్రవర్తి' (W. D. Stedd - Reviews & Reviews editor) వంటి వాటిని పేర్కొనవచ్చు. కొన్ని శీర్షికలు సరదాగా, కొన్ని గంభీరంగా, మరికొన్ని వ్యంగ్యంగా కూడా కనిపిస్తాయి. 'వివాహమా? ఉద్యోగమా?' (ఐరిష్ యువతుల సమస్య), 'నవనారి' (బురఖా ధరించని ముస్లిం స్త్రీ), 'ఉగాది పురుషుడు' (క్రిప్స్), 'హాహాకారాలు, కట్టెలకాటకం' (దుర్భిక్షం), 'ఆత్మ బలికి అన్వేషణ' (మహాత్ముడు), 'సంస్కరణాల ఓడలు దిగుతున్నాయి,' 'సరస్వతీ పూజ' (వెళ్ళపిళ్ళవారికి సన్మానం), 'గాలిమనిషి' (చర్చిల్), 'విరుగుళ్ళు' (రాజాజీ-ప్రకాశం), 'విమర్శ సంధి' (నాటక పంచ సంధులతో హిట్లరు యుద్ధతంత్రాన్ని వర్ణించడం), 'కాంగ్రెసు పతాక దుమ్ము దులుపుతోంది,' 'బ్రిటిషువారి నిగ్రహం,' 'క్రైస్తవ ధర్మ మెక్కడ?' 'కక్కురితి బంగారం,' 'వాయిదాల హుండి,' 'అవ్వా! అప్పచ్చి' మొదలైన శీర్షికలు కృష్ణారావుగారి రచనలలోని వైవిధ్యాన్ని, నైపుణ్యాన్ని తెలియపరుస్తున్నాయి.

# అధోజ్ఞాపికలు

1. తెలుగు వ్యాస పరిణామం - డా. కొలకలూరి ఇనాక్ 1980. పేజి. 528. (సిద్ధాంత గ్రంథం) జ్యోతి గ్రంథమాల, అనంతపురం.
2. 'దేశబంధువు' (20-6-1925).
3. 'జగత్తులో యుద్ధ పరిణామం' (జూన్ 1936).
4. 'స్త్రీ బానిస వ్యాపారము' (29-6-1935).
5. 'తల్లిపిలుపు' (6-2-1937).
6. 'పేరంటము' (12-2-1938).
7. 'శ్రీ రామలింగా రెడ్డిగారి పరిశీలనాపటిమ' (14-9-1935).
8. శ్రీ హరినాగభూషణము - 'వాగ్గేయకారునికి సన్మానం' (26-9-42).
9. 'విశ్వమోహనుడు' (9-8-1941).
10. 'వివాహ సంస్కారము' (16-9-1922).
11. 'శర్మదేవి గురుకులము' (25-4-1925).
12. 'కళాపోషణము' (2-2-1935).
13. పై వ్యాసంలోనే.
14. 'బ్రిటిషు సందేశము' (12-8-1922).
15. శ్రీనివాసశాస్త్రి (20-5-1922).
16. పేరంటము (12-2-1938).
17. చూ. మధుర స్మృతులు - మట్నూరి కృష్ణారావు - రాయప్రోలు సుబ్బారావు గారి వ్యాసం. కృష్ణాపత్రిక వజ్రోత్సవ సంచిక. పేజి. 6.
18. 'పూర్వ పాశ్చాత్య సమన్వయము' (3-2-1917).
19. 'జెబున్నీసా నాటకము' (14-7-1923).
20. 'విషమస్థితి' (11-10-1941).
21. 'లావాదేవీలు' (24-4-1943).
22. 'అభాగ్యజీవి' (18-11-1944).
23. 'గాంధి-రవీంద్రులు' (14-5-1921).

# ఉపసంహృతి

కృష్ణారావుగారి నేతృత్వంలో కృష్ణాపత్రిక న్యూస్‌పేపర్‌గా కాక 'వ్యూస్ పేపర్'గా వెలువడేది. కృష్ణారావుగారు తమ యావజ్జీవితాన్ని పత్రికకే అంకితం చేసారు. కృష్ణాపత్రికలో ఆయన వెలువరించిన సంపాద కీయాల పైననే సాగిన ఈ వ్యాసంలో సంపాదకీయాలను కొన్ని ప్రధాన విభాగాలుగా వర్గీకరించి పరిశీలించాను. ఇది స్థూల విభజన మాత్రమే. దాదాపు 2000 పైచిలుకు సంపాదకీయాలు లభ్యమౌతుంటే,200కు లోపే పునర్ముద్రితమై పుస్తకరూపంలో వెలువడ్డాయి. ఈ మధ్యనే హైదరాబాదు State Archives (ఆం. ప్ర. రాష్ట్రాభిలేఖాగారము) వారు కృష్ణాపత్రిక సంపుటాల Microfilm తీయించారు. వారే తెలుగు విశ్వవిద్యాలయానికి ఒక Set Microfilm లు అందజేశారు. ఈ రెండుచోట్లా భావి పరిశోధకులకు కృష్ణా పత్రికలు పరిశీ లించడం సుకరమౌతుంది. వేటపాలెం లోని సరస్వతీ నికేతనం లోనూ, రాజ మండ్రిలోని గౌతమీ గ్రంథాలయంలోనూ 1938–1945 మధ్య కృష్ణారావు గారి కృష్ణా పత్రికలు లభ్యమౌతున్నాయి. శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం (హైదరాబాదులో)లో కొన్ని సంపుటాలు భద్రపరచబడ్డాయి. ఇవి కూడా చాలాపరకు శిధిలావస్థకు చేరువలో ఉన్నాయి.

కృష్ణారావుగారు సంపాదకీయాలేకాక కొన్ని వ్యాసాలు పత్రికలో ప్రచు రించేవారు. వాటిలో సాహిత్యము, శిల్పము, ధర్మము అనే అంశాలపై తామే ఏర్చి కూర్చి వెలువరించిన వ్యాస సంపుటి "సమీక్ష" పేరుతో ఉపలభ్య మౌతుంది. ప్రాచ్య పాశ్చాత్య ప్రణయ ధోరణులను, భారతీయ, పాశ్చాత్య శిల్పకళా విభేదాలను, భారతీయ సనాతన ధర్మాన్ని ఈ వ్యాసాలతో ప్రతి పాదించారు.

1935 - 45 మధ్య సంవత్సరాలలో కృష్ణారావు గారు ఆధ్యాత్మిక, వేదాంత పరమైన విషయాలపై తరచుగా పత్రికలో ప్రచురిస్తుండిన వ్యాసాలు "లోవెలుగులు" పేరిట పుస్తక రూపంగా వెలువడ్డాయి. గహనమైన తాత్త్విక,

ఆధ్యాత్మిక విషయాలను, ఉపనిషద్వాక్యాలను సరళతరం చేసి 'సోదరా!' అని ఆత్మీయంగా సంబోధిస్తూ, ఈ వ్యాసాల్లో సాధారణ మానవ జీవితంపైకి తమలోని ఆధ్యాత్మిక దీప్తిని ప్రసరింపజేయటం కృష్ణారావుగారి ఆంతర్యం. ఈ వ్యాసాలు ఆయన లోలోపలి వెలుగు వెల్లువలను విరజిమ్ముతున్నాయి.

కృష్ణారావుగారి సంపాదకీయాలు ఆంగ్ల ప్రభుత్వాన్ని కలవరపెట్టినవి ఎన్నో ఉన్నాయి. చెన్నాప్రగ్గడ భానుమూర్తి గారి (ఈయన కృష్ణారావుగారికి బాల్య గురువులు, ఆంగ్ల ప్రభుత్వం నియమించిన సంపాదకీయాల అనువాదకులు) వంటి పెద్దల ఆదరాభిమానాలతో, అండదండలతో కృష్ణారావు గారు పత్రికలో చంద్రనిప్పులు చెరగే సంపాదకీయాలు వ్రాసేవారు. సంపాదకీయేతర రచనలు కూడా కృష్ణారావుగారు తమ పేరు ప్రకటించుకోకుండా ప్రచురించేవారు.

ఆయన వ్రాసిన వ్యాసాలన్నిటిలోనూ సనాతన భారతీయ సంస్కృతి సభ్యతలపై ప్రగాఢ విశ్వాసం, ధార్మిక చింతన ద్యోతకమౌతుంది. ఆయన వచన రచన విలక్షణ శైలిలో విలసితమై పఠితల నాకట్టుకొంటుంది. వ్యాసరచనకు ఏ విషయాన్ని ఎన్నుకున్నా కూలంకషంగా దాన్ని పరిశీలించడం, ఆ అంశానికి సంబంధించిన సాంకేతిక పదజాలాన్నే ఉపయోగించడం ఆయన బహుముఖ పాండితికి నిదర్శనం.

వాగ్మిగా, విజ్ఞాన ఖనిగా ఆయన ఎంతటి మహోన్నత వ్యక్తిత్వంతో విలసిల్లినప్పటికీ తెలుగుదేశంలో ఆయనకు రావలసినంత ఖ్యాతి రాలేదనే చెప్పక తప్పదు. రాళ్ళపల్లి, శ్రీపాద, వేలూరి, పానుగంటి మొదలైన ఆంధ్ర గద్య వాఙ్మయ నిర్మాతల సరసన ముట్నూరి వారికి సముచిత స్థానం లభించకపోవడానికి కారణం ఆయన కేవలం పత్రికా సంపాదకుడు కావడమేనేమో?

వస్తుదృష్టితోకాక భాషాదృష్టితో, ఆలంకారికదృష్టితో కృష్ణారావు గారి సంపాదకీయాలను పరిశీలిస్తే తెలుగు వచన రచనలో ఆయన సాధించిన సిద్ధులు అపూర్వాలని చెప్పవలసి వస్తుంది. ప్రస్తుతం దిఙ్మాత్రంగా ఆయన సంపాదకీయాలను పరిశీలించానేగాని గ్రంథవిస్తరభీతితో లోతులలోకి పోలేదు. ఆయన వచన రచనా విధానాన్ని పలు దృక్కోణాలతో పరిశీలించవలసిన ఆవశ్యకత సమధికంగా ఉందని విజ్ఞులు నేను చేసిన ఈ చిన్న ప్రయత్నం వల్ల తెలుసుకోగలిగితే కృతార్థుడనే.

# అనుబంధం ఒకటి

# THE MASTHEAD

The quarterly publication of the National Conference of Editorial Writers the NCEW's basic statement of principles (Adopted in Philadelphia Oct, 10th 1975).

Editorial writing is more than another way of making money. It is a profession devoted to the public welfare and to public service. The chief duty of its practitioners is to provide the information and guidance towards sound judgements that are essential to the healthy functioning of a democracy. Therfore, editorial writers owe it to their integrity and that of their profession to observe the following injuctions.

1. The editorial writer should present facts, honestly and fully. It is dishonest to base an editorial on half-truth. The writer should never knowingly mislead the reader, misrepresent a situation, or place any person in a false light. No consequential errors should go uncorrected.

2. The editorial writer should draw fair conclusions from the stated facts, basing them upon the weight of evidence and upon the writers considered concept of the public good.

3. The writer should never use his or her influence to seek personal favours of any kinds. Gifts of value, free travel and other favours that can compromise integrity or appear to do so, should not be accepted. The writer should be constantly alert to conflicts of it interest real or apparent, including those that may arise from financial holdings, secondary employment, holding public office or involvement in political, civic or other organisations. Timely public disclosure can minimize suspician.

Editors should seek to hold syndicates to these standards.

The writer, further to enhance editorial page credibility, also should encourage the institution he or she represents to avoid conflicts of interest, real or apparent

4. The editorial writer should realize that the public will appreciate more the value of the First Amendment if others are accorded an opportunity for expression. Therefore, voice should be given to diverse opinions, edited faithfully to reflect stated views. Targets of criticism whether in a letter, editorial cartoon or signed column-especially deserve an opportunity to respond; editors should insist that syndicates adhere to this standard.

5. The editorial writer should regularly review his or her conclusions The writer should not hesitate to

consider new information and to revise conclusions. When changes of viewpoint are substantial, readers should be informed.

6. The editorial writer should have the courage of well-founded convictions and should never write anything that goes against his or her conscience. Many editorial pages are products of more than one mind and sound collective judgement can be achieved only through sound individual judgements. Thoughtful individual opinions should be respected.

7. The editorial writer always should honour pledges of confidentiality. Such pledges should be made only to serve the public's need for information.

8. The editorial writer should discourage publication of editorials prepared by an outside writing service and presented as the news papers own. Failure to disclose the source of such editorials is unithecal and particularly reprehensible when the service is in the employ of a special interest.

9. The editorial writer should encourage thoughtful criticism of the press, especially within the profession and promote adherence to the standards setforth in this statement of principles.

The Masthead, Spring 1978.

# అనుబంధం రెండు

1953 సెప్టెంబరులో జరిగిన అఖిల భారత వార్తాపత్రికల సంపాదకుల సదస్సు రూపొందించిన 'ఎడిటర్స్ చార్టర్.'

1. పత్రిక సంపాదకీయ విధానం అమలుకు సంబంధించి ఎడిటర్‌కు పూర్తి స్వేచ్ఛ ఉండాలి.
2. పత్రిక ఎడిటోరియల్ విభాగం వార్షిక బడ్జెటును యాజమాన్యం ఎడిటర్‌ను సంప్రదించి, రూపొందించాలి.
3. ఎడిటోరియల్ సిబ్బంది, పత్రికలో వెలువడే సమాచారానికి సంబంధించిన అన్ని విషయాలలోనూ తుది నిర్ణయం ఎడిటర్‌దే.
4. ఎడిటర్ తన విభాగం విషయాలను చర్చించేందుకు పత్రికా సంస్థ డైరెక్టర్ల బోర్డు లేదా యజమానితో ప్రత్యక్షసంబంధం కలిగివుండాలి.
5. ఉద్యోగి ప్రత్యేక ప్రతిభకు గుర్తింపుగా ప్రత్యేక ఇంక్రిమెంట్లు ఇచ్చే అధికారం ఎడిటర్‌కు ఉండాలి.
6. పత్రిక విధానం అమలు, ఉన్నత విలువల పరిరక్షణ, అన్ని ఒత్తిళ్ళ ప్రతిఘటన, ఎడిటోరియల్ విభాగంలోకి సహకార స్ఫూర్తిని జనింపజేయడం, నిష్పాక్షికంగా సమాజ ప్రయోజనాలను కాపాడటం ఎడిటర్ విధులు.
7. పత్రిక ఎడిటోరియల్ వ్యవహారాలకు సంబంధించినంతవరకు ఎడిటర్ తన బాధ్యతలు నిర్వహించేందుకు ప్రభుత్వం, యజమాని స్వేచ్ఛనివ్వాలి.
8. యాజమాన్యంతో విభేదాలు తలెత్తి, ఉద్యోగానికి రాజీనామా చేయడం, ఉద్వాసనకు గురవడం జరిగితే ఎడిటర్‌కు అప్పటివరకు ఉన్న సెలవులకు బదులుగా వేతనం, గ్రాట్యుటి, ఆరు నెలల జీతం ఇవ్వాలి.

(జర్నలిజం చరిత్ర – వ్యవస్థ, రాపోలు ఆనందభాస్కర్, పేజి వ్యవస్థ 47, 1987 నుండి ఉద్ధృతము.)

# అనుబంధం మూడు

# కృష్ణాపత్రిక సంపాదకీయాల శీర్షికలు

## కాలానుక్రమణిక

| తేది | సంపాదకీయ శీర్షిక |
|---|---|
| 1-2-1902 | పదునేడవ దేశీయ మహాసభ. |
| | పదునేనవ హిందూదేశీయ సంఘ సంస్కరణ సభ (కృష్ణాపత్రిక ప్రారంభ సంచిక : (మొదటి పేజీ) 'స్వవిషయం' శీర్షికన పత్రిక స్థాపనోద్దేశాన్ని లక్ష్యాన్ని తెలియజేసారు.) |
| 15-2-1902 | The irrigation Commission; గుంటూరు నీటియెద్దడి. |
| 1-3-1902 | Local self Government. |
| | Masulipatnam Municipal Secretary. |
| 15-3-1902 | సత్య సంరక్షణ. |
| 1-4-1902 | సంఘ సంస్కరణ విషయమందు హిందువుల దుర్బలము. |
| 15-4-1902 | సంఘ సంస్కరణకు కొన్ని అంతరాయములు. |
| | Municipal Poor fund. |
| 1-5-1902 | వృత్తులయందభిమానము (The Dignity of Labour) |
| 15-5-1902 | వృత్తులయందభిమానము II; జయపూరు మహారాజుగారి సీమ ప్రయాణము. |

---

* 1-2-1902 న కృష్ణాపత్రిక వెలువడింది. దాసు నారాయణరావు, కొండా వెంకటప్పయ్య పంతులుగారలు సంయుక్త సంపాదకత్వం వహించారు. పక్షపత్రికగానే మొదట్లో వెలువడేది. ఆంధ్రాంగ్ల భాషల్లో శీర్షికలు ఉండటం కనిపిస్తుంది. Serial గా ఒక సంపాదకీయం రెండు సంచికలలో కనిపిస్తుంది.

| | |
|---|---|
| 1.6.1902 | The Madras budjet Debate; పశ్చిమ హిందూ ద్వీపములో ఒక విపత్తు. |
| 15.6.1902 | పదునాకండవ కృష్ణామండల మహాసభ. |
| 1.7.1902 | 11వ ప్రొవిన్షల్ కాన్ఫరెన్సు (కృష్ణామండల సంస్కారణసభ) |
| 15.7.1902 | వివేకానంద స్వాములవారు సిద్ధి నొందుట: (ఎడ్వర్డ్) రాజుగారి దేహస్థితి; పట్టాభిషేకము Coronation. |
| 1.8.1902 | The Indian Police reform; The Oriental Religions Congress in Japan. |
| 15.8.1902 | బందరులోని పట్టాభిషేకపు వేడుకలు; మైసూరు మహారాజుగారి పట్టాభిషేకము. |
| 1.9.1902 | మెట్ట గ్రామములోని నీటివసతులు వాని యపరిశుద్ధత; వరకట్నములు - కన్యాశుల్కములు. |
| 15 9.1902 | జపాను దేశములో వ్యాపార వ్యవహారముల అభివృద్ధి. |
| 1.10.1902 | మద్రాసు ప్రెసిడెన్సీలోని జనగణన విశేషములు |
| 15.10.1902 | (అలభ్యం). |
| 1.11.1902 | ఢిల్లీ దర్బారు. |
| | The Allahabad Congress. |
| 15.11.1902 | అవిభాజ్యపు సంస్థానములను గూర్చిన చట్టము. కృష్ణా గోదావరి మండలములను 3 జిల్లాలుగా మార్చుట. |
| 1.12.1902 | దక్షిణాఫ్రికాలో నివసించుచున్న హిందూ దేశీయుల దుస్థితి. |
| 15.12.1902 | పార్లమెంటు సభలో ఇండియా దేశపు ఆదాయ వ్యయములను గూర్చిన ప్రసంగం. |
| 1.1.1903 | (అలభ్యం) |
| 15.1.1903 | ఢిల్లీ దర్బారు. |
| 1.2.1903 | Delhi Arts Exhibition. |
| 15.2.1903 | ఢిల్లీ నగరమున జరిగిన గజోత్సవము. |
| 1.3.1903 | పోలీసు కమీషన్; కృష్ణాగోదావరి జిల్లాలను మూడు జిల్లాలుగా మార్చుట. |
| 15.3.1903 | కృష్ణామండల మహాసభ |

| | |
|---|---|
| 1.4.1903 | ఉప్పు పన్ను ఆదాయపు పన్నులను తగ్గించుట. కయిన్ (W.S. Caine) దొరగారి మరణము. |
| 15.4.1903 | బెజవాడలో జరుగబోవు కృష్ణాజిల్లా మహాసభ |
| 1.5.1903 | హిందూదేశపు చేతిపనులు. |
| 15.5.1903 | A new irrigation project for Kristna Dist. |
| 1.6.1903 | బెజవాడలో జరిగిన పన్నెండవ కృష్ణా మండల మహాసభ |
| 15.6.1903 | 19 వ దేశీయ మహాజన సభ. |
| 1.7.1903 | హిందూ మహా సంఘము. |
| 15.7.1903 | బందరు మ్యునిసిపాలిటీ చైరుమన్ గారిని మరల నియమించుట; కేసియా పట్టణమందలి వ్యవసాయపు నిధి. |
| 1.8.1903 | జపాను దేశము యొక్క అభివృద్ధి; కృష్ణదేవరాయ దినోత్సవము. |
| 15.8.1903 | స్త్రీ పునర్వివాహ ప్రసంగములు |
| 1.9.1903 | స్త్రీ పునర్వివాహములు II |
| 15.9.1903 | దేశీయ మహాజన సభాధ్యక్షుడు The congress president; పొగబండ్లలో మూడవతరగతి ప్రయాణికుల బాధలు. |
| 1.10.1903 | ప్రశస్త వస్తు ప్రదర్శనమును గూర్చి బందరులో జరిగిన సభ; కోలాచలం వెంకటరావు పంతులుగారు. |
| 15.10.1903 | బందరు అనారోగ్య స్థితి, మన దేశపు ప్రత్తి. |
| 1.11.1903 | శ్రీ గవర్నరుగారి రాక; హిందూ దేశీయ మహాజనసభా నిబంధనలు. |
| 15.11.1903 | హిందూ జ్యోతిష సిద్ధాంతము I; మా సబుకోర్టు రాజీనామాలు. |
| 1.12.1903 | హిందూ జ్యోతిష సిద్ధాంతము II. |
| 2.12.1903 | The Governar's Tour in the Kristna Dist. (Suppliment to Kristna Patrika). |
| 15.12.1903 | హిందూ వైద్యశాస్త్రము. |
| 1.1.1904 | కృష్ణవరదల వలన బాధపడిన వారికి చేయబడిన ధర్మము. |

15.1.1904 * హిందూదేశీయ మహాజన సభాధ్యక్షులగు లాలుమోహను ఘోసుగారి ఉపన్యాస విషయములు I.

1.2.1904 చేతిపనులు నేర్చుకొను వారలకు దొరతనము వారిచ్చెడు విద్యార్థి వేతనములు; హిందూ సంస్కరణ సమాజము.

15.2.1904 బందరులో క్రొత్త వైద్యశాల; బందరునుండి పంపబడిన వస్తువులకీయబడిన బహుమానములు ; జపాను రూషియా దేశముల మధ్య యుద్ధము.

1.3.1904 The Kristna Jute & Cotton spinning Mill.

15.3.1904 బందరులో దొరతనము వారి కట్టెల దొడ్డి; కృష్ణా మిల్స్ కంపెనీ.

* * *

15.6.1904 బొంబైలో కోటీశ్వరుడైన టాటా అనువారి మరణము.

15.7.1904 పదమూడవ కృష్ణామండల సభ.

1.8.1904 అవనిగడ్డ మెజిస్ట్రేటు లంచపు కేసులు.

1.9.1904 వితంతు శరణాలయములు.

15.9.1904 టిబెట్టు దేశపు దండయాత్ర; రుష్యా జపానుల యుద్ధము.

1.10.1904 నీటి పారుదల; పచ్చ యెరువు.

15.10.1904 వరి పొలములకు నీటి లేమిడి.

1.11.1904 అవనిగడ్డ మెజిస్ట్రేటు గారు.

15.11.1904 చలివేంద్ర వ్రభూముల విషయమై చేయబడిన కొన్ని మంచి మార్పులు; అన్నదమ్ముల కలహములు.

1.12.1904 ప్రత్తి చెట్లను పెంచుట; గొప్ప దొంగతనము.

15.12.1904 దివిసీమ యొక్క దుస్థితి.

1.1.1905 వార్తాపత్రికాగారము The Press Room; వచ్చే కృష్ణా జిల్లా సభ.

---

* సుదీర్ఘములైన శీర్షికలున్న సంపాదకీయాలు కనిపిస్తాయి ప్రముఖుల ఉపన్యాసాలు స్థలాంతరంలో ముద్రించి - వాటి విశేషాలను సంపాదకీయాలుగా వ్రాయటం గమనించవచ్చు.

| | |
|---|---|
| 15-1-1905 | దేశీజన మహాసభ. |
| 1-2-1905 | స్వవిషయము (కొండా వెంకటప్పయ్య పంతులు & దాసునారాయణరావు గారల (కృష్ణా పత్రికాధిపతుల) స్వవిషయము) |
| 15-2-1905 | వ్యవసాయాభివృద్ధికై చేయబడుచున్న ప్రయత్నములు; గుంటూరు వితంతు శరణాలయము. |
| 1-3-1905 | స్వదేశము<br>ఉ. జిల్లాలలోని పశువుల ప్రదర్శనములు. |
| 15-3-1905 | పెద్దకళ్ళేపల్లిలో జరిగిన ప్రదర్శనము; స్ఫటిక సౌధము నందలి ప్రదర్శనము. |
| 1-4-1905 | A happy new year సర్వేజనాస్సుఖినో భవంతు. |
| 15-4-1905 | మదరాసు ఎస్టేటు ల్యాండు బిల్లు. |
| 1-5-1905 | బందరు స్త్రీ పునర్వివాహము. |
| 15-5-1905 | పదునాలుగవ కృష్ణామండల మహాసభ. |
| 1-6-1905 | ప్రకృతి శాస్త్ర ప్రయోజనములు; చెన్న రాజధాని సభ. |
| 1-7-1905 | పదునాలుగవ కృష్ణామండల సభ. |
| 15-7-1905 | మన యువరాజుగారికిచ్చు స్వాగతము. |
| 1-8-1905 | కృష్ణా గుంటూరు జిల్లాలలో పల్లపు భూములకు - నీటిపారుద లను గురించిన నూతన నిబంధన.<br>A new irrigation rule in kristna & Guntoor Dists. |
| 15-8-1905 | నాలుగణాల చందా. |
| 1-9-1905 | The risignation of Governal General, ఆదా యపు పన్ను గట్టుటకొక నుతన పద్ధతి. |
| 15-9-1905 | శేటు నారాయణరావు పంతులుగారు. |

* శ్రీ దాదాభాయి నౌరోజీగారు.
బంగళాదేశపు విభాగము

| | |
|---|---|
| 1.10.1905 | స్వదేశారాధన |
| 1.11.1905 | మన పండుగలు |
| 15.11.1905 | రుష్యాదేశమునకు స్వతంత్ర పరిపాలన |
| 1.12.1905 | క్రూరపరిపాలన; ప్రావిడెంటు కంపెనీలు |
| 15.12.1905 | మద్రాసు సర్వకళాశాలలో చేయదలచిన మార్పులు |
| *2.2.1908 | స్వధర్మము |
| 16.2.1908 | మాతృభిక్ష |
| 23.2.1908 | నీటితూరలు; కలెక్టరుగారి సమాధానము |
| 1.3.1908 | భారత స్తోత్రము; తోడిరాగము (కీర్తన); నీటితూరలు, ట్రాన్స్వాలు సమస్య. |
| 8.3.1908 | స్వాగతము (కీర్తన); జాతీయ విద్య |
| 15.3.1908 | వర్ణాశ్రమ ధర్మములు |
| 22.3.1908 | క్రోధానలము; ఆంగ్లేయ వాణిజ్యము; వీరపత్నులు |
| 29.3.1908 | తిరునల్వేలి అభియోగములు; నవ్య ఈజిప్టులు; కార్య నిర్వాహక విధిని న్యాయ నిర్వాహక విధిని వేరుచేయుట, పక్షపాతినిధ్యము |
| 19.4.1908 | మాతృనివేదన; జాన్ మార్లే |

---

* 2.9.1905 న శ్రీ దాసు నారాయణరావు పంతులుగారు స్వర్గస్థులైరి. శ్రీ ముట్నూరి కృష్ణారావుగారికి సహాయ సంపాదకత్వ స్థానంనుండి కొండా వేంకటప్పయ్య పంతులు గారితో సమానంగా పత్రికాధిపతులయ్యే అవకాశం కలిగింది. 15.9.1905 న నౌరోజీ గారిపై వ్రాసిన సంపాదకీయం కృష్ణారావుగారి తొలి సంపాదకీయం కావచ్చు.

* 1906-1907 కృష్ణాపత్రికలు లభించలేదు. ఈమధ్యనే ఎప్పుడో కృష్ణాపత్రిక వారపత్రికగా మారింది. కృష్ణారావుగారు వంగదేశ పర్యటన ఈ సమయంలోనే గావించారు.

| | |
|---|---|
| 26-4-1908 | కాంగ్రెస్ నిబంధనలు; కుకవిదర్శనము; ప్రధానమంత్రి; సంఘ సంస్కరణ సభ. |
| 3-5-1908 | దుష్టగ్రంథము కల్లోలమునకు కారణము, మధుపాన ప్రోత్సాహము. |
| 10-5-1908 | జాతి మాత్సర్యము; హిందూ విప్లవము; ఆయుధ చట్టము, దేశీయ మహాజనసభ. |
| 17-5-1908 | దుష్ట శిక్షణ; వైశ్య మహాజన సభ, ధర్మ రక్షణ. |
| 24-5-1908 | ప్రజా సంక్షోభము; కృష్ణా గుంటూరు మండల సభ. |
| 7-6-1908 | మండలసభ; వీరెవరు?; పోలీసువారి చర్యలు; బొంబాయి మిల్లులు. |
| 14-6-1903 | ఆంగ్లేయ పరిపాలన; పోలీసు కలవరము. |
| 21-6-1908 | తత్వశాస్త్రవేత్త; యుగాంతర్; పిచ్చిదూషణ. |
| 28-6-1908 | ఈశ్వర ద్రోహము; ఆత్మనిగ్రహము. |
| 5-7-1908 | ప్రాగ్దేశపు పర్దా; వీరవంశజుడు; భూపేంద్రుని స్వాగతం. |
| 12-7-1908 | మాశుచ!; పోలీసు పరిపాలన. |
| *19-7-1908 | కృష్ణాజిల్లాలోని కలవరం. |
| 26-7-1908 | దీని అర్థమేమి? |
| 2-8-1908 | తిలక్‌పై నేరారోపణ. |
| 9-8-1908 | సహాయము కావలెను; బహిష్కార దినము; మైసూరు నందలి వార్తాపత్రికా దిగ్బంధము. |
| 16-8-1908 | న్యాయస్థానములు. |
| 6-9-1908 | తుర్కీ యొక్క రాజ్యాంగ నిర్మాణము. |
| 25-10-1908 | ట్రాన్సువాలు ఘోరములు. |
| 1-11-1908 | 1858 సంవత్సరపు విక్టోరియా మహారాణి గారి యొక్క ప్రసిద్ధ ప్రకటన యొక్క పంచాశర్వాత్సరికోత్సవము. |

---

* కృష్ణాపత్రికలో తీవ్ర సంచలనం సృష్టించిన వ్యాసం వ్రాసినందుకు 18-7-1908 నుండి శ్రీ అవటపల్లి వారు, ముట్నూరి వారు కృష్ణా పత్రికాధిపత్యం వదలుకో వలసి వచ్చింది. (19-7-1908 నాటి ప్రకటన).

| | |
|---|---|
| 7.2 1909 | స్వరాజ్ రాజ్యద్రోహపు అప్పీలు. |
| 14.2.1909 | ఆంగ్లో ఇండియన్ల నడవడి. |
| 21 2.1909 | ఆంధ్ర జాతీయ కళాశాల. |
| 28.2.1909 | కవి పండిత సభ, మన మండల సభ, నరసాపురం జాబు ఇంగ్లాండు స్వదేశీయోద్యమం. |
| 7.3.1909 | శ్రీ కాలజ్ఞానాభ్యుదయము, జపానులో విద్య. |
| 14.3.1909 | ఫిలిప్పియన్లు. |
| 21.3.1909 | పారిశ్రామిక విద్య. |
| 28.3.1909 | కొత్త సంవత్సరము; మన మండల మహాసభలు. |
| 2.4 19099 | లీగలు మెంబరు; ఏలూరు ప్రదర్శనము. |
| 9.4.1909 | క్రొత్త మార్గము. |
| 16.4.1909 | మండల సభ I, గురుకులము. |
| 23.4 1909 | మండల సభ II; స్వరాజ్ రాజద్రోహపు కేసు. |
| 30.4.1909 | మన దూది పరిశ్రమ; *దుష్టగ్రంథము |
| 7.5.1909 | ట్రాన్సువాలులోని ఇండియన్ల దారుణశిక్ష |
| 14.5.1909 | అలీపూరు బాంబుకేసు; అరవింద ఘోష; బందిపోటులు, ధూమనౌకా సంఘములు |
| 21.5.1909 | పోలీసువారి నీతి |
| 28.5.1909 | గుంటూరుద్యోగస్థులు; హీనజాతులు; భారతి సమాజము |
| 4.6.1909 | గుంటూరుద్యోగస్థులు II |
| 11.6.1909 | రాబోవు రాజధాని సభ; కరూరు రాజద్రోహపు కేసు |
| 18.6.1909 | అసత్యారోపణము; బరోడాలో నిర్బంధ విద్య. |
| 25.6.1909 | స్వదేశ బాంధవ సమితి, రైల్వే ఆపద; రంగయ్య శ్రేష్ఠి. |
| 2.7.1909 | రయిలులే అప్యాయము, నేటాలుకు వలస, స్వదేశ వస్తు సంత. |
| 9.7.1909 | నరహత్యలు; పరిపాలకుల కర్తవ్యం. |

* 30.4.1909 నాటి సంపాదకీయం – 3.5.1908 నాటి సంపాదకీయా లపై ప్రతిపక్షులు కోర్టులో దావావేస్తే పత్రికకే గెలుపు సంభవించింది.

| | |
|---|---|
| 16-7-1909 | కీర్తిశేషులగు రిపన్ ప్రభువు. |
| 23-7-1909 | సురేంద్రనాథుని కార్యదీక్ష; జపానుల శక్తి; ఇంగ్లాండు ఖ్యాతి; బంగళా పోలీసు. |
| 30-7-1909 | ఆక్రమణలు, భూమిశిస్తు. |
| 6-8-1909 | ప్రాచీన వైద్యాలయములు; మన వర్తకము |
| 13-8-1909 | బహిష్కారజయంతి; స్వదేశ వర్తకము |
| 20-8-1909 | పారిశ్రామిక విజృంభణము |
| 27-8-1909 | ఆంధ్ర వాల్మీకి రామాయణము |
| 3-9-1909 | ఆర్య సమాజము; మన కారాగారము |
| 10-9 1909 | శ్రీకృష్ణజయంతి; వితంతూద్వాహము |
| 17-9-1909 | వంగ రాజధాని సభ; ప్రేమా వికాసము. |
| 24 9-1909 | జాతి భేదము; ధర్మ వర్తకము. |
| 1-10-1909 | హిందూదేశపు అసంతృప్తి; భారత స్త్రీలు; స్వాతంత్ర్య దర్శనము. |
| 8-10-1909 | కృష్ణస్వామయ్యంగారు; వ్యవసాయము. |
| 15-10-1909 | అఖండ భారత వర్ష ధర్మానుశాసనము; మహాలయము. |
| 29-10-1909 | ఆంధ్ర జాతీయ కళాశాల భవనములు. |
| 5-11-1909 | చెన్నపురి జాతీయ నిధి; వేశ్య కులము. |
| 12-11-1909 | చెన్నపురి శాసన నిర్మాణ సభికుల ఎన్నికలు; చీనా దేశీయోదయము. |
| 19-11-1909 | నూతన సంస్కరణలు; విదేశీ వర్తకము. |
| 26-11-1909 | లండనులో కాంగ్రెసును జరుపుట; మొదటి నెల్లూరు జిల్లా సభ. |
| 3-12-1909 | సంయుక్త మండల మహాసభలు; రమేష్‌చంద్రదత్తు. |
| 10-12-1909 | ట్రాన్సువాలు ఇండియన్లు; దారుణ శిక్ష. |
| 24-12-1909 | శాసన నిర్మాణ సభ్యులు; మున్సిపల్ సభలు, |
| 31-12-1909 | మహాజనసభ; లాహోరు మహాజనసభ |
| 7-1-1910 | నూతనోపద్రవము; మహారాష్ట్ర చరిత్రము; ఆనరబిల్ సుబ్బారావు పంతులుగారు |

14.1.1910 ఆతిథ్య భృతి
21.1.1910 వ్యవసాయిక ప్రదర్శనములు
28.1.1910 నిర్బంధ శాసనములు
18.2.1910 పత్రికా శాసనములు; క్రొత్త పార్లమెంటు; అరాజకము నణచుట
25.2.1910 ఆంధ్ర జాతీయ కళాశాల
4.3.1910 ట్రాన్సువాలు ఇండియనులు
11.3.1910 క్రొత్త పన్నులు; బొబ్బిలి మహారాజుగారు
18.3.1910 వ్యవసాయ శాస్త్రము
25.3.1910 ప్రయిమరీ విద్య; సామ్రాజ్య శాసననిర్మాణ సభ (దక్షిణాఫ్రికాలోని భారతధీరుడు M. K. గాంధీపై వ్యాసం)
1.4.1910 వార్తాపత్రికలు; ఒక విరాళము
8.4.1910 సంవత్సరాది; కృష్ణా గుంటూరుమండల సభ
15.4.1910 పారిశ్రామికోద్యమము; సురాపానము.
22.4.1910 స్కూలు జీవితము
29.4.1910 సోమాలీ దేశము
6.5.1910 అడవి జంతువులు
13.5.1910 ఎడ్వర్డు ప్రభు నిర్యాణము; పల్లపుసాగు
20.5.1910 రివెన్యూ వసూలు
27.5.1910 పత్రికా శాసనము; పరస్పర సహాయనిధులు
3.6.1910 కృష్ణాగుంటూరుమండల సభ; 14వ గుంటూరుమండల సభ; సంఘ సంస్కరణ సభ
10.6.1910 గ్రామములు; రాజధాని సభ
17.6.1910 కోర్టు ఆఫ్ వార్డుసు
24.6.1910 కృష్ణాపత్రికాభివృద్ధి

* * *

24.3.1911 సభానిషేధ కుశాసనము
31.3.1911 సంవత్సరాది; రాజకీయోద్యోగములు, మండల మహాసభ
7.4.1911 రాజకీయోద్యోగములు II

| | |
|---|---|
| 14-4-1911 | రాజకీయోద్యోగములు III; జిల్లా బోర్డులు |
| 21-4-1911 | మన మండల సభ; ఆంధ్ర మహిళా సభలు |
| 28-4-1911 | ఆంధ్ర భాషాభివృద్ధి. |
| 5-5-1911 | ప్రారంభ విద్య; శుద్ధి సంస్కారము; గూఢచారుల బాధ. |
| 12-5-1911 | మన రాజధాని సభ; బందరు కొలతలు; స్వపరిపాలనము; ఆంధ్ర భాష. |
| 19-5-1911 | అంత్య వర్ణముల యుద్ధరణ; ఆంధ్రపత్రిక; యూనియనులు; గట్టితూము పన్ను. |
| 26-5 1911 | పారిశ్రామిక స్థితి; గ్రామ పంచాయతీలు. |
| 2-6-1911 | ఒక అపూర్వ సలహా; స్థానిక స్వపరిపాలనము; పోలీసు వారి నీతి. |
| 9-6-1911 | ఫిలిప్పియను దీవులు; ధారారాజ్యము. |
| 15 6-1911 | బందరు మ్యునిసిపాలిటి; హవురా కుట్రకేసు. |
| 23-6-1911 | పట్టాభిషేకోత్సవము; వ్యవసాయ సభలు; ఆషీగారి హత్య. |
| 30-6-1911 | పాలఘాటు మ్యునిసిపల్ కథ. |
| 7-7-1911 | పడుపు జీవనము. |
| 28-7-1911 | నవీనాదర్శము; మంగళవాద్య పరీక్ష; పార్లమెంటు మహాసభ. |
| 4-8-1911 | యుగసంధి; రెండు గొప్ప ఉపన్యాసములు. |
| 11-8-1911 | భారత సంయుక్త జాతీయత |
| 18-8-1911 | ఆంగ్లేయుల స్వాతంత్ర్య విజయము |
| 25-8-1911 | నూతన వివాహ శాసనము; కాలస్థితి |
| 1-9-1911 | హిందూ సంఘము; నైజాముగారి మరణము; తునీరాణిగారు |
| 8-9-1911 | కృష్ణా జిల్లాలోని కొత్త మునసబు కోర్టులు; ప్రాయశ్చిత్తము; పారిశ్రామిక రక్షణ |
| 15-9-1911 | ఉపన్యాసపయోనిధి |
| 22-9-1911 | స్త్రీవైద్యాలయములు; క్షామములు |
| 6-10-1911 | ఇటలీ తురష్క దేశముల యుద్ధము; సేనావ్యయము; దసరా వేడుకలు |
| 13-10-1911 | ఖనిజములు; జనన మరణములు, అడవుల పాలనము |

| | |
|---|---|
| 20-10-1911 | ఆనరబిల్ అట్కిన్సను బిషప్పు సోదరి నివేదిత ఇండియను బిషప్పు. |
| 27-10-1911 | చినా విప్లవము; గూఢచారులు. |
| 3-11-1911 | సర్ ఆర్థర్ లాలీ; ట్రిపోలీ యుద్ధము; ఆంధ్ర సాహిత్య పరిషత్తు. |
| 10-11-1911 | చీనా విప్లవము; కమ్మ మహా జనసభ; బందరులో పట్టాభిషేక వేడుకలు. |
| 17-11-1911 | నవ్య వ్యవసాయపు లెక్కలు; బందరు మ్యునిసిపలు వార్డులు; కాశీ మహాసభ; బందరు దర్బారు వేడుకలు. |
| 24-11-1911 | సర్ థామస్సు కార్మికేలు. |
| 1-12-1911 | కమ్మ మహాజన సభ; రజస్వలా వివాహములు. |
| 8-12-1911 | పట్టాభిషేక మహోత్సవము, బందరు దర్బారు. |
| 15-12-1911 | పట్టాభిషేక మహోత్సవము. |
| 22-12-1911 | పారశీక రాజ్యము. |
| 29-12-1911 | దేశీయ మహాజన సభ, కృష్ణ స్వామయ్య గారి మరణము. |
| 5-1-1912 | విశ్వబ్రాహ్మణ సభ; రాజ దంపతులు, మదపుటేనుగులు. |
| 19-1-1912 | ఆశియా ఖండము; పరగణాల మార్పులు. |
| 26-1-1912 | బందరు మ్యునిసిపాలిటి; మిస్ డాక్టరు కుగ్లరు; కార్మికేలు ప్రభువు; బెల్ ఫాస్టు సభ: మిస్ బెనెంటు. |
| 2-2-1912 | డాక్టరు సన్. యట్. సెన్; శారదా నికేతనము. |
| 9-2-1912 | లోకలు బోర్డులు; తాతయ్య కథలు; మున్సిపల్ ఎన్నికలు. |
| 16-2-1912 | మదరాసు శాసన సభ నిర్మాణ సభ; శాసన సభలోని చర్చలు; పెంట్రెండు ప్రభువు. |
| 23-2-1912 | కరణముల వేతనములు; ఆనరబిల్ శివస్వామి అయ్యరు. |
| 1-3-1912 | జిల్లా బోర్డులు; అధికార విభజనము; ప్రభువుల సభ. |
| 8-3-1912 | రాబోవు నిడదవోలు సభ; ఇండియా దొరతనము వారి ఆయవ్యయ వివరము. |
| 15-3-1912 | పత్రికా ప్రచారము; ఇంగ్లాండులోని కూలీవాండ్ర తిరుగుబాటు. |

22-3-1912 రాబోవు నిడదవోలు సభ; ప్రైమరీ ఎడ్యుకేషన్ బిల్లు.
29-3-1912 సంస్కరణ సభలు; కార్మికేలు ప్రభువు.
5 4-1912 విశ్వవిద్యాలయములు; బందరు మ్యునిసిపలు ఎన్నికలు; ఘోర విపత్తు.
26-4-1912 వంగభాషాభివృద్ధి; ఆంధ్ర పత్రిక; టైటేనికు విపత్తు
3-5-1512 పత్రికా సామ్రాజ్య చక్రవర్తి (Reviews of Reviews Editor W. D. Stedd's Death);
ట్రిపోలీయుద్ధము; బ్రిటిషు ఈస్టు ఆఫ్రికా
10-5-1912 రాజధాని సభ; శేషగిరి అయ్యరుగారి ఉపన్యాసము; స్వర్గవాసులగు రఘునాధరావుగారు
7-6-1912 మదరాసు శాసన నిర్మాణ సభ; రిమిషన్లు; ఎలిమెంటరీ పాఠశాలలు
14-6-1912 శాసన సభా నియమములు; ప్రత్యేకాంధ్ర రాష్ట్రము; తెల్లబానిస వ్యాపారము, శ్రీమతి సత్యభామాబాయి
21-6-1912 మ్యునిసిపలు చైరుమనుల ఎన్నిక; అవధానములు
28-6-1912 సాధుమండలి; ఉద్దండ భారతీయుడు (గాంధి); ధర్మగ్రంథములు; జింజూరు యుద్ధము
5-7-1912 స్వపరిపాలనము
12-7-1912 ఆంధ్ర విశ్వవిద్యాలయము; కీ. శే. దుగ్గిరాల రామమూర్తిగారు
26-7-1912 ఆంధ్రమహాజనసభ
2-8-1912 జపాను చక్రవర్తి నిర్యాణము; ఓ. ఏ. హ్యూమ్
9-8-1912 ఆనరబిల్ మాంటెంగ్‌గారి యుపన్యాసము; కృష్ణవెల్లువ
23-8-1912 సర్కారు ఉద్యోగములు (ఆంధ్ర జాతీయ కళాశాల - కృష్ణా పత్రికానుబంధం)
31-8-1912 సర్కారు ఉద్యోగములు II; ఆంధ్ర రాష్ట్రోద్యమం I
7-9-1912 ఆంధ్ర రాష్ట్రోద్యమం II
14-9-1912 ఇండియా దేశపు ౬౬ కోట్ల రూపాయలు ఇంగ్లాండులో నిలువ చేయుట,
వేమూరి వెంకట సుబ్బారావు పంతులుగారు బి.ఏ.

| | |
|---|---|
| 21-9-1912 | బాలికా మానరక్షణము |
| 28-9-1912 | శ్రీ రాజారామమోహనరాయలు; ఆనరబిల్ మోచర్ల రామచంద్రరావుగారు. |
| 5-10-1912 | దసరా పండుగ |
| 12-10-1912 | తురుష్క బాలికనుల యుద్ధము; సమరోత్సాహము; ఆంధ్ర జాతి |
| 26-10-1912 | స్థానిక స్వపరి పాలనము; ఆంధ్రా స్తిక మహాసభ; తురుష్కుల అపజయము |
| 2-11-1912 | బంగారు నాణెములు; యుద్ధ జ్వాలలు |
| 9-11-1912 | దీపావళి పండుగ; ఆయుర్వేద ప్రచారిణీ సభ; తురుష్కుల అపజయం; సంధి యత్నములు |
| 16-12-1912 | కాంస్టేంస్టినోపిలు దుస్థితి; కాలరుద్ర సందర్శనము; నాజీం పాషాగారి సంధి ప్రయత్నము; ఐరోపా రాష్ట్రముల యుద్ధ సన్నాహము |
| 23-11-1912 | తురుష్కుల ప్రతిరోధము |
| 30-11-1912 | ఆంధ్రుల సింహనాదము I; కృష్ణా జిల్లాలోని సబ్ కోర్టులు; ప్రజాక్షయము |
| 7-12-1912 | తురుష్క బాల్కనుల సంధి |
| 14-12-1912 | పబ్లికు సర్వీసు కమీషను; సెంట్ జెమ్స్ రాజమందిరము; దేశీయ మహాజన సభ |
| 21-12-1912 | గోక్లేగారి రాజనీతి; రాయబారుల సమావేశము; రీనా మహారాణి |
| 28-12-1912 | ౨౭వ దేశీయ మహాసభ; బ్యాంకి పురమున ౨౬వ తేదీని సమావేశము సభాధ్యక్షుని ప్రారంభోపన్యాసము; బాంబు ప్రయోగము |
| 4-1-1913 | గత వత్సరము; విశ్వబ్రాహ్మణ మహాసభ |
| 11-1-1913 | రాయల్ కమీషన్; కృష్ణామండల సభ; పండిత రామావతార శర్మ; రాయబారము |
| 18-1-1913 | రాయల్ కమీషన్; న్యాపతి సుబ్బారావుగారు; కొంతి రామమూర్తిగారు. |

| | |
|---|---|
| 8-2-1913 | ఆంధ్రపత్రికా విచిత్ర యశోరుంధ్రత; న్యాపతి సుబ్బారావు పంతులుగారు; పాయిన్ కేర్; ఎడ్రియా నోపిలు ముట్టడి, కీ.శే. లైన నాజీంపాషా. |
| 15-2-1913 | పబ్లిక్ సర్వీసు కమీషను; యశోవా మృత్యుర్వా. |
| 22-2-1913 | దేశీయ పరక సంఘములు; తుర్కుల ప్రతిరోధము; మిస్ లేజరస్ బి ఏ.; ఆంధ్రులు. |
| 1-3-1913 | కమ్మ మహాజన సభ. |
| 8-3-1913 | లోకలు బోర్డులు; టర్కీ యుద్ధము |
| 15-3-1913 | కృష్ణామండల సభ; టర్కీ యుద్ధము; కృష్ణామండల సభ (సన్మాన సంఘాధ్యక్షుని ఉపన్యాసం.) |
| 29-3-1913 | కృష్ణా గోదావరి మండల సభలు. |
| 5-4-1913 | ఎడ్రియా నోపిలు ముట్టడి. |
| 12-4-1913 | మహానందీ సమావేశము. |
| 19-4-1913 | ఐరోపా రాష్ట్రముల శీతావహము. |
| 26-4-1913 | మహానందీ సందర్శనము |
| 3-5-1913 | ఉత్తర సర్కారుల సహకారసభ; న్యూటారీ సమస్య. |
| 10-5-1913 | మదరాసు రాజధాని సభ |
| 17-5-1913 | ఆంధ్రులు-ఉద్యోగములు |
| 25-5-1913 | మాతృ సందర్శనము |
| 31-5-1913 | ఆంధ్రమహాసభ I |
| 7-6-1913 | ఆంధ్ర మహాజన సభ II |
| 14-6-1913 | ఆంధ్ర మహాజన సభ III |
| 28-6-1913 | దక్షిణ ఆఫ్రికా సమస్య |
| 5-7-1913 | బాల్కనుల ఒడంబడిక; ప్రవాసమందున్న ఆంధ్రులు; పరపతి సంఘములు |
| 12-7-1913 | బాల్కనుల క్షయము; ప్రవాసమందున్న ఆంధ్రులు; కరణముల కలవరము |
| 19-7-1913 | రవీంద్రుని దిగ్విజయము I |
| 26-7-1913 | రవీంద్రుని దిగ్విజయము II |

| | |
|---|---|
| 2-8-1913 | స్వపరిపాలనము |
| 9-8-1913 | రవీంద్రుని దిగ్విజయము III; కనడాయందలి భారతీయులు |
| 16-8-1913 | మాంటెగ్యూగారి యుపన్యాసము |
| 23-8-1913 | మాంటెగ్యూగారి యుపన్యాసము II; కళాశాలలు; ప్రిస్టిల్లా |
| 30-8-1913 | నిర్మల జీవనము; తమిళుల స్వయంవరము |
| 6-9-1913 | రాజ్యాంగ శిక్ష I; నౌరోజీ వర్ధంతి |
| 13-9-1913 | శివస్వామి అయ్యరు గారి పర్యటన |
| 20-9-1913 | వైస్రాయి గారి యుపన్యాసము; ఎడ్రియా నోపిలు; మూల పురుషులు |
| 27-9-1913 | మహాలయము; దాదాభాయి నౌరోజీగారి సందేశము |
| 4-10-1913 | అనిబిసెంటమ్మగారి సృష్టి వైచిత్ర్యములు |
| 18-10-1913 | చీనా రాష్ట్రము; కాన్పూరు మసీదు |
| 25-10-1913 | దీపావళి పండుగ; చెన్నపురి స్వదేశీ సంఘము |
| 1-11-1913 | దక్షిణాఫ్రికాలోని భారతీయులు I |
| 8-11-1913 | దక్షిణాఫ్రికాలోని భారతీయులు II |
| 15-11-1913 | రివరెండు పెన్ను దొరగారి చేష్టలు; కరమ్ చెంద్ గంధి |
| 22-11-1913 | సాహిత్య చక్రవర్తి |
| 29-11-1913 | బ్రిటిషు సామ్రాజ్యము |
| 6-12-1913 | నాటక ప్రదర్శనము; ప్రతిఫల ధర్మము |
| 13-12-1913 | ఆంధ్ర విశ్వవిద్యాలయము; ఆంధ్ర మహాజన సభ; ఆంధ్ర జాతీయ కళాశాల; దక్షిణాఫ్రికా |
| 20-12-1913 | ఆంధ్రోద్యమము |
| 27-12-1913 | ఆంధ్రోద్యమము; కీ. శే. లగు జడ్జి సుందరయ్య గారు |
| 3-1-1914 | దేశీయ మహాసభలు; (కరాచీలో జరిగిన సభల సమీక్ష) పోలీసు పరిపాలన; హిందూలా; హైకోర్టు నందలి జడ్జిపదవి. |
| 10-1-1914 | కృష్ణాజిల్లా లోకలు బోర్డులు |
| 17-1-1914 | మైనరు బాలికల సంరక్షణ బిల్లు |
| 24-1-1914 | మెయిూడెనుగారి అభినందన పత్రిక |

| | |
|---|---|
| 31-1-1914 | రెవెన్యూ జమాబంది; స్థానిక స్వపరిపాలనము; ప్రజా ప్రతినిధులు |
| 7-2-1914 | మెడికలు రిజిస్ట్రేషన్ బిల్లు; రాబోవు దేశీయ మహాజన సభ; కమ్మమహాజనసభ; తాలూకాబోర్డులు; ఆంధ్ర జాతీయ కళాశాల; పబ్లికు సర్వీసు కమీషన్ |
| 21-2-1914 | ఆంధ్ర జాతీయ కళాశాల |
| 28-2-1914 | సంఘ సంస్కరణ సభలు |
| 7-3-1914 | ఓ! ఆంధ్రనాయకులారా! |
| 14-3-1914 | దుఃఖ కరమైన వృత్తాంతము; నాల్గవ కమ్మ మహాజనసభ |
| 21-3-1914 | ఐర్లాండు సమస్య |
| 28-3-1914 | ఆహ్వానము (ప్రమాదికి వీడ్కోలు ఆనందకు స్వాగతం); అల్స్టరువారి బెదిరింపు; క్రొత్త పంచాంగము (హాస్య, వ్యంగ్య రచన) |
| 11-4-1914 | జాతీయాదర్శము; రావుబహద్దూరు పి. వెంకయ్య పంతులు ఉపన్యాసము. |
| 18-4-1914 | ద్వితీయాంధ్ర మహాజన సభ; సుబ్బారావు పంతులు గారి యుపన్యాసము. |
| 25-4-1914 | ఆంధ్ర రాష్ట్ర తీర్మానము; విజ్ఞాన చంద్రికా మండలి |
| 2-5-1914 | ఆంధ్రరాష్ట్రము ఆదర్శమా?; హైకోర్టు జడ్జి ఉద్యోగములు, ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల |
| 9-5-1914 | ఆంధ్ర సాహిత్య పరిషత్తు; బీసెంటమ్మ అప్పీలు |
| 16-5-1914 | విశాఖ మండల సభ |
| 23-5-1914 | ఢిల్లీ నగర నిర్మాణము (9 కోట్ల ఖర్చుపై విమర్శ), కుల సభలు |
| 30-5-1914 | ఆంధ్ర రాష్ట్రము; చెరువులు; హోమురూలు బిల్లు (ఐరిష్) |
| 6-6-1914 | కాంగ్రెసు ప్రతినిధులు I |
| 13-6-1914 | ఎత్తుకెత్తు; కాంగ్రెసు ప్రతినిధులు II |
| 20-6-1914 | కాంగ్రెసు ప్రతినిధులు III; తిలకుగారి కారాగార విముక్తి ఐర్లాండు పాఠాలు |

27.6.1914 కాంగ్రెసు, స్పెయిన్ దేశపు కన్యలు
4.7.1914 కాంగ్రెసు II
11.7.1914 కాంగ్రెసు III, ఇండియా కౌంసిలు బిల్లు, కొత్త యువ ద్రవము*
18.7.1914 కాంగ్రెసుIV; మన నాయకులు I; హార్డింగ్ ప్రభ్వి (స్మృతి)
1.8.1914 మన నాయకులు II; కాశీ విశ్వవిద్యాలయం
8.8.1914 ఐరోపారాష్ట్ర సంఘర్షణము
15.8.1914 ఆ దినము
22.8.1914 భారతీయుల ధర్మము
29.8.1914* బ్రిటిషు సామ్రాజ్య విజయము (ప్రపంచ యుద్ధం); పెంట్లెండు గారి విజ్ఞాపనము
5.9.1914 యుద్ధము
12.9.1914 బ్రిటిషు సామ్రాజ్యము; జార్జి చక్రవర్తి గారి సందేశము
19.9.1914 మహాలయము; స్వస్తి
26.9.1914 శ్రీ రాజా రామమోహనరాయలు; యుద్ధ విశేషములు
3.10.1914 కమటాగమారు; వదంతులు; యుద్ధము
10.10.1914 యుద్ధము; కీడులో మేలు
17.10.1914 జర్మనుల కపట ప్రయత్నములు; ఆస్ట్రియా జర్మనులతో మనకు గల వ్యాపారము; ఇరిగేషను బిల్లు; కాంగ్రెసు ప్రెసిడెంటు
24.10.1914 కృష్ణామండల సభ; టర్కీవారి పట్టుదల; యుద్ధము.
31.10.1914 13 వారముల యుద్ధము.
7.11.1914 టర్కీ.
14.11.1914 యుద్ధము; ఎమ్డెను వధ.

---

* స్కూళ్ళలో విద్యార్థులను చేర్చుకొనుటకు డొనేషన్లు - ఫీజులు వసూలు చేయడంపై విమర్శ

* మొదటి ప్రపంచ యుద్ధం ఆరంభమైంది. ప్రతి సంచికలోనూ యుద్ధాన్ని గురించి సంపాదకీయం కనిపిస్తుంది.

| | |
|---|---|
| 21-11-1914 | దుర్బోధలు; ఇంగ్లాండు యుద్ధము. |
| 28-11-1914 | సమాలోచనము; కబుర్లు. |
| 5-12-1914 | గవర్నరు గారి రాక; బందరు టౌనుహాలు; కాలపురుషుడు. |
| 12-12-1914 | ఫ్లాండర్సు యుద్ధము. |
| 19-12-1914 | కాంగ్రెసు; ఈజిప్టు; ఇటలీ; జర్మను నావల సహాయము. |
| 26-12-1914 | ముద్రణా శాసనము; పరిశ్రమలు. |
| 2-1-1915 | దేశీయ మహాజన సభ; రిపన్ ప్రభువు శిలా ప్రతిమ. |
| 9-1-1915 | కృష్ణ కో-ఆపరేటివు బ్యాంకు. |
| 16-1-1915 | గ్రామ కోర్టులు; బందరు మ్యునిసిపాలిటి. |
| 23-1-1915 | నగర నిర్మాణము. |
| 30-1-1915 | రజస్వలానంతర వివాహ శాసనము; నల్లమందు; హిందూ హైస్కూలు; బ్రిటిషు నావికా విజయము, గాజు వర్తకము. |
| 11-8-1915 | జపాను వర్తకము; రాష్ట్ర పారిశుద్ధ్యము; బాల్కాను రాష్ట్రములు. |
| 18-8-1915 | యుద్ధము; శ్రీ పిఠాపురము రాజుగారు. |
| 25-8-1915 | కడప జిల్లా సభ; సర్ అలీ ఇమామ్; గ్రామదేవత. |
| 4-12-1915 | స్వైపసు; కీ. శే. లైన గురజాడ అప్పారావుగారు. |
| 11-12-1915 | యుద్ధము త్వరలో ముగియునా?; సతీసావిత్రులు; యుద్ధము. |
| 18-12-1915 | కాంగ్రెసు సభలు; మ్యునిసిపల్ ఎన్నిక. |
| 25-12-1915 | కాంగ్రెసును చంపుడు; యుద్ధము. |
| 1-1-1916 | తపసా విజిజ్ఞాసస్య. |
| 22-4-1916 | 25 సంవత్సరములు. |
| 29-4-1916 | గుడివాడ సభలు, యుద్ధము. |
| 6-5-1916 | ఆంధ్రమహా జనసభ; కృష్ణా కో-ఆపరేటివు సభ; ఐర్లాండు విద్రోహము. |
| 13-5-1916 | నాల్గవ ఆంధ్రమహాజనుల సభ; హిందూ మత మహాసభ |
| 20-5-1916 | కాకినాడ కాలేజి; * కొప్పరపు కవులు; కృష్ణా మండల విభజనము; హిందూ మతము |
| 27-5-1916 | యుద్ధము; కొప్పరపు కవులు; భాషాప్రయుక్త రాష్ట్రము |

* తిరుపతి, కొప్పరపు కవుల వివాదము

| | |
|---|---|
| 3.6.1916 | న్యూ ఇండియా; కొప్పరపు కవులు |
| 10.6.1916 | యుద్ధ విషయములు (ఇటలీ, ఫ్రాన్సు, తురుష్కస్థానము, జర్మనీ, కిచనరు) |
| 17.6.1916 | ముద్రణా శాసనము; యుద్ధము |
| 24.6.1916 | భారతీయ సైన్యము; నియోగిమహాజన సభ; జాతీయ పద్ధతి; యుద్ధము |
| 1.7.1916 | సముద్రాధిపత్యము |
| 8.7.1916 | బ్రిటిషువారి విజృంభణము |
| 15.7.1916 | అనిబిసెంటమ్మ; కొన్ని ప్రశ్నలు |
| 22 7.1916 | ఆంధ్ర జాతీయ కళాశాల, యుద్ధము |
| 29.7.1916 | రాజనీతి, యుద్ధము |
| 5.8.1916 | ఆగస్టు 4, శతావధాని వేంకట శాస్త్రిగారు |
| 12.8.1916 | కవిపూజ (శతావధాని శాస్త్రిగారికి బందరు ప్రజల సన్మానం), రాష్ట్రవాదులు |
| 19.8.1916 | రాష్ట్రవాదులు II |
| 26.8.1916 | రాష్ట్రవాదులు III, యుద్ధము |
| 2.9.1916 | రాష్ట్రవాదులు IV, రుమేనియా, బిసెంటమ్మ |
| 9.9.1916 | స్వరాజ్య సమితి, గీతారహస్యము |
| 16.9.1916 | బాల్కనుల యుద్ధరంగము |
| 23.9.1916 | శ్రీ రామమోహన రాయలు (దీపావళి భిక్ష) |
| 30.9.1916 | యుద్ధము, స్వరాజ్య సమితులు |
| 14.10.1916 | రామమోహన రాయలు, దీపావళి భిక్ష |
| 21.10.1916 | రాజకీయ సంస్కరణములు I |
| 28.10.1916 | రాజకీయ సంస్కరణములు II, నెల్లూరు మండల సభ |

---

| | |
|---|---|
| 9.9 1916 న | కాళిదాసుని ప్రణయ కీర్తనము. |
| 16.9.1916 న | కుమార సంభవం. |
| 23.9.1916 న | అభిజ్ఞానశాకుంతలము. |
| 21.10.1916 న | మేఘసందేశం మొదలైన సాహిత్య వ్యాసాలు (ము. కృ. గారివి) ప్రచురింపబడ్డాయి. ఈ వ్యాసాలే "సమీక్ష"గా పుస్తక రూపందాల్చాయి. |

| | |
|---|---|
| 4-11 1916 | యుద్ధము; రుమేనియా; ఇంకొకటి |
| 11-11-1916 | సంస్థానాధీశుల సభ; కృష్ణ వరదలు; అరేబియా |
| 19-11-1916 | విద్యా సంస్కరణములు; ఎ.బి. క్లాసులు; మెయిలు పత్రిక |
| 25-11-1916 | కృష్ణాడెల్టా, 5 నిముషముల సభ, గ్రీసు రొమేనియా |
| 2 12-1916 | జాతీయ పతాకము, కృష్ణాజిల్లా జడ్జి, యుద్ధము |
| 9-12-1916 | సంధి |
| 16-12-1916 | బంగాళా అరాచకము, జర్మనుల స్వప్నము |
| 23 12-1916 | స్వరాజ్య సంపాదనము, యుద్ధము |
| 30-12-1916 | జాతీయ పర్వము |
| 6-1-1917 | సంధి ప్రయత్నము, రాబోవు యుద్ధము |
| 13-1-1917 | రైళ్ళ గడబిడ, యుద్ధము |
| 20-1-1917 | బెజవాడ మ్యున్సిపాలిటి, దేశీయ సభ్యుడు, స్వరాజ్య సమితులు, యుద్ధము |
| 21-1-1917 | సామ్రాజ్య సభ; డైరెక్టరుల సభ; యుద్ధము; శ్రీ వివేకానందస్వామి |
| 3-2-1917 | వర్తకులకు మంచి తరుణము; సర్కారు ఉద్యోగములు; ఆంధ్ర కాంగ్రెసు కమిటి; యుద్ధము; పూర్వపాశ్చాత్య సమన్వయము |
| 10-2-1917 | ఆంధ్ర విశ్వవిద్యాలయము; ఆంధ్ర సాహిత్య పరిషత్తు; యుద్ధము |
| 17-2-1917 | యుద్ధము; బెజవాడ రామమోహన మిషను: ఆంధ్రోద్యమము; క్షయవ్యాధి |
| 24-2-1917 | రక్షణ సైన్యము; జర్మన్ సబ్ మెరైనులు; ధర్మ సమన్వయము; సాధన భూమి; విద్యార్థులు—సభలు |
| 3-3-1917 | ప్రపంచ వర్తకము; ఆంధ్ర పరిశోధక మండలి |
| 10-3-1917 | 150 కోట్ల రూపాయల దానము; మల్లాది సత్యలింగంగారి ధర్మములు |
| 17-3-1917 | కృష్ణాజిల్లా రైతుల సంక్షోభము; విదేశీ వస్త్రములపై పన్నులు |

